అముద్రితాంధ్రగ్రంథసర్వస్వము ౨.

ద్వితీయగ్రంథము.

చలికాని లచ్చారావు

సంపాదకుఁడు.

# సీమంతినీకల్యాణము.



అముద్రితాంధ్రగ్రంథసర్వస్వము

ద్వితీయగ్రంథము. ౨

చ లి కా ని ల చ్చా రా వు.

సంపాదకుఁడు.

# సీమంతినీకల్యాణము.

ఇది

(పిల్లలమఱ్ఱి పినవీరభద్రకవివంశములోనివాఁడగు)

పెనుమళ్లసోమమంత్రి ప్రణీతము.



మొదటికూర్పు.





శ్రీవిద్వజ్జనమనోరంజనీముద్రాక్షరశాలయందు

ముద్రితము.

పీఠాపురము.

1919.

# పీఠిక.

ఈకవి సుప్రసిద్ధుడగు పిల్లలమఱ్ఱి పినవీరభద్రకవివంశములో నివాఁడగుటచేతను రాజధర్మంబులు, గృహస్థధర్మంబులు, పతివ్రతాలక్షణంబులు, వ్రతఫలంబులు నాదిగాఁగల పెక్కువిశేషంబు లుండుటచేతను మఱియుఁ బాతాళగంగ, పాతాళలోకము (అమెరికాదేశమును మనవారు పాతాళలోకముగా భావించుచున్నారు.) వింధ్యపర్వతము మొదలగుచరిత్రాంశములకుఁ దోడ్పడువిషయంబు లుండుటచేతను నీపొత్తంబును ద్వితీయగ్రంథముగా ముద్రించితిమి. కవిత్వము ద్రాక్షాపాకమునుబోలియున్నప్పటికి నందలిరసంబు గ్రహించి విశేషములు పరికింపఁబోవుభారమును జదువరులకే వదలిపెట్టుచున్నారము.

సీ. గీ. "సకలసుకవిజనానంద ♦ జనకమధుర
నవ్యతరకావ్యకల్పనా ♦ నల్పయోగ
సర్వసర్వంసహాధిపా ♦ స్థాన చిరయ
శోభనుఁడ సోమమంత్రీంద్ర ♦ సుకవి నేను"

అని కవియే చెప్పుకొనియున్నాఁడు. కవి తనయిచ్ఛానుసారముగాఁ బోవునపుడు తనకవితానిపుణతను జూపఁగలఁడుగాని పెక్కువిషయంబులు బోధింపదలఁచుకొని కొద్దిలో నిముడ్చఁదలఁచుకొనినప్పుడు. నాతనికవితాశక్తి విజృంభింపఁజాలనపుడు నింతియే యీతని కవిత యని యనుకొనుటకు వీలుకలుగదు. ఈతనిశైలిభావము దెలియుటకై యొక్కపద్యంబుమాత్రమే యిం దుదాహరించుచున్నవాఁడను.

గీ. దుర్జనునికల్మి దురితంపుఁ ♦ ద్రోవ కగును
సజ్జనునికల్మి పుణ్యంబు ♦ సరణి కగును
పాముబలసిన గరళంబు ♦ ప్రబల మగును
[illegible]

# ఈతని వంశవృక్షము.

భారద్వాజముని.

- (1) పిల్లలమఱ్ఱి గాదిరాజు (12 గురుసోదరులు) (వాగాంబ)
  - పెదవీరన్న (మంత్రి)
  - (2) పినవీరన్న 1450 క్రీ॥శ॥ (జైమినీభారతకర్త)
    - వీరన్న
    - (3) మల్లేశ్వరుఁడు (ఇతఁడు కటకేశ్వరునివలన పెనుమళ్లగ్రామము నొంది యటవసింప నంతనుండి పెనుమళ్లవారైరి)
      - వీరన్న
        - నర్సన్న
          - ఈశ్వరపుత్రులలో ఉమన్న
            - నర్సన్న.
      - (4) సోమేశ్వరుఁడు
        - (5) దాచిరాజు
          - పెదసోమన్న
          - చినసోమన్న
            - శాయన్న
              - బాపమంత్రి (పేరమ్మ)
                - బసవమంత్రి (నందపురము కృష్ణదేవుని మంత్రి) 1650 క్రీ॥శ॥
          - (6) పాపిడిసోమన్న.
            - (7) సోమన్న (ఇద్దఱుభార్యలు) (లక్ష్మి)
              - (8) పెదనీలన్న
                - (9) సోమమంత్రి
                - లచ్చయార్య.
              - చిననీలన్న
  - భద్రమ్మ.

ఈగ్రంథము తునినివాసస్థులు జంగమకులస్థులగు పురాణం చెన్నమల్లయ్యగారికుమార్తె కపిల చిన్నమ్మగారియింటిలో దొరకినది. ఈగ్రంథము లోకోపకారార్థము ప్రకటింప మాకిచ్చినయీవనితారత్నముకృత్య మెంతయుఁ బ్రశంసనీయము. ఈగ్రంథసంపాదనమునకుఁ దోడ్పడిన "విద్యానందసోదరుల" లో నొకరగు కె. రంగనాయకులుగారును బ్రశంసనీయులు. ఇది శైవగ్రంథమగుట నామతస్థులయింటిలో దొరకుటలో నాశ్చర్యము లేదు. ఇట్లే తమకడఁ బ్రాచీన గ్రంథము లున్నవారు చివుకఁబెట్టి పారవేయక మాకంపి దేశోపకారమొనర్చెదరని నమ్ముచున్నారము. ఈగ్రంథము తమకుఁ జేరినవెంటనే మాకంపిన శ్రీవిద్యానందపుస్తకాలయమువారికిని గృతజ్ఞులము. ఈగ్రంథరాజమునం దక్కడక్కడ పోయినయక్షరంబులను శ్రద్ధతోఁ బూరించిన శ్రీగాడేపల్లి సూర్యనారాయణశర్మగారికి మాకృతజ్ఞతా వందనంబు లర్పించుచున్నారము.

పిల్లలమఱ్ఱి పినవీరభద్రుఁడు శృంగారశాకుంతలమునందుఁ గృత్యాదిలో "ఆసుకవిచేత శివభజనాసక్తునిచేతఁ గస్యపాన్వయుచేతన్ !" అని వ్రాసికొనెను. ఈకవి గాదిరాజు భరద్వాజాన్వయము వాఁడనుచున్నాఁడు. ఈపొరబాటునకుఁ గారణ మెద్దియో చరిత్రకారులు పరిశీలింతురుగాక !

శృంగారశాకుంతల మొక్కప్రతియే దొరికినదనియు దానినిబట్టియే సరస్వతీపత్రికాధిపతులు ముద్రించినట్లును దెలియుచున్నది. మేము సర్వజనపుస్తకాగారము రాజమహేంద్రవరమున నొకవ్రాతప్రతియుండఁగా మామిత్రులగు శ్రీ వంగూరి సుబ్బారావుగారి సది పరిక్షిం

'స్వశాఖ్యేయుచేతః'' అని 'స' కారము 'సు' కారము నగుచున్నదని వారు చూచివచ్చి చెప్పుచున్నారు. ఇంకను వ్రాతప్రతులు దొరికినప్పుడు కాని దీనినిశ్చయము తేల్చుటకు వీలుండదు. ప్రస్తుత మిరువురుకవుల వ్రాతలయందు నీభేద ముండుటకుం గారణములు తెలియుట లేదు.

30-3-19.
చిత్రాద.

ఇట్లు,
చెలికాని లచ్చారావు.
సంపాదకుఁడు.

శుభమస్తు.

అవిఘ్నమస్తు.

శ్రీసదాశివాయనమః.

# సీమంతినీకల్యాణము.

## ప్రథమాశ్వాసము.

* శ్రీవత్సాంకుఁడు భక్తవత్సలుఁడు ల ♦ క్ష్మీప్రాణనాథుండు రా
జీవాక్షుండు సమస్తభూతభువన ♦ క్షేమంకరానేకరూ
పావిర్భావుఁడు వాసుదేవుఁ డనుకం ♦ పాహాసుఁడై దానవి
ద్యావిఖ్యాతు(ల మంత్రివర్యుల) నితాం ♦ త(శ్రీలచేఁ బ్రోచుతన్.)

× × × × ×

× × × ను

త్తమపక్షుంబు గృహాంబుఁ జేసిన జగ ♦ త్కల్యాణపుంధాత్రి ని
త్యమహిన్ బ్రోది సుపర్వసర్వశుభదో ♦ దంచత్కృపాలోక యా
గమవాక్యస్తుతలక్ష్మి తోడగును మ ♦ త్కావ్యక్రియాసిద్ధికిన్.

---

* ఈగ్రంథమునందలి తొలిపద్యములు పోయినవి. అవి ప్రార్థనపద్యములు. గ్రంథము ప్రార్థనపద్యము లేకుండఁ బ్రారంభించుట శుభము కాదని మనపెద్ద లయభిప్రాయము. ప్రత్యంతర మింతవఱకు దొరక లేదు. అందువలన నీ సీమంతినీకల్యాణకర్త మూలపురుషుఁ డగుప్రసిద్ధకవి పిల్లలమఱ్ఱిపినవీరన శృంగారశాకుంతలమునందలి ప్రథమపద్యమును గొంచెము మార్చి మనుమనికృత్యాదికిఁ గలిగినలోపమును నివారించితిమి. సరసు లిది తప్పుగా భావింపకుందురు గాక!

† త్తమముతోఁ బ్రారంభింపఁబడినయీపద్యము రెండవది కాకపోవునని యెఱిఁగియు దీనికి రెండవసంఖ్య నేర్పఱచితిమి. ఇదియు నపచారమునకుఁ గాక పద్యసంఖ్య నేర్పఱచుకొనుసౌకర్యార్థమని విజ్ఞులు మన్నింతురు గాక!

సీ. వివిధఋగ్యజుస్సామ ♦ వేదరూపంబుచే, నలరుచునుండు నే ♦ యలరుఁబోఁడి
యనవద్యతర్కవే ♦ దాంతాదిమూర్తిచేఁ, గనుపట్టు నేదళ ♦ త్కంజనేత్ర
లాలితనాటకా ♦ లంకారశబ్దశా, స్త్రాకృతి గాంచు నే ♦ యబ్జవదన
సంగీతభరతశా ♦ స్త్రవిశేషరీతిచే, భాసిల్లుచుండు నే ♦ పల్లవోష్ఠి
యట్టిభారతిమృదులద ♦ యావలోక, నయసుధామయవర్షదా ♦ నంబుచేత
మాకుకోదారకావ్యని ♦ ర్మాణవేళ, సరసచాతుర్యమహిమ నొ ♦ సంగుఁ గాఁత

చ. కమలభవాదులన్ సకల ♦ కావ్యముఖంబులయందు నేసుతో
త్తమునకుఁ బూజచేసి నియ ♦ తంబుగఁ గాంతురు తద్ఫలంబు న
య్యమృతనరావతంసు శివు ♦ నగ్రితనూభవు నంతరాయసం
తమసరోజమిత్రగణ ♦ నాథునిఁ గొల్చెద నిష్టసిద్ధికిన్.

సీ. శాండిల్యగోత్రజు ♦ ఘనుఁ డైనకేదార, గురుపౌత్రు నయగారి ♦ కులపవిత్రుఁ
బార్వతీహృదయేశ ♦ పదపద్మపూజనా, పరుఁ డైనవిశ్వేశ ♦ గురునిపుత్రుఁ
బరమపాతివ్రత్య ♦ భవ్యసద్గుణకదం, బకు నారమాంబకుఁ ♦ బ్రాణనాథు
వినయభూషణుఁ డైన ♦ వీరభద్రగురుండు, శాశ్వతకీర్తి వి ♦ శ్వేశ్వరుండు
ననఘుకేదారవిభుఁడు లిం ♦ గనయూ ననఁగ, వెలయుపుత్రులు సేవింప ♦ నలరుచున్న
శైవశాస్త్రరహస్యవి ♦ జ్ఞానచతురు, బ్రస్తుతించెద నెల్లనా ♦ రాధ్యవరుని. 5

సీ. వల్మీకభవునకు ♦ వందనం బొనరించి, సత్యవతీసూను ♦ సంస్మరించి
కాళిదాసకవీంద్రుఁ ♦ గడుభక్తి సేవించి, భారవిమాఘునిఁ ♦ బ్రస్తుతించి
బాణమయూరులఁ ♦ బ్రాఘినిఁ గొనియాడి, దండిని భవభూతిఁ ♦ దలఁచి ప్రౌఢక
శ్రీహర్షచరణముల్ ♦ చిత్తంబులో నిల్పి, శివమల్హణునివచ ♦ శ్శ్రీకి నలరి
మఱియుసంస్కృతకవితాస ♦ మర్థులగుమ, హాకవీంద్రులనెల్ల బ ♦ హూకరించి
వారికారుణ్యలీలాని ♦ వార్యశుభక, రావలోకంబుచేత ధ ♦ న్యతవహించి. 6

ఉ. నన్నయభట్టుఁ గావ్యరచ ♦ నాచణుఁ దిక్కనసోమయాజి వి
ద్వన్నుతు నెఱ్ఱప్రెగ్గడను ♦ ధన్యుని నాచనసోముఁ గీర్తిసం
పన్ను హాళికభాస్కరుని ♦ బమ్మెరపోతకవీంద్రశేఖరున్
సన్నుతిసేతు వారికరు ♦ ణామహిమంబు లభించుకోరికన్.

గీ. ఛంద మెఱుఁగుట శబ్దశా ♦ స్త్రము చదువుట, బహునిఘంటుపరిజ్ఞాన ♦ పాటవంబుఁ
గాదు సుకవులకవితకుఁ ♦ గారణంబు, లుచితలజ్జాపరిత్యాగ ♦ మొకటి గాని.

క. అని యిష్టదేవతాగురు, వినతియుఁ బ్రాచీనసత్క ♦ విప్రవరులకీ
ర్తనమును, దుష్కవిజననిం, దనమును, గావించి విమల ♦ తరచిత్తుఁడ నై.

సీ. వినుతభరద్వాజ ♦ మునిరాజగోత్రజే, ఖరుఁడు పిల్లలమఱ్ఱి ♦ గాదిరాజు
పినవీరునన్వయం ♦ బున జనించినగుణో, న్నతుఁడను నీలయమంత్రి ♦ నందనుఁడను
చిరపుణ్యసాధన ♦ శ్రీశైలమందిర, భ్రమరాంబికావధూ ♦ ప్రాణనాథు
మల్లేశ్వరస్వామి ♦ మహనీయకరుణావ, లోకంబుఁ గాంచిన ♦ లోకనుతుఁడ
సకలసుకవిజనానంద ♦ జనకమధుర, నవ్యతరకావ్యకల్పనా ♦ నల్పయోగ
సర్వసర్వంసహాధిపా ♦ స్థానచిరయ, శోభనుఁడ సోమమంత్రీంద్ర ♦ సుకవి సేను. 9

వ. శబ్దార్థసంగతచమత్కారంబును బ్రకటితశివభక్తిపారంబును నగునొక్కనూతనకావ్యంబు రచియించుటకుఁ గుతూహలంబుఁ గావించి యొక్కనాఁడు విద్వత్కవిగాయకబంధుమిత్రామాత్యసమేతంబుగా నిష్టగోష్ఠివినోదంబులం బొద్దుఁ గడపుచు నుండి మాకుఁ బరమాప్తు లయినవారితో నిట్లంటి.

క. ఏయేకర్మంబులచే, నాయభవుఁడు సంతసించు ♦ నతిశయరీతిన్
శ్రేయంబు నెద్ది యొసఁగును, నాయాధర్మములఁ దెలుపుఁ ♦ డన్నియు మాకున్.

సీ. అన వార లిటుపల్కి ♦ రాలింపవయ్య నీ, వడిగినయర్థంబు ♦ నాదరమునఁ
బార్వతీపతియందు ♦ భక్తివిశేషంబు, సకలధర్మములకు ♦ సాధనంబు
కీర్తియు సుకృతవి ♦ స్ఫూర్తియుఁ గావించు, పృథులధర్మంబులు ♦ పెక్కుగలవు
వానిలోపలఁ గడు ♦ వర్ణనీయంబులై, తనరెడుసప్తసం ♦ తతు లనంగ
నట్టిసంతతులందు న ♦ నంతకీర్తి, గౌరవము గాంచుటకు నేక. ♦ కారణంబు
కవిజనానందకరచమ ♦ త్కారసార, కలితముగఁ దా రచించిన ♦ కావ్యమొకటి.

సీ. తనయన్వయమునందు ♦ మును జనించినవారి, చరితమంతయుఁ బ్రశ ♦ స్తముగఁ జేయు
తనమాతృవంశంబు ♦ జనులపౌరుషలీల, లాస్థానవర్ణని ♦ యములు సేయు
తనకుసద్బంధులై ♦ తనరెడువారిస, ద్వృత్తంబులన్నియు ♦ దెలియఁజేయు
దానొనర్చినమహో ♦ త్తమపౌరుషంబులు, ధరలోనఁ దగఁ బ్రసి ♦ ద్ధములు సేయు
వివిధశబ్దార్థచాతురి ♦ విన్నయంత, కవిజనులు మెచ్చుకావ్య మొ ♦ క్కటి యొకాదె
యట్టికావ్యంబు రచియించు ♦ నతఁడె విపుల, భాగ్యవంతుండు నిజవంశ ♦ పావనుండు.

గీ. అటులఁ గావున నీవు నో ♦ యార్యవర్య, పార్వతీశకథాసుధా ♦ భరిత మైన
యొక్కకావ్యంబుఁ జేసిమా ♦ యుభయవంశ, జనులనందఱమిపులఁ బా ♦ వనులఁ జేయు.

సీ. పార్వతీహృదయేశ ♦ పదభావనాపావ, నాంతరంగుఁడవు నీ ♦ వగుటఁ జేసి
సప్తసంతానసం ♦ స్థాపనాసంకల్ప, మాత్మఁ బూనినవాఁడ ♦ వగుటఁ జేసి
ఘనుని పిల్లలమఱ్ఱి ♦ పినవీరవిభునన్వ, యమునఁ గల్గినవాఁడ ♦ వగుటఁ జేసి
ధన మనిత్యమటంచుఁ ♦ దగఁ గీర్తిధనమునం, దాసక్తి గలవాఁడ ♦ వగుటఁ జేసి

కావ్య మొనరించి భ్రమరాంబికాసహాయుఁ, డైనమల్లేశ్వరుని పేర సంకితంబొ
నర్చి దిక్కులయందు న నంతకీర్తి, రుచులు ప్రచరింపఁజేయు న ర్హుఁడవు నీవ.

ఉ. పౌరుషవంతులున్ విపుల భాగ్యసమేతులు ధార్మికోత్తముల్
ధీరులు దానశూరులు సు ధీనిపుణుల్ భవదీయవంశ్యులౌ
వారలు వారికీర్తివిభ వంబు జగంబుల నిల్పి తేనియున్
సారెకు నీగుణోన్నతి ప్రశంసయొనర్చెద రెల్లసజ్జనుల్. 16

అనుపమగుణరత్నంబుల, ఘనతరరత్నాకరంబు గతి నెల్లెడలన్
వినుతింపఁ దగిరొఁ గావున, వినుమా భవదీయవంశ విస్తారంబున్. 17

సీ. కరతలామలకంబు గతి దేటతెల్లమా, బ్రహ్మస్వరూపమే బ్రహ్మఋషికి
సేవకులట్ల యా జ్ఞావశవర్తులౌ, సకలేంద్రియంబులే శాంతమతికి
పటుదిక్కులందుఁ జెం తలఁ జేర భయమందు, మానసాతాతులే జ్ఞాననిధికిఁ
జుట్టమై పలుమారుఁ జూచువేడుక వచ్చు, బాలేందుధరుఁ డేత పస్వివర్యు
నతఁడు వెలయుఁ బ్రసత్రయో గాంగసార, దుర్గమరహస్యవిజ్ఞాన దోహలుండు
పదయుగాశ్రితనిజశిష్య హృదయగతత, మోహరుండు భరద్వాజ మునివరుండు.

మ. అనఘుం డమ్మునివర్యగోత్రమునకున్ రాంభోధికిన్ జంద్రుఁడై
జననం బందిన గాదిరాజు చతురా శాభ్రాజి విద్వత్సభా
జనులెల్లన్ నుతిసేయఁ గీర్తిఁ గనియెన్ సౌజన్యసంపన్నుఁ డా
తనసన్నిద్ధులు సోదరుల్ పరమ తా త్పర్యంబునన్ గొల్వఁగన్. 19

సీ. కవివర్ణనీయుఁ డా గాదిరాజు వివేక, ఘనుఁడు పిల్లలమఱ్ఱి యనుపురమున
నధివసించుటఁ జేసి యాపేర విఖ్యాత, మై ప్రకాశించె న య్యన్వయంబు
మహనీయకీర్తి న మ్మంత్రిశేఖరుఁ డంతఁ, దనధర్మపత్నియందుఁ దగినయట్టి
సంతతి లేదన్న చింతాభరము పూని, యతిధైర్యసంపన్నుఁ డౌటకతన
శివునిగూర్చి తపంబు నేఁ జేసి పుత్ర, రత్నములఁ గాంతు నన్నట్టి యత్నముగని
యాత్మగృహమున నన్నదా నాదికార్య, భరము సోదరవర్గము పాల నునిచి. 20

సీ. అణిమాదిసిద్ధుల నల్పంబుగా నెంతు, రేగిరీంద్రమునందు యోగివరులు
తపము గావింతు రే ధరణీధరమునందు, సనకాదిమునులు మో క్షంబుఁ గోరి
కైలాసగిరికన్నఁ గడుప్రియం బైయుండుఁ, బురవైరి కే మహా భూధరంబు
తనశిఖరంబుఁ జూ చినయంత జనులకు, నపవర్గ మొసఁగు నే యచలరాజ
మట్టి శ్రీగిరియందుఁ గా మారిఁగూర్చి, తపముఁ గావించు చనుచు సం తానకాంక్ష
చేసి సకలేంద్రియద్వయ ద్విరదగర్వ, భేదనోదారమృగరాజు గాదిరాజు. 21

అచటఁ బాతాళగంగ ♦ గావగాహంబుచేఁ, దురితంబులన్నియుఁ ♦ దొలఁగఁజేసి
సిద్ధుల నధికప్ర ♦ సిద్ధుల నీక్షించి, యభివందనము వారి ♦ కాచరించి
శ్రీమల్లికార్జున ♦ స్వామికి నభిషేక, పూర్వకం బయినట్టి ♦ పూజఁజేసి
భ్రమరాంబికాపాద ♦ పల్లవంబులచేతఁ, దనశిరంబు నలంకృ ♦ తముగఁ జేసి
లలిత మగునొక్క విజనస్థ ♦ లంబునందు, నెల్లమనుజులు దుష్కరం ♦ బిది యటంచుఁ
బలుకఁ గలుబందనలుకుల ♦ భక్షణమున, ప్రాణములు నిల్పికొనుచుఁద ♦ పంబుఁజేసె.

శా. అంతన్ శ్రీగిరివాసుఁ డైనశివుఁ డా ♦ త్మాకారసంయుక్తుఁ డై
చెంతన్నిల్చి గుణాఢ్య యిట్టియులతం ♦ జెందంగ నీ కేటికిన్
సంతానంబు లభింప దిప్పుడు పున ♦ ర్జన్మంబునంగాని ని
శ్చింతం బొమ్మని పల్కె మానసమునం ♦ జింతాసమాక్రాంతుఁడై. 23

క. స్వామి శ్రీశైలనాథ యో ♦ ద్దామహిమ, తావకం బైనభక్తవా ♦ త్సల్యమహిమ
మిట్టిదా నీకుఁ గలశక్తి ♦ యీదృశంబె, కరుణ నాయందుఁ జాలని ♦ కరణి గాక.

సీ. అని యలుక గావించి ♦ యచ్చోట నుండక, యుత్తరమార్గంబు ♦ నొకటి చూచి
యావెంబడిని యగ ♦ మ్యము లైనయడవుల, దుష్ప్రవేశము లయిన ♦ దొడ్డదరులఁ
బడి భీతినొందక ♦ పదియేనుక్రోసుల, దూరంబు చని మహా ♦ ధీరుఁ డగుచు
లాలితం బైనపా ♦ తాళగంగాసమీ, పమునందు వాసంత ♦ సమయ మగుటఁ
గాంతకోమలపల్ల వా ♦ క్రాంత మగుచు, దనరుచున్నట్టియొకబిల్వ ♦ వనముఁగాంచి
యిదిగదా శంభునకుఁ బ్రియం ♦ బెంతయైన, నని తదీయవిలాసంబు ♦ నాత్మ మెచ్చి.

క. ఇచ్చటఁ దప మొనరించిన, నచ్చపునియమమున వాంఛి ♦ తార్థము నొందన్
వచ్చును సంశయ మేలని, నిచ్చలపున్ మనసుచేత ♦ నిర్ణయయుతుఁడై. 26

సీ. మృదువు లౌనూటయే ♦ న్మిదిబిల్వదళములఁ, దిని పవిత్ర్యాహారంబును ♦ దేహయాత్ర
జరుపుచుఁ దగఁ బున ♦ శ్చర్య గావింపుచు, వాసరములు నలు ♦ వదియుఁ జన్న
నటమీఁద నంచిత ♦ ధ్యానసమారూఢుఁ, డయి యున్న శివుఁ డపు ♦ డతనిఁ జేరి
యీనిర్జనాటవి ♦ నేమి కోరిక నీవు, దపముఁ జేసెదవని ♦ తగ నడిగిన
నేను సంతానకాంక్షు నీ ♦ వెవ్వరయ్య, యెఱుఁగ శ్రీశైలనిలయమ ♦ ల్లేశ్వరుఁడవు
గావుఁగా యన్న నతఁ డేను ♦ గానుభద్ర, కాళినీశ్వరుఁడనంచుఁ ♦ గరుణఁబలుక.

క. సంతాన మిచ్చి నాకున్, సంతోష మొనర్పఁ గలవె ♦ శంకర యనినన్
జింతించి భద్రకాళీ, కాంతుం డానియమశీలుఁ ♦ గని యిట్లనియెన్. 28

విమలచారిత్ర జన్మాంత ♦ రమునఁ గాని, నీకు సంతతి గలుగదు ♦ నిశ్చయంబు
పలుకులాస మం దేద ♦ నిష్ఫలమున, నన్నుఁ బ్రహసితవదనుఁ డై ♦ యతఁడు వలికె.

గీ. నీవు శ్రీశైలనిలయమ ♦ ల్లేశ్వరునకు, సాటి యైనట్టివేల్పవి ♦ పాటిపనికి
నను బలుకరింపఁగా నేల ♦ నమ్మఁతిఁగద, నిన్ను వరదుఁడ వని చాల ♦ నీలకంఠ. 30

సీ. అనిన నవ్వీరేశుఁ ♦ డనియె నోవత్స నీ, వీరీతి నన్నింత ♦ దూర నేల
యిపు డేను శక్తుఁ ♦ మేతుఁడ గాకున్న, వాఁడ నీసామీప్య ♦ వనమునందుఁ
గలయొక్కగృహమునఁ ♦ గలకంఠి యున్నది, భద్రకాళిని యైన ♦ భద్రకాళి
యావనజేక్షణ ♦ తో విచారముఁ జేసి, పలికెద నింకొక్క ♦ పలుకు వినుము
యిక్కడికి దక్షిణంబున ♦ నొక్కశైల, గుహ దనరునందులోపల ♦ మహితమూర్తి
దేజరిల్లెడు భారతీ ♦ తీర్థు లన్న, యతివరుం డాశ్రితవ్రాత ♦ హితకరుండు. 31

సీ. ఆయతీంద్రునకు స ♦ హస్రవర్షములపై, నెనబనూఱబ్దంబు ♦ లిపుడు చనియె
మతిమంతు లగునట్టి ♦ మనుజోత్తముల కైన, నొనరింపఁ డతఁడు మం ♦ త్రోపదేశ
మతనిసన్నిధికి నీ ♦ వరిగి సాష్టాంగప్ర, ణామంబుఁ జేసి నా ♦ నావిధములఁ
బ్రార్థించి యమ్మహా ♦ బాహుచిత్తమునందుఁ, గరుణ పుట్టించి యే ♦ కరణి నైన
మంత్రముపదేశమై వచ్చి ♦ మాగృహమున, భద్రకాళియంతంబుగాఁ ♦ బ్రమద మొప్ప
నున్న నన్ను విలోకించి ♦ యుచితరీతి, నియమయుక్తప్రపత్తిచే ♦ నిలచితేని. 32

వ. అప్పుడు నాప్రాణేశ్వరియును నేను నన్యోన్యవిచారంబు చేసి నీకోర్కె ఫలియింపఁగ
యుంగలవార మని యాజ్ఞయిచ్చి యద్దేవుం డంతర్హితుం డైన తదనంతరంబున. 33

క. నిర్జన మానవ్వనమున, నిర్జరులకుఁ జనఁగరాని ♦ నిబిడతరులతా
దూర్జిత మేళనమున విగ, తార్జవ మగుత్రోవవట్టి ♦ యంతటిమీఁదన్. 34

గీ. ఆపవిత్రద్విజోత్తంస ♦ మధివసించు, నట్టిగుహ చెంత కరిగి ధీ ♦ రాత్ముఁడగుచు
దైవవశతను జేసి త ♦ ద్ద్వారముఁ గని, యంచితోత్సాహమునఁ బ్రవే ♦ శించియంత

సీ. అసదృశబ్రహ్మవ ♦ ర్చసవిలాసంబుచే, బాలభాస్కరులీలఁ ♦ బఱగువాని
బహువర్షములు చన్న ♦ పరమవృద్ధుం డయ్యు, దారుణ్యనిధివోలెఁ ♦ దనరువాని
సకలేంద్రియములచం ♦ చలత లేక తరంగ, విరహితాంబుధివోలె ♦ వెలయువాని
సహజవైరము మాని ♦ జంతుసంతతులెల్ల, సేవింపఁ గరుణ నీ ♦ క్షించువాని
భారతీతీర్థయతిసార్వ ♦ భౌముఁ గాంచి, వినయ మొప్పంగ నాతని ♦ వినుతి సేసి
ముకుళితకరారవిందుఁ డై ♦ మ్రోలనిలువఁ, గేవలకృపార్ద్రదృష్టి నీ ♦ క్షించియతఁడు

సీ. ఎక్కడి జనుఁడ వీ ♦ వేరీతి నిర్మను, ష్యారణ్యమునకు రా ♦ గారణంబు
గలిగె నెద్ది మదీయ ♦ నిలయ మైనట్టియీ, గుహ యెట్లు చొచ్చితి ♦ కొదవలేక
యని పల్క యతనిచే ♦ నంతవృత్తాంతంబు, విని పలుమాఱు ప్రా ♦ ర్థనలు గాంచి
మదిలోనఁ గృపపుట్టి ♦ మంత్రోపదేశంబు, చేసినఁ గైకొని ♦ చింత విడచి

యతనికిఁ గృతప్రణాముఁడై ♦ యగ్నిగుహ, వెడలి సామీప్యమున నున్న ♦ వీరభద్రు
గుడికిఁ జని భద్రకాళితోఁ ♦ గూడనందు, నలరు నద్దేవుఁ గాంచి సా ♦ ష్టాంగ మొరగి.

గీ. ఫాలతలమున ముకుళిత ♦ పాణియుగము, నిలిపి ధ్యానంబుఁ జేయుచు ♦ నిలిచియున్న
యతనిఁ గని యాత్మవల్లభ ♦ యైనభద్ర, కాళితో నిట్లు పలికె నా ♦ నీలగళుఁడు.

చ. అతినియమాఢ్యుఁ డీతఁడు మ ♦ హాత్ముఁడు సంతతిఁ గోరివచ్చె నాఁ
డితనిమనోరథంబు ఫలి ♦ యింపఁగఁ జేయుట చాల యుక్త మా
సతియని తన్మతంబునకు ♦ సమ్మతి గల్గఁగఁ జేసి యంత నా
యతులితభక్తిశీలునిము ♦ ఖాబ్జముపైఁ దనదృష్టి నిల్పుచున్. 39

ఉ. ఓయిమహీసురప్రవర ♦ యుల్లమునం దిఁకఁ జింత యేమియుం
జేయకు రెండురూపములఁ ♦ జెంది భవత్సతిగర్భసీమ నే
నే యుదయింతు నగ్రజుఁడు ♦ నిక్కముగాఁగ మదంశసంభవుం
డాయనుజుండు నేన యిది ♦ యంతయు నమ్ము మునిశ్చయంబుగన్. 40

. ప్రథితసుగుణాళి యైనయా ♦ భద్రకాళి, వారలకుఁ జెల్లెలై పుట్టు ♦ వలవదింక
శంకయొనరింప నని దయా ♦ సాంద్రదృష్టి, వెలయఁబలుకఁ దాజ్ఞయా ♦ దలధరించి

. కృతార్థుండై యద్దేవుగృహంబు వెడలి యాశ్రీగిరినివాసు లయిన భ్రమరాంబికామల్లే
శ్వరాదు లయిన సకలదేవతలకు నభివాదనంబుఁ జేసి కతిపయప్రయాణంబుల విల్లల
మఱ్ఱిపురంబునకు వచ్చి సకలదాయాదమిత్రామాత్యవర్గంబులు సంతసింప నిజగృ
హంబుఁ బ్రవేశించి సుఖంబునఁ గొంతసమయంబు గడుపుచున్న యనంతరంబున. 41

. అగాదిరాజువనిత మ, హాగుణవతి పరమసాధ్వి ♦ యనవిశ్రుత యా
నాగాంబ రూపలీలా, భోగాఢ్యులఁ గవలవారిఁ ♦ బుత్రులఁ గాంచెన్. 42

. ఘనుఁ డందులోన రెండవ, తనయుఁడు వీరేశ్వరుండు ♦ తాన యగుటచే
జనియించుసమయముననే, జను లెల్ల నుతింప నొక్క ♦ జడ ధరియించెన్. 43

అతిలాలితాకారు ♦ లాకుమారులు పెద, వీరభద్రుఁడు పిన ♦ వీరభద్రుఁ
డన్న నామములచే ♦ నధికప్రసిద్ధులై, యభివృద్ధిగాంచి ర ♦ నంతరమునఁ
బెదవీరభద్రుఁడు ♦ పృథ్వ్యధీనుతకార్య, దక్షుఁడై కర్ణాట ♦ ధరణి కరిగి
వాసిగా తాయసిం ♦ హాసనమునునుండి, యధిక తౌరాయచా ♦ యాదులకును
మఱియు డెబ్బదివేలసా ♦ మంతులకును, తానె యధికారియై మహా ♦ స్థానులందు
సకలమంత్రివరేణ్యులు ♦ సన్నుతింప, భూనుతం బైనకీర్తిని ♦ స్ఫూర్తిఁ గనియె. 43

మహానీయపిల్లల ♦ మఱ్ఱివంశభవుండు, గాదిరాజసుతుండు ♦ ఘనయశుండు
వీరేశ్వరునియువ ♦ తారసే యితఁడంచు, జను లెన్నఁ దగినసౌ ♦ జన్యశాలి

పినవీరభద్రుఁడు ♦ చిన్నప్రాయమునందె, యఖిలశాస్త్రంబులు ♦ నభ్యసించెఁ
గాళిదాసాదిస ♦ త్కవులకు హెచ్చుగా, బహుకావ్యవిరచన ♦ ప్రౌఢిఁ గాంచె
వాణి యిల్లాలు గాఁ గవి ♦ శ్రేణికెల్లఁ, బ్రకటితాశ్చర్యకర మైన ♦ బిరుదు పూనెఁ
దుహినగిరిరాజరామసే ♦ తువులనడుమ, నితని కెనయైనకవివరుఁ ♦ డెందుఁ గలఁడు.
అవతారదర్పణం ♦ బన్నకావ్యముఁ జేసె, నారదీ ♦ యంబు పలికె
మహనీయ మగుమాఘ ♦ మాహాత్మ్యము రచించె, శాకుంతలముఁ జెప్పె ♦ సరసఫణితి
నేకరాత్రియందు ♦ నొనరించె మధురవా, క్ప్రౌఢిచే జైమిని ♦ భారతంబు
లలితమహామానసో ♦ ల్లాససారంబన్న, కబ్బంబుభాషించె ♦ నబ్బురముగ
మఱియుబహురూపకావ్యని ♦ ర్మాణనిపుణుఁ, డగుచునుతిఁ గాంచె సకలది ♦ గంతరముల
గుకవిజనగర్వతిమిరసం ♦ దోహకృత్ప్ర, భాతరవి యైనపినవీర ♦ భద్రసుకవి. 46
.. భాగ్యనిధి యైనపినవీర ♦ భద్రసుకవి, కాత్మజులు సంభవించి రు ♦ దారమతులు
ఘనుఁడు వీరన్నయును జగ ♦ ద్గణ్యపుణ్య, ధనుఁడు మల్లేశ్వరుండన్న ♦ ధర్మపరుల

ఉ. వారలలోన నగ్రజుఁడు ♦ వారిజవైరివతంసపాదప
కేరుహపూజనాపరుఁడు ♦ గీష్పతితుల్యసమగ్రశేముషీ
సారవచోవిలాసనిధి ♦ సర్వనృపాలసభాగ్రపూజ్యుఁ డా
వీరనమంత్రిశేఖరుఁడు ♦ విశ్రుతిఁ గాంచె ధరాతలంబునన్. 47

ఉ. సన్నుతిభక్తిచే నెపుడు ♦ శంభుని గొల్వఁగ నేర్చుఁ బెద్దల
న్మన్ననసేయ నేర్చు మతి ♦ మంతులలోన మెలంగ నేర్చుఁ జే
కొన్ననృపాలవర్గములఁ ♦ గూరిమి మెచ్చుకొనంగ నేర్చు వీ
రన్నకెయిచ్చెవాఁడు కమ ♦ లాసనుఁ డిద్ధర నేర్పు లన్నియున్. 48

గీ. అతనియనుజుఁడు నిజహృద ♦ యాధిగతమ, హేశ్వరుండు వివేకస ♦ మేత వాగ్భ
ణీశ్వరుఁడురిపుప్రజా ♦ నీకగజమృ, గేశ్వరుండు దనర్చు మ ♦ ల్లేశ్వరుండు. 49

ఉ. శాశ్వతమై సమస్తకవి ♦ సన్నుతమై హరిదంతమానవా
ధీశ్వరసత్సభాగ్రజన ♦ హృత్కమలాతివికాసహేతువై
విశ్వజనీనమై యధిక ♦ విస్మయకారణమై చెలంగు మ
ల్లేశ్వరమంత్రికీర్తి చరి ♦ యించును సర్వజగత్ప్రకాశమై. 50

సీ. మహనీయతేజుఁ డా ♦ మల్లేశ్వరుం డంత, తనకావ్యదక్షతా ♦ ఘనతఁ జూచి
మెచ్చి యాకటకేంద్రుఁ ♦ డిచ్చినపెనుమళ్ల, యన్నగ్రామమునందు ♦ నధివసించె
నాఁటనుండి తదీయ ♦ నామంబుచేత న, న్వయము ప్రకాశంబు ♦ నందుచుండె
నట్టిమల్లేశ్వరుఁ ♦ డనవద్యసుగుణసం, పన్నుఁ డైనట్టివీ ♦ రన్నమంత్రి

తాపమదనుండు సోమేశ్వ ◆ రుండు నన్న, సుతుల నిద్ధరభువనవి ◆ శ్రుతులఁ గాంచె
వార లిరువురు సౌభ్రాత్ర ◆ వర్తనమున, నుత్తమచరిత్రమునఁ గీర్తి ◆ నొందిరందు. 51

సీ. అగ్రజుం డైనవీ ◆ రన్నవంశమున సం, భవమందె నర్సనా ◆ మాత్యమౌళి
యమ్మంత్రివరుఁడు పె ◆ ద్దాంబాఖ్యయాధర్మ, సతియందు నలుగురు ◆ సుతులఁ గాంచెఁ
బెదబసవయ్యయుఁ ◆ జినబసవయ్యయు, మ్మన్న తిమ్మనమంత్రి ◆ యన్నవారి
నానలుగురిలోన ◆ నతిగుణాఢ్యుండు యు, మ్మనమంత్రిమౌళి భా ◆ మమ్మకాంత
యందు ఘనుఁడైన నర్సనా ◆ మాఖ్యుఁ గాంచె, నతఁడు మతిశాలియైన వెం ◆ కాంబయను నెలఁత
వెలది నుద్వాహమై యభి ◆ వృద్ధిఁ గాంచె. * * * 52

క. సోమేశ్వరుండు హృద్గత, సోమేశ్వరుఁ డమితవైభ ◆ వోదయజితసు
త్రాముఁడు సుగుణోన్నతి నభి, రాముఁడు విలసిల్లు సకల ◆ రాజస్తుతుఁడై. 53

శా. ఆసోమేశ్వరుసంతతిం గలిగె రా ◆ జాస్థానమాన్యుండు కై
లాసాధీశపదారవిందయుగళీ ◆ లగ్నాంతరంగుండు ప
ద్మాసద్మాయతలోచనాంచలుఁడు స ◆ మ్యగ్వేదశాస్త్రాదివి
ద్యాసారజ్ఞుఁడు దాచిరాజు నిజవం ◆ శాంభోధికిం జంద్రుఁడై. 54

సీ. క్షితిఁ గల్గునర్థిసం ◆ తతులు వర్ణనసేయు, వితరణశూరత్వ ◆ మితనియందె
శతమన్యుగురునితోఁ ◆ బ్రతిసేయఁగావచ్చు, నతిరమ్యవాక్ప్రౌఢి ◆ యితనియందె
సతులచిత్తమునందు ◆ ధృతి కరఁగించునం, చితరూపలావణ్య ◆ మితనియందె
సితకంధరునిపూజ ◆ సతతంబుఁ గావించు, నతులితవ్రతచర్య ◆ యితనియందె
సతులు గావించునియురాతి ◆ తతులగర్వ, మతుల నిరసించుభుజకార్య ◆ మితనియందె
నిలిపినాఁ డబ్జభవుఁ డంచు ◆ నిఖిలసుకవి, రాజులు నుతింతు రా దాచి ◆ రాజు నెపుడు.

ఉ. ఆరమణీయకీర్తిమహి ◆ మాఢ్యుఁడు దాచయమంత్రి మన్మథా
కారులమువ్వురన్ సుతులఁ ◆ గాంచెను శ్రీపెదసోమమంత్రియున్
సూరివరేణ్యుఁ డైనపిన ◆ సోమనయున్ సుకృతప్రియామహా
పౌరుషశాలి యైవెలయు ◆ పాపడిసోమన యన్నవారలన్. 56

క. వారలలోపల నగ్రజుఁ, డారూఢశివార్చనాప ◆ రాయణుఁడు ఖగ
ధ్వారాతినికరబలదు, ర్వారుఁడు పెదసోమమంత్రి ◆ రత్నము వెలయున్. 57

సీ. కటకవధూటికా ◆ కచభారసంఫుల్ల, మల్లికాప్రసవదా ◆ మములఁ దెగడి
కర్ణాటకాంగనా ◆ కర్ణభూషణసార, హీరోపలచ్ఛాయల ◆ నీసడించి

ఢిల్లీపురావాస ♦ పల్లవోష్ఠీజాల, దరహాసరుచులతోఁ ♦ దఱిస్తరించి
కేరళకామినీ ♦ వారముక్తాహార, గురుధాళధళ్యంబు ♦ గొంచెపఱచి
సకలదిక్కుల ననిశంబు ♦ సంచరించు, నార పెనుమళ్లవంశదు ♦ గ్ధాబ్ధిచంద్రు
దాచయామాత్యపుత్రర ♦ త్నంబు రాజ, మాన్యుఁ డైనట్టిపెదసోమ ♦ మంత్రికీర్తి.

క. ఆపెదసోమనయనుజుఁడు, భూమీపాలకవర్యకార్య ♦ ఘటనాపటిమ
వ్యాపారసుమతి జితభా, షాపతి పినసోమమంత్రి ♦ చంద్రుఁడు వెలయున్. 59

ఉ. దానగుణంబులన్ ఘనుఁడు ♦ ధార్మికకోటికి నగ్రగణ్యుఁ డా
స్థానమునందు మిక్కిలి ప్ర ♦ శంసకు నెక్కె నధన్యుఁ డీశ్వర
ధ్యానపవిత్రమానసుఁ ♦ డసారతయాచకరక్షణక్రియా
సూనృతభాషణుండు పిన ♦ సోమనకీర్తి వహించె ధారుణిన్. 60

చ. అనుపమసద్గుణాఢ్యుఁ డగు ♦ నాపినసోమనకుం బ్రియానుజుం
డనుపమసత్యభాషణమ ♦ హావ్రతశీలుఁ డశేషమేదినీ
జనపతిసత్సభాభవన ♦ సత్కవిశేఖరగద్యపద్యవా
క్ప్రణుతచరిత్రముల్ గనియెఁ ♦ బాపడిసోమన మంత్రిరత్నమై. 61

సీ. ఉచితజ్ఞు లగుసచి ♦ వోత్తములను వివే, కించి నిక్కముగ నె ♦ క్కించువేళ
మతిమంతు లయినట్టి ♦ మంత్రిరత్నంబుల, వివరించి గణన గా ♦ వించువేళ
ధార్మికు లగునమా ♦ త్యవతంసములనెల్ల, నెలమిఁ బల్కొని నూ ♦ హించువేళ
సతిధీరు లగుప్రధా ♦ నాగ్రగణ్యులను ద, లంచి బల్కొని గ ♦ ణించువేళ
కవులు బాంధవులును ధరా ♦ ధవులునగ్ర, గణ్యుగా నెంతు రనిశంబు ♦ పుణ్యగుణని
ధానమైనట్టిపెనుమళ్ల ♦ దాచిరాజు, సుతవతంసంబుఁ బాపడి ♦ సోమఘనుని. 62

సీ. సుగుణాఢ్యు లయినయా ♦ ముగురుసోదరులందు, ధీమంతుఁ డగుపిన్న ♦ సోమమంత్రి
కాయనమంత్రియన్ ♦ సూనునొక్కనిఁ గాంచె, నతఁడు నిత్యంబు న ♦ భ్యాగతులకు
బహుశాకఘృతసూప ♦ భక్ష్యసమగ్రంబు, గాఁగ నెల్లప్పుడు మృ ♦ ష్టాన్న మొసఁగి
నిఖిలదేశములందు ♦ నిష్కళంకయశంబు, సుకృతంబుఁ గాంచెను ♦ సుస్థిరముగ
నట్టికాయనమంత్రీంద్రుఁ ♦ డంచితముగ, లక్షణాన్విత యగునట్టి ♦ లక్ష్మయన్న
యబల నుద్వాహమై యామృ ♦ గాయతాక్షి, (యందు?) జనవినుత బాపమంత్రి
యన్ ♦ దనయుఁ గాంచె. (?) 63

ఉ. పావనసత్యశీలుఁ డగు ♦ పాపడిసోమనమంత్రిధర్మవాం
ఛావిసులాత్ముఁ డై వెలసి ♦ శక్రియయన్నవధూటియందు నా

ర్యాకరసత్కృపామహిమ ♦ నాత్మజు నొక్కనిఁ గాంచెఁ గాంచన
గ్రావసమానధైర్యగుణ ♦ గణ్యుని సోమనమంత్రిచంద్రునిన్. 64

సీ. తనమేనిచెలువమం ♦ తయును నాశ్రితులైన, బుధులపై నిగుడుచూ♦పులనె యుంచి
తనశుభ్రకాంతి యం♦తయును దిగంతములందుఁ, దులలేక వెలయుకీ♦ర్తులనె యుంచి
తనకళంకత్వ మం♦తయు గర్వితానేక, ఖలమంత్రిజనులచి♦త్తముల నుంచి
తనసుధాయోగ మం♦తయు సభాస్థలులందు, విలసిల్లుమధురసూ♦క్తులనె యుంచి
నిత్యపరిపూర్ణుఁ డయి యా♦వనీస్థలమున, వినుతి గనుసోమనామంబు♦విడువ కుదయ
మందినసుధాంశుఁడే యితఁ♦డని నుతించు, మానవశ్రేణి యాసోమ♦మంత్రిఁ గాంచి.

సీ. మరువు లెవ్వటఁ గన్న ♦ దొరలనీయవిగల్ల, వాశ్రితులను బ్రోచు ♦ నట్టివేళ
కినుక యొచ్చటనైనఁ ♦ జెనకనీ యది గల్ల, దభవుసేవ యొనర్చు ♦ నట్టివేళ
నన్యుల మెచ్చటనైనఁ ♦ జొనుపనీ యది గల్ల, దవనీసురుల మెచ్చు ♦ నట్టివేళ
కరుణ యొకింతైనఁ ♦ గలఁగనీ యది గల్ల, దెంచి శత్రువుల దం♦డించువేళ
యెంత సమయజ్ఞుఁ డితఁడంచు ♦ నెంచు విబుధ, వర్గము లనారతము ఘన♦భర్గచరణ
దుర్గమధ్యానకలనాని♦సక్తశైవ, మార్గచరుఁ డగుసోమనా♦మాత్యవరుని. 66

ఉ. ఆమహనీయకీర్తినిధి ♦ యన్వయవార్ధికిఁ బూర్ణచంద్రుఁడౌ
సోమనమంత్రి సర్వగుణ ♦ శోభనుఁ డిర్వుర వారిజాక్షులన్
బ్రేమను బెండ్లియాడె జన ♦ బృందము లౌనని మెచ్చ శాంతలీ
లామహిఁ బేరమాంబయును ♦ లక్ష్మియు నన్నగుణాభిరాములన్. 67

సీ. సోమనామాత్యుఁ డా ♦ సుందరీరత్నము, లందు నగ్రవధూటి ♦ యిందువదన
చాతుర్యచరిత్రి ♦ పేరమాంబానామ, విఖ్యాతి గనునట్టి ♦ వెలఁదియందు
బసవనమంత్రీంద్రు ♦ బలధురగుణశీలు, సుగుణవిశ్రుతు నొకని ♦ సుతునిఁ గాంచె
నతఁడు పౌరుషశాలి ♦ యై నందపురమున, భూవరాగ్రణి కృష్ణ ♦ దేవునొద్ద
మంత్రియై కార్యదక్షతా ♦ మహిమచేత, దిక్కులను గల్గు రాజము♦ద్రాపుంజంబు
నిచ్చలును బ్రస్తుతింపఁగ ♦ నచ్చమైన, నిజయశస్స్ఫూర్తి నెల్లెడ ♦ నెరయఁజేసి. 68

చ. అసదృశసద్గుణోదయస ♦ మగ్రతచేఁ గనుపట్టినట్టి యా
బసవన వీరమాంబ యను ♦ భామినియందును గాంచె సర్వభూ
విసుమరయైన(యట్టి) పెద ♦ వేంకన సోమనమంత్రి సద్గుణ
వ్యసనుఁడు చిన్నవెంకనయు ♦ నన్నకుమారుల దానశూరులన్ 69

గీ. శ్రీమహితు లైనవారిలో ♦ సోమమంత్రి, గౌరమాంబా సమాఖ్యయౌ ♦ కాంతయందుఁ
మల్లనామాత్యుఁ డనుకుమా ♦ రకునిఁ గనియె, నార్యులునుతింపనభివృద్ధి ♦ నందె నతఁడు

సీ. నీతిజ్ఞుఁ డైనమా ♦ తాతసోమనమంత్రి, వర్యుఁడు రెండవ ♦ భార్యయైన
ప్రణుతసౌశీల్యాది ♦ పావనసద్గుణ, లక్ష్మిలక్ష్మీనామ ♦ లలనయందు
మాతండ్రి యైనట్టి ♦ మేరుశైలసమాన, నియతధైర్యుఁడు పెద ♦ నీలమంత్రి
యభినవపంచసా ♦ యకసమంచితరూప, లాలిత్యనిధి పిన ♦ నీలమంత్రి
యన్న నందనయుగళంబు ♦ నమృతవార్ధి, యఖిలసంతోషకరసత్క ♦ ళాభిరాముఁ
బూర్ణచంద్రుని (నకల్ప) ♦ భూరుహంబు, గాంచినట్టి తెఱంగునఁ ♦ గాంచియలరె.

క. అం దగ్రజుండు భువనా, నందప్రదవితరణాది ♦ నవ్యగుణమణీ
సందోహవారినిధి చెలు, వొందును పెదనీలమంత్రి ♦ యార్యస్తుతుఁ డై. 72

సీ. కరము లెప్పుడు శుభా ♦ కరములౌ నిశ్శంక, శంకరాంఘ్రిద్వయా ♦ ర్చనముచేతఁ
బదము లెప్పుడు సౌఖ్య ♦ పదములౌ గౌరీశ, సదనయాత్రామహో ♦ త్సవముచేత
శ్రుతులెప్పు డధికవి ♦ శ్రుతులౌ శశాంకశే, ఖరకథాకర్ణనో ♦ త్కంఠచేత
మతు లెప్పుడును సౌఖ్య ♦ మతులౌ లలాటలో, చనమూర్తిభావనా ♦ చర్యచేత
నింతశివభక్తుఁ డిద్ధాత్రి ♦ నెవ్వఁ డనుచుఁ బ్రణుతి సేయుదురౌ బుధ ♦ ప్రవరులు పెను
*మల్లవంశాబ్ధి సోముఁ డ ♦ మాత్యమణికి, మారరత్నంబు పెదనీల ♦ మంత్రివరుని.

సీ. ఇతఁ డర్థిజనముల ♦ కిచ్చుచో నలకల్ప, భూజమైనను సరి ♦ బూనఁగలదె?
యితఁడు భాషించుచో ♦ ప్రతివాది యైవచ్చు, శేషాహియైన భా ♦ షింపఁగలఁడె
యితఁడు కార్యంబు లూ ♦ హించుచో గురుఁ డైనఁ, జింతించి ప్రత్యూహ ♦ సేయఁగలఁడె
యితఁడు శాత్రవకోటి ♦ కెదురుచో భీమరంబు, గలవాఁడు నెదిరింపఁ ♦ దలఁపఁగలఁడె
అనుచుఁ దనవాఙ్మనీషాది ♦ యమితశౌర్య, ఘనత వీక్షించి జనులెల్ల ♦ వినుతిసేయఁ
గీర్తిఁ గాంచెను భాగ్యవి ♦ స్ఫూర్తిచేత, మహితసుగుణాళి పెదనీల ♦ మంత్రిమౌళి.

సీ. ఆప్తబాంధవు లట్ల ♦ యతులితప్రేమపా, త్రము లర్థిజను లేప్ర ♦ ధానమణికి
నాప్తసంభవులట్ల ♦ యాదరణీయులౌ, శ్రితవిప్రులే మంత్రి ♦ శేఖరునకు
శాశ్వతధనమట్ల ♦ సంగ్రహార్హము యశో, ధన మేయమాత్యవ ♦ తంసమునకుఁ
గడునలక్ష్యములు సూ ♦ క్ష్మప్రమశకములట్లు, శాత్రవశ్రేణు లే ♦ సచివవరున

* పెనుపల్లెయని కనఁబడుచున్నను ‘మ’ కార మిచ్చట యతిస్థానమునందుంట పెనుమల్లవారనుటయే యుచితమా?

—కలఁడు కీర్తుల విలసిల్లు ♦ నద్రిజాధి, నాథపదపంకరుహపూజ ♦ నాపరుండు
సోమమంత్రీంద్రసుతుఁడు ని ♦ శ్శీమగుణని, ధాన మగు పెదనీలప్ర ♦ ధానమౌళి. 73

సీ. పృథుతేజుఁ డైనయా ♦ పెదనీలమంత్రీంద్రుఁ, డమితకీర్తి విశాలి ♦ యాతుకూరి
కాళయామాత్యుఁడు ♦ కమనీయసుగుణభూ, షణ యైనసూరప ♦ సాధ్వియందుఁ
గాంచినకన్యను ♦ దంచితకీర్తిస, మగ్రుండు మాపతి ♦ (మంత్రి?) మౌళి
తనసోదరుండు గాఁ ♦ దనరునుత్తమసాధ్వి, సకలభాగ్యములకు ♦ జన్మవసతి
నన్నదానా ద్యనేకక ♦ ళ్యాణజనక, సద్గుణంబులకెల్ల నా ♦ స్థానజగతి
నన్నపూర్ణసమాఖ్య నై ♦ నట్టివనితఁ, బరిణయం బయ్యె నధికమై ♦ భవముతోడ.

సీ. తనప్రాణవిభుఁడు ప ♦ ల్కినయట్టియాజ్ఞ యా, దలధరించుట సద్వ్ర ♦ తంబుగాఁగ
నతిథికోటులకు మృ ♦ ష్టాన్నదానంబు(తా) సలుపుయత్నమె దిన ♦ చర్యగాఁగ
తనగుణోన్నతి బంధు ♦ జనులు వర్ణింపఁగ, ల్గినకీర్తియే మూల ♦ ధనముగాఁగ
సుతులవైఖరి నిజా ♦ శ్రితులను రక్షించు, కారుణ్యమే నిస ♦ ర్గంబుగాఁగ
వెలయుఁ బూర్వపతివ్రతా ♦ తిలకములకు, సాటి యౌనని బుధజనుల్ ♦ సంతసింప
వినయసంరక్షణక్రియా ♦ నూనసంత, తాదరోదయపరిపూర్ణ ♦ యన్నపూర్ణ. 75

గీ. నీతిబలశాలి యాపెద ♦ నీలమంత్రి, పుత్రకులఁ గాంచె నయ్యన్న ♦ పూర్ణయందు
సుగుణవిశ్రుతుఁ డగునిన్ను ♦ సోమమంత్రి, సత్యసంధుని లచ్చయా ♦ మాత్యవరుని.

క. అందగ్రజుఁడవు నీవు న, వేందుకళాభరణభక్తి ♦ పాలననిత్యా
నందనిజమాననుఁడవై, యందెదవు శుభంబు సోమ ♦ నామాత్యమణీ. 77

సీ. ఆంజనేయునిలీల ♦ నధిపతికార్యంబు, నీతిబలంబున ♦ నిర్వహింపఁ
గార్యదక్షతచేతఁ ♦ గడుమాటనేర్పున, యవనేశ్వరుని చెల్మి ♦ యాచరింప
వినయు లై పొందుచే ♦ సినయట్టిమన్నెభూ, పాలవర్గములకు ♦ మేలుఁగూర్ప
వైరించినట్టిభూ ♦ వరులగర్వస్ఫూర్తి, యాహవాగ్రంబున ♦ నపనయింపఁ
జతురత వహించితివి(ర) యా ♦ శ్చర్యకరము, నీదు బుద్ధివిశేషంబు ♦ నిర్ణయింప (?)
మదనసదృగాత్ర పెదనీల ♦ మంత్రిపుత్ర, మహితకీర్తినిధాన సో ♦ మప్రధాన. 78

సీ. సంధ్యాదు లైనట్టి ♦ సద్గుణంబులయందుఁ, గలుగువిశేషముల్ ♦ గనఁగనేర్చు
సాధుదానాదిక ♦ చతురుపాయప్రయో, గంబులసమయముల్ ♦ గనఁగనేర్చు
నిరువురకే కాని ♦ యితరుల కెఱుఁగంగ, రానిమంత్రంబు సం ♦ రక్షనేర్చు
నొరులు గావించుమా ♦ యోపాయము లెఱింగి, ప్రతికార మొనరించు ♦ ప్రౌఢి నేర్చు

[illegible]ములకు శిఖా ♦ మణి యితండె, యనుచు వర్ణింతు రౌర ని ♦ న్నఖిలజనులు
విమలగుణహార ♦ పెదనీలవరకుమార, ధైర్యకుధరేంద్ర ♦ సోమపరిధానచంద్ర. 79

సీ. పరమవిశ్వాససం ♦ భరితచిత్తంబుచే, గురుని గాంతువు చంద్ర ♦ ధరుని గాఁగ
నరమరలేనియా ♦ దరముచే సకలార్థి, జనులఁ గాంతువు బుధ ♦ జనులు గాఁగ
వేదశాస్త్రాదిక ♦ విద్యాదరతఁ జూ, సురులఁ గాంతువు దేవ ♦ వరులు గాఁగ
పరిదుష్టచిత్తమ ♦ త్తారాతినృపమంత్రి, గణము గాంతువు చిన్న ♦ తృణము గాఁగ
నీనిసర్గచరిత్రంబు ♦ నిర్ణయించి, వర్ణనము చేసి యానంద ♦ పూర్ణహృదయు
లగుదు రార్యులు రాజస ♦ భాగ్రములస, మగ్రసుగుణనిధానసో ♦ మప్రధాన. 80

సీ. జయవాటికాపుర ♦ శ్రీయి యైనదుర్గాంబ, కృపఁ గాంచె నేనృపా ♦ గ్రేసరుండు
మాధవవర్మకు ♦ మాధవోత్తమవంశ, భూషణుండయ్యె నే ♦ భూభుజుండు
కఠినారిహృదయభే ♦ కరమన్నెసులుతాను, బిరుదంబు పూనె నే ♦ నరవరుండు
సకలయాచకులయా ♦ శాపూర్తి యొనరించు, నతిదానశూరుఁ డే ♦ యవనినేత
భువనవర్ణితుఁ డైనయా ♦ పూసపాటి, తమ్మభూపాలకునిసమ్మ ♦ ఖమ్మునందు
మంత్రివైతద్దయాసుధా ♦ మయకటాక్షు, మహిమఁ గాంచితివయ్య సో ♦ మపరిధాన.

సీ. ధీరతానిధి తెలి ♦ దేవరవంశసం, భవుఁడు భీమయరాయ ♦ మంత్రిమౌళి
సౌశీల్యకలితనాం ♦ చారమ్మ యనుధర్మ, పతియందు గాంచిన ♦ సద్గుణాఢ్య
యన్నమ్మయన్నక ♦ న్యను సుపుట్టిమరాజు, శంభుఁడు శాంభవి ♦ సంజ్ఞ యైన
సతియందుఁ గాంచిన ♦ యతివలక్ష్మిదేవి, యనుపుణ్యసాధ్వి న ♦ త్యాదరమునఁ
బరిణయంబైతి విరువురు ♦ పద్మముఖులఁ, బర్వతేంద్రకుమారికా ♦ ప్రాణనాథ
మహితభక్తినిధాన సో ♦ మపరిధాన. * * * 82

సీ. నవరత్నమయభూష ♦ ణములకంటెను సద్గు, ణములె యుత్తమభూష ♦ ణములు గాఁగ
సకలపురాణోక్త ♦ సద్వ్రతంబులకన్న, పతిభక్తియే ఘన ♦ వ్రతము గాఁగ
బరమాప్తసుతమిత్ర ♦ బంధులకన్న న, భ్యాగతులే ముఖ్య ♦ బాంధవులుగ
తతమహాషోడశ ♦ దానాళికన్నని, త్యాన్నదానమె మహా ♦ దానముగను
నిఖిలబాంధవజనవర్ణ ♦ నీయసాధు, వర్తనంబులచే సాధు ♦ కీర్తిఁ గాంచె
నౌర నీసతి యైన(ట్టి) ♦ యమ్మనాఖ్య, మానినీమణి సోమప ♦ రిధానవర్య. 83

సీ. ఏరామహృదయంబు ♦ హృదయేశపదపద్మ, భావనంబున నిత్య ♦ పావనంబు
ఏనెలంతముఖంబు ♦ సూనృతతుల్యాప్త, భాషితంబులె చాలి ♦ భూషితంబు

లేనాతిశయశముల ♦ దీనరక్షకదయా, వీక్షణంబులచారు ♦ లక్షణంబు
లేబాలహస్తంబు ♦ లిష్టాన్నతోషిత, బహుభూసురము లౌట ♦ భాసుతంబు
భూనుతసమాఖ్య గాంచున ♦ పుణ్యసాధ్వి, శాంతవర్తనమునధరా ♦ చంద్రవదన
రీతి విఖ్యాతిఁగన్న నీ ♦ రెండవసతి, శ్రీలసద్గుణకోటిల ♦ క్ష్మీవధూటి. 84

గీ. ఆర్యనుతవీరియందు నీ ♦ యగ్రభార్య, యైనయన్నమ్మదేవియం ♦ దధిక తేజా
నందనునిఁ గాంచితివి జనా ♦ నందకరుని, నీలమంత్రీంద్రుఁ డాతండు ♦ నిభవిలాసు. 85

గీ. నీజనకుఁ డైనయా పెద ♦ నీలమంత్రి, యనుజుఁ డనవద్యదానవి ♦ ద్యాఘనుండు
నీలకంఠపదార్చనా ♦ నియమపుణ్యా, శీలతప్రసిద్ధిగను పిన ♦ నీలమంత్రి. 86

సీ. తనకార్యదక్షతా ♦ ఘనత యేలినయట్టి, మహిపురాజ్యశ్రీస ♦ మగ్రుఁ జేయుఁ
దనకావ్యచాతుర్య ♦ మునమూర్ఖ తరుఁ డగు, శత్రుసైన సుమిత్ర ♦ జనునిఁ జేయుఁ
దనమంత్రి మెవ్వరుఁ ♦ గనలేక యుండంగ, నొరులమంత్రరహస్య ♦ మూహ సేయుఁ
దనబలస్ఫూర్తి రెం ♦ తయు నజేయము గాఁగ, నొరులమూక జయించు ♦ యుక్తి సేయు
నితఁడు కడుచతురుండంచు ♦ నెల్లజనులు, సంతసింపంగ ఘనకీర్తి ♦ సంగ్రహించె
శుభగుణాఢ్యుండు పెనుమళ్ళ ♦ సోమమంత్రి, తనయుఁ డగుపిననీలప్ర ♦ ధానమౌళి. 87

సీ. చెవులయం దమృతంబు ♦ చిలికింపఁ జాలు శ, య్యాఘనమందానంద ♦ మందువారు
పదవాక్యవిభజన ♦ ప్రౌఢికెంతయు సంత, సిలి శిరఃకంపంబు ♦ సేయువారు
వితతనానారసో ♦ చితము లైకనుపట్టు, నుచ్చారణములకు ♦ మెచ్చువారు
నర్థంబు వివరించి ♦ నట్లుగాఁ దెలియంగఁ, బలుకుట కెంతైన ♦ న(ఫ)లరువారు
నగుచు సభ్యులు వెరగంద ♦ నాంధ్రభాష, నమరుభారతభాగవ ♦ తాదులయిన
కృతులు చదివెడుఘనచమ ♦ కృతులు నెరపు, సుందరీపంచబాణుఁడు ♦ సోమమంత్రి
మణికుమారుండు పిననీల ♦ మంత్రిఘనుఁడు. 88

జీమూతఖచరతా ♦ చేష్ట మాన్పినవేల్పు, బేసిచేతులప్రభా ♦ భాసురుండు
తేజిపై పగఱూను ♦ తేజికెక్కినపెద్ద, రేలయందును విహ ♦ రించుఘనుఁడు
భువనంబు లేలున ♦ ద్భుతకరైశ్వర్యుండు, నిలుచు టెక్కడ లేని ♦ బలయుతుండు
చంద్రపాలనమహో ♦ త్సాహసమగ్రుండు, చిగురువాల్దొరను గెల్చినవిభుండు
నాల్గుదిక్కులఁగల మేది ♦ నీ(1)(శ్వరుల)నాథ, సభలసంశ్రాంతమును బ్రకా ♦ శంబునొందు
చంచలవిలోచనానవ ♦ పంచశతస, మాన పెనుమళ్ళ పిననీల ♦ మంత్రికీర్తి. 89

(1) "ఎత్తుగీత్యాదిపాదవిశ్రమభంగః." అని లేఖకుఁడు మూలమున వ్రాసెను.

సీ. ఏలిననృపతియే ♦ యెఱుఁగు నమ్మంత్రిశే, ఖరునీతివిద్యాతి ♦ గౌరవంబు
నఖిలవిద్వత్కవీం ♦ ద్రాళియే యెఱుఁగు నా, సచివావతంసుని ♦ చదువుప్రజ్ఞ
గిరికన్యకామనో ♦ హరుఁడే యెఱుఁగు నాప్ర, ధానేంద్రునిశ్చలం ♦ బైనభక్తి
యిలఁ గల్గునర్థులే ♦ యెఱుఁగుదు రయ్యమా, త్యవరేణ్యునిశ్శంక ♦ దానమహిమ
జయము గని మేలెఱింగి ని ♦ శ్శంకరీతి, కలరి పరిపూర్ణకాము లై ♦ నట్టికతన
మహితలంబున పినసీల ♦ మంత్రిమహిమ, ప్రస్తుతింపంగఁ దగు సభా ♦ భ్యంతరముల. 90

గీ. ఘనుఁడు చినసీలమంత్రిశే ♦ ఖరుఁడు సకల, జనులకును గార్యుఁడై ప్రకా శంబునొందె
నాత్మజనకుండు సోమాఖ్యుఁ ♦ డైనకతన, నతఁడు సౌమ్యతఁ గాంచుట ♦ యబ్బురంబె.

ఆ. ఆతుకూరి బసవ ♦ నామాఖ్యుఁ డెబ్బపా, ఖ్యానవనితయందుఁ ♦ గాంచినట్టి
పాపమాఖ్యసాధ్విఁ బరిణయంబయ్యె నా, చిన్ననీలమంత్రి ♦ శేఖరుండు. 91

సీ. భక్తియుక్తంబుగాఁ బతిసేవ సేయుటే, మంజువాణికిఁ బర ♦ మవ్రతంబు
వినయదాక్షిణ్యవి ♦ వేకతమాదులే, సాధ్వీమతల్లికి ♦ సహజగుణము
లన్నదానంబుచే ♦ నతిథివర్గముఁ బ్రోచు, ఘనతయే సతికి సం ♦ కల్పితార్థ
మత్యంతమృదులస ♦ త్యప్రియభాషణ, ప్రౌఢియే యింతి క ♦ భ్యస్తవిద్య
యవ్వధూమణి సకలభా ♦ గ్యైకవసతి, నుభయకులపావని యనంగ ♦ నుర్వియందుఁ
గీర్తిఁ గాంచెను భర్త్రైక ♦ వర్తనమున, భవ్యగుణకోటి పాపమాం ♦ బావధూటి. 92

చ. హరచరణార్చనానిపుణుఁ ♦ డాచిననీలయమంత్రిసద్గుణో
త్తరనిధి పాపమాఖ్యవని ♦ తామణియందునఁ గాంచెఁ బుత్రిలన్
సురుచిరకీర్తివై భవుఁడు ♦ సోమనమంత్రియు సుందరీమణీ
హరుఁ డగుభాస్కరుండు బస ♦ వన్నయు నన్నగుణాభిరాములన్. 93

వ. అందగ్రజుండు.

సీ. పార్వతీశ్వరపాద ♦ పంకేజయుగపూజ, నాసక్తుఁ డయ్యె బా ♦ ల్యంబునందు
నుచితజ్ఞుఁ డై మూర్తి ♦ నిదయవాంఛితములి, య్యంగ నేర్చెఁ జిరుతప్రా * యంబునందు
వివిధకావ్యపురాణ * విజ్ఞానమున మహో, న్నతుఁ డయ్యెఁ దగఁ బిన్న * నాఁటియందుఁ
బార్థివేంద్రస్థాన * బహుకార్యదక్షుఁ డై, విలసిల్లెఁ గౌమార * వేళయందు
నితఁడు భాగ్యాతిశయవంతుఁ * డెంచిమాడ, ననుచుఁ బ్రస్తుతిసేయుదు * రార్యజనులు
శ్రీకరగుణాభిరాము నీ * చిన్ననీల, మంత్రిశేఖరుసోమనా * మాత్యవరుని. 94

సీ. న్యాయంబుచే నర్థ * మార్జించుటే కాని, మెచ్చి విద్యలవారి * కిచ్చుచుండు

భూనాథుసమ్ముఖం◆బున వసించుటయెల్ల, హితులకార్యము నిర్వ◆హింపుకొఱకు
బహుధర్మశాస్త్రముల్ ◆ పఠియించుటెల్ల నా, రీతులెల్లను నాచ◆రించుకొఱకె
సజ్జనసాంగత్య ◆ చతురుం డగుటయెల్ల, సద్గుణాభ్యాసంబు ◆ సలుపుకొఱకె
కాఁగ ధరయందునుత్తమ◆ఖ్యాతిఁ గనియె, మంత్రిరత్నంబు చినసీల◆మంత్రిసుతుఁడు
ప్రాభవధురంధరుండువి◆ప్రబలగర్వ, బహుతిమిరభాస్కరుం డైన◆భాస్కరుండు.

సీ. జననాయకాస్థాన ◆ జనులెల్ల మెత్తురే, మంత్రికందర్పుని ◆ మాటనేర్పు
జగతి యాచకులు ప్ర◆శంస సేయుదు రేయు, మాత్యునిసకలస◆మ్మతవితీర్ణి
విద్వజ్జనశ్రేణి ◆ వినుతి గావించు నే, సచివాగ్రగణ్యుని ◆ చదువుప్రజ్ఞ
తారుణ్యవతులు చి◆త్తమున నిల్పుదు రేప్రి, ధానరత్నంబు సౌం◆దర్యమహిమ
యతఁడు కీర్తి వహించు ది◆గంతములను, నంతసద్గుణసౌజన్య◆వంతుఁ డగుచుఁ
గతిదుర్మంత్రిమానస◆గర్వతిమిర భారనవభాస్కరుం డైన ◆ భాస్కరుండు. 98

క. ఆభాస్కరునను జన్ముఁడు, మాభామారమణపదస ◆ మంచితభక్తి
శ్రీభావిత కమనీయ, ప్రాభవ్రుఁ డగుబసవమంత్రి ◆ రత్నం బలరున్. 99

చ. అసమశరపార్వతీశ్వరద ◆ యాపరిపూర్ణకటాక్షవైభవో
ల్లసనముచేత సర్వదిశ ◆ లందును గీర్తి ప్రకాశమందఁగా
రసికులు మెచ్చఁగాఁ దగిన ◆ రమ్యవచోమహిమంబుఁ బూనుచున్
బసవనమంత్రిశేఖరుఁడు ◆ భాగ్యవిశేషము నందు నిచ్చలున్. 100

గీ. అమితసుగుణాఢ్య యిట్టియ◆న్వయమునందు, నమృతవార్ధికిఁ జంద్రుఁడ◆వయి జనించి
నాఁడ వటుఁగాన మిగుల న◆న్నతివహింప, వలయు నీచేత బుధలోక◆వర్ణ మగుచు.

ఉ. కావున సత్యస్థిరయొక ◆ కావ్యము నీ వొనరించి శైలక
న్యావిభుఁ డైనదేవునకు ◆ నర్పణ సేసితివేని నీయశ
శ్శ్రీవిభవంబు చాల విల ◆ సిల్లుచునుండు సమస్తదిక్కులన్
భూవరవర్ణనీయగుణ ◆ భూషణ సోమనమంత్రిశేఖరా. 101

క. అనుచు సభాసదు లందఱు, వినయంబునఁ బల్కినట్టి ◆ విశదోక్తులచే
మనమున నత్యానందము, గని యిట్లు వహించితిన్ బ్ర◆కాశితబుద్ధిన్. 102

సీ. మును నామనంబున ◆ జనియించె నొకకళన్య, కావ్యంబు రచియించు◆కౌతుకంబు
పరసు తైనట్టియా ◆ సభ్యులపలుకు వా, క్యములచందంబున ◆ నట్టిదయ్యె
స్కాంధపురాణంబు ◆ నందు బ్రహ్మోత్తర, ఖండంబునందు వి◆ఖ్యాతిరైన
సీమంతినీనామ ◆ సీమంతినీమణి, చారిత్ర మాంధ్రభా◆షను రచించి

యాప్రబంధంబు శ్రీపర్వ ♦ తాగ్రభూమి, యందు భ్రమరాంబతోఁ గూడ ♦ నలరు మ
ల్లికార్జునమల్లేశ్వరునకు స ♦ మర్పణంబు, సేసిన సమస్తశుభములు ♦ జెందునను ను. 104

## షష్ఠ్యంతములు

శ్రీశైలవిహారునకున్, కేశవవాణీశముఖ్య ♦ గీర్వాణనికా
యాశాశ్వదయాసారని, వేశ శ్రీమత్కటాక్ష ♦ విస్తారునకున్. 1
లీలావరచిత్తజగ, జ్జాలునకున్ గళితశరణ ♦ శరణాగతర
క్షాలాలితశీలునకున్, హాలాహలచర్వణక్రి ♦ యాలోలునకున్. 2
సోమజదానవహరబల, సామగ్రీయుతమహాగ్రి ♦ సంగ్రామునకున్
తామరసబాంధవాయుత, ధామునకున్ మకుటగతసు ♦ ధాధామునకున్ 3
ధర్మునకు దీనశరణుని, సర్గునకు సమస్తభక్త ♦ జనపరిభూత
వ్యర్గునకు విదళితాసుర, వర్గునకుఁ బ్రకృష్టయోగి ♦ వరమార్గునకున్. 4
నిగమనుతభ్రమరాంబా, మృగనయనావదనకమల ♦ హితదినమణికిన్
జగదుద్భవాదికరణ, త్రిగుణికిమల్లేశ్వరాఖ్య ♦ దేవాగ్రణికిన్. 5



వ. అవధరింపుము. సభక్తిపూర్వకంబుగా నాసమర్పింపం బూనిన సీమంతినీకళ్యాణం
బను మహాప్రబంధంబునకుం గథాక్రమం బెట్టిదనిన.

క. శివపదకమలధ్యాన, ప్రవిమల హృదయారవింద ♦ పావన మునిరా
డ్భవనము కృతనానావిధ, సవనము నైమిశవనంబు ♦ జగతిన్ వెలయున్. 105

సీ. జన్నంపు టన్నంపు ♦ దవులు యాసలఁ గన్న, సురరాజు గణనకె ♦ చ్చోట హెచ్చు
హవ్యకవ్యాదిక ♦ ద్రవ్యంబు సమకూర్చు, సురభిసంతాన మె ♦ చ్చోటఁ దనరు
బహురూపవిలసిత ♦ ప్రౌఢవాణీ సతి, స్ఫుటనాట్యరచన కె ♦ చ్చోట ఘనము
మునితపోమహిమ సా ♦ ధించిన జగతీత్రయాభ్య, సుర తీర్థ సమితి యె ♦ చ్చో సమగ్ర
మది విహితముక్తికన్యా స్వ ♦ యంవరాఖ్య, ధాన కల్యాణ సంగతో ♦ దార చరిత
సిద్ధ జనితా నితాంతప్ర ♦ సిద్ధ మునిశ, రణ్య మైనట్టి నైమిశా ♦ రణ్య మమరు. 106

సీ. తొలుబల్కు నునుబల్కు ♦ తొలుబల్కులని పల్కు, పాలుపుగుక్కైడు చిల్క ♦ ప్రోడ లచట
పవనంపు బసుల యా ♦ పవనంపు జగతి మూఁకలు గూడు చిరుత కో ♦ కిలములచట
తపమందు నాముమ్మ ♦ తపమందు నెంచక, నిలుచు బాల కురంగ ♦ నికర మచట
పారసామ యుతి మనో ♦ హార సామ నియమంబు, పాటించు గోవత్స ♦ కోటి యచట
కరక్రిశపు తరక్రియల పక్కి ♦ కలను వలను, మీఱు వివిధాశయంబుల ♦ తీరు లెడిరి
గడుపఁ గడువాదధూకత ♦ నుమువుచుండు, చిన్ని ప్రాయంపు శారికా ♦ శ్రేణి యచట.

గీ. తమమునక్రాంతమును దూర ♦ తమను సేయ, జనులకుఁ బ్రబోధ మొనరింపఁ ♦ జాలునిందు
మునులు గలుగంగ మీరేటి ♦ కనిన రీతి, తరణి కిరణము లరికట్టెఁ ♦ దరువు లచట.

చ. మునులు నిజాంతరంగముల ♦ మోదక యుండు నదల్చినన్ భయం
బున శరణంబు నొందిన స ♦ మున్నత రాగము బల్ల పద్చలం
బున ధరియించి యందుఁ గుజ ♦ ముల్ పెర జెందెనో వారిపోత శో
లన ఘన కైతవంబున జ ♦ లాదల భావము నొందు చుండెసిన్. 109

చ. తనయుల లోన భేద రహి ♦ తంబుగ బెంచిన లేటిపిల్లలన్
గనుఁగొని యందు మానిజన ♦ కాంతలు మోములు ముద్దు లాడువా
రి నయన తారతమ్యముఁ బ ♦ రీక్షగఁ జూపఁజ యెంచెఁ గాని న
య్యానఁ దమమోములందు వారి ♦ కాంక్షతఁ దెల్ప ప్రకార మయ్యెడున్. 110

సీ. జరత మార్జాలి మీ ♦ సముల నుయ్యాల లూఁగు, శైశవ క్రాంత మూ ♦ షక కులంబు
కేకి పింఛచ్ఛాయ ♦ కేళికా యానంబు, గడుపు బాలిక భుజం ♦ గ వ్రజంబు
బాలెంత పులుల చ ♦ న్బాల యాపలు గని, వర్తించు తరుణ గో ♦ వత్స రాజి
వికటంపు కెలినోటి ♦ మొకముల మూకతోఁ, జెరలాడు వేదండ ♦ శిశు గణంబు
తే. చక నివాసముల(యందు) ♦ పెండ్లిపెద్ద, 1 తనము గావించు వాయుసం ♦ గనల
[గమియు,
సహజ వైరవికారంబు ♦ సడల జేయ, మునుల మహిమంబుఁ దెలుపు న ♦ వ్వన
[మునంచు.

సీ. దేవపూజలఁ బూలు ♦ తెచ్చు బాలల కరం, బుల తోడఁ బల్లవం ♦ బులకె కాని
వర హావ్య పాచికా ♦ దరహాస రుచులతో, సురగవి క్షీర రో ♦ చులకె కాని
లతలఁ బోషించు వి ♦ లాసినీ తతి కుచం, బులతోడ జలకుంభ ♦ ములకె కాని
గంగ తీర్థములాడు ♦ కాంతావితతి మొగం, బులతోడఁ బంకజం ♦ బులకె కాని

1 పెండ్లిపెద్ద (మూలము)

తేరి తేఁ బరిద్యోతితముగ బో ♦ ధింపవచ్చు[1], రమణుల మనోజ్ఞకర్ణోత్ప ♦ లములతోడ
లలిత ఘూమలతాంకురం ♦ బులకె కాని, కలహ మవ్వని నెచ్చోట ♦ గానఁ బడదు.

క. ఆ నైమిశాఖ్య వనమున, మౌనీంద్రులు గలరు గిరికు ♦ మారీ రమణ
ధ్యానావధాన నిశ్చల, మానసు లసమాన సహజ ♦ మతినిష్ఠం దుర్విన్. 113

ఉ. కాముఁ గెల్చి క్రోధపు వి ♦ కారము దూరముఁ జేసి లోభము
న్నామము మడంచి మోహ కల ♦ నం జలియించుట లేక దుర్మదో
ద్దామత మాన్చి మచ్చరపు ♦ దాకి జరింపక తత్త్వమార్గని
ష్ఠామ వివేకలీల విల ♦ సిల్లుదు రమ్మునిరాట్ఛిఖామణుల్. 114

మ. సుమనోధర్మము పూని లోక విజగీ ♦ షుండైన పంచేషునిన్
సుమనోధర్మమె పూని యప్పరమ మౌనుల్ ♦ గెల్వఁగా నోడి యొం
త మహాశూరుఁడొ యాతఁడ ప్పగతులం ♦ తన్ దీర్చుకోఁ జాలె ని
త్యముఁ దచ్చిత్తములందు ముక్తి యని ♦ తా వ్యాసక్తి గల్గింపుచున్. 115

క. వార లనవద్య విద్యో, దారులు శౌనకుఁడు ♦ దనకు నగ్రణిగా నా
నారూప కథా నిపుణ న, చోరచనా ఖ్యాతుఁడైన ♦ సూతుని వలనన్. 116

క. మాధవ చారిత్రములును, మాధవ నానా ప్రకార ♦ మహనీయ యశో
గాథలు వినుచు సుమేధా, సాధారణలీల నొక ♦ ప్రసంగం బైనన్. 117

గీ. అకట కథకవర్యు తోడ ని ♦ ట్లనిరి వినయ, మనయము ఘటిల్ల నైర్యంపు ♦ టాదరంబు
ఘంబు జనియింప నతిమేదు ♦ రంబు లైన, సత్య మధుర వచో విలా ♦ సముల చేరి.

ఉ. సూత! దయాసమేత! మృదు ♦ సూక్తి సుధారస పూర చారుధా
రాతత దాన మానిత స ♦ మస్త మహీసుర మౌని జాత! నీ
చేత మనంబు నిర్మలముఁ ♦ జెందె విఘాతము లయ్యెఁ బాపసం
ఘాతము లయ్యెఁ బుణ్యము ల ♦ గణ్యములై ఫలియించె నియ్యెడన్. 119

గీ. హరి కథల్ వింటి మేమసం ♦ ఖ్యములు గాఁగ, నాలకింపఁగఁ బడియెఁగా ♦ హరి
[కథలు
నైనఁ దనియఁగఁ జాల మిం ♦ తైనఁ గాని, నీ వచోమృత పూరంబుఁ ♦ ద్రావి త్రావి.

క. అటుఁ గావునఁ బావన మగు, నిటలాక్షుని చరిత మమృత ♦ నిభ గంభీర
స్ఫుట వాగ్వైఖరి నింకొ, కటి యానతి యియ్యఁదగియెఁ ♦ గరుణాంబు నిధీ.

సీ. హృజ్జాత పాతకం ♦ బెడగా జరించునే, పార్వతీశ ధ్యాన ♦ పటిమఁ గాక

---

1 ధించుయబ్బు.

భాషా గతాశేష ♦ దోషంబు లణఁగునే, ప్రమథేశ నామ కీ ♦ ర్తనలఁ గాక
బహుంత రాకృత్య పా ♦ పము లోప మందునే, శంభు సేవా కృత్య ♦ సరణిఁ గాక
దుష్కథాకర్ణనా ♦ దురితంబు వాయునే, శివకథా శ్రవణంబు ♦ చేతఁ గాక
భవమునందు నిరంత రో ♦ ద్భవము నందు, ఘోర కల్మష వారంబు ♦ దూర మగునె
చంద్ర ఖండ శిఖా రత్న ♦ చారు చరణ, కంజ పఁజాత భక్తి మా ♦ ర్గమునఁ గాక.

సీ. అవిరతాజ్ఞాన గా ♦ ఢాంధకార వికార, భేద నోదార సూ ♦ ర్యోదయంబు
జన్మ పారంపరీ ♦ సర్వ దుర్వాసనా, సంబంధ జంబాల ♦ జాల వారి
దారుణాంతక పుర ♦ ద్వార నిరాఘాట, మార్గ వారణ కవా ♦ టార్గళంబు
సుర తామరస ముఖీ ♦ సురతా మితానంద, పర సుధా జనన మం ♦ దర నగంబు
ఘోర సంసార వారాశి ♦ పార భూమి, హరి వరముక్తి కన్యకా ♦ హరి తుల్య
మనిశ మునిశత గేయ శ్రీ ♦ సాహి రాజ, కర్ణ భూషణ సత్కథా ♦ కర్ణనంబు. 123

గీ. అఖిల విద్యా నిధాన మ ♦ హైన కతన, హర చరిత్రామృతంబు క ♦ ర్ణాంతరములఁ
జిలికి నిశ్శేష దోషము ♦ ద్రోలఁగఁ జేసి, మముఁ గృతార్థులఁ జేయుమా ♦ మానివర్య

క. హరుఁ డెట్టి భక్తి మెచ్చును, హరునకు సేయు వ్రతంబు ♦ లధిక ప్రియముల్
హరు సేవా విధ మెట్టిది, హర భక్తుల చరిత మెట్టి ♦ దార్య వతంసా.

క. అని శౌనకుఁ డాదిగఁ గల, ముని వర్యులు పలికినన్ బ్ర ♦ మోద వికసితా
నన కమల మలర సూతుం, డనియెన్ వినయంబునను గృ ♦ తాంజలి యగుచున్.

ఉ. ఓ మునివర్యులార ప్రియ ♦ దోన్నతి మీఱఁగ మీర లద్రిజా
స్వామికథా సుధానుభవ ♦ వాంఛ వహించుట యెల్ల నారయన్
మామక పూర్వ జన్మ శత ♦ మంజుల పుణ్య లతా వితాన ని
స్సీమ ఫలోదయం బగుట ♦ చే లభియించిన మే లనందగున్.

గీ. హరుని చరితంబు నిస్సంశ ♦ యంబు గాఁగఁ, బలుక వాణీ వధూటికా ♦ ప్రాణభర్త
యైనఁ జాలఁడు నా నేర్చి ♦ నట్టి కొలఁది, మీకు వివరింతు విమల వి ♦ వేకులార.

సీ. ప్రియభక్త కోటి క ♦ భీష్టముల్ దయసేయు, కామధేనువు నీల ♦ కంధరుండు
పాదాశ్రిత శ్రేణిఁ ♦ బరిపాలనము సేయు, కల్పభూజము చంద్ర ♦ ఖండమౌళి.
శరణాగతులకు సా ♦ క్షాత్కరించిన గృహం, గణ నిధానంబు గం ♦ గా ధరుండు
సేవకా వళులకు ♦ సిరు లియ్యఁజాలు చిం, తామణీ కళిక స ♦ దాశివుండు
దీన సంరక్షణ క్రియా ♦ ధీ[illegible]న, దీన కరుణా సుధావార్ధి ♦ విశ్వభర్త
యమ్మహాదేవు భజియించు ♦ నట్టి వారి, భాగ్య మెన్నఁగఁ దర మౌనె ♦ బ్రహ్మ కైన.

జాంబూనద స్నేహ♦సంబంధ జంబాల, సంకుల నోద్వేల♦(సార) జలము
నిత్య దుష్కర్మ నిరత సాం♦గత్య జనిత, ఘనతరాఘౌఘ నిబిడాంధ♦కార నికర
జృంభణ స్తంభకరణ సం♦రంభ దివస, రాజ బింబంబు సోమ వా♦ర వ్రతంబు.

సీ. నిత్య వాణీ వధూ♦నృత్యక్రియా పూర్వ, రంగంబు సోమ వా♦ర వ్రతంబు
స్వర్ద్వారదేశ క♦వాట విపాటన, రణికంబు సోమ వా♦ర వ్రతంబు
సకల భూవలయ రా♦జ్యరమా కటాక్ష సా, రస్యంబు సోమ వా♦ర వ్రతంబు
ప్రకటీకృ తాంతక♦భ్రుకుటీ వికార ని, ర్దళనంబు సోమ వా♦ర వ్రతంబు
భావ సంభవ విజయ ప్ర♦భావ సుజన, తా వర విధేయ ముక్తి కాం♦తా వతంస
చిర పరీరంభ సంభ్రమ మో♦జ్జృంభి తాఖి, రాము సుకృతంబు సోమవా♦ర వ్రతంబు.

ఉ. చంద్రుని వాసరంబునను♦జంద్ర కళాధరునిన్ దుషార శై
లేంద్రిసుతా సమేతు భజి♦యింపఁగఁ గన్న మహాత్ముఁ డెన్న దే
వేంద్రుని సాంద్ర వైభవము♦హెచ్చును మెచ్చఁడు సత్యలోక ని
స్తంద్ర నికేతనంబునకు♦ దార్పఁడు చిత్తము నుత్త మోన్నతిన్.

మ. తపముల్ వేయును వేదశాస్త్ర బహుచిం♦తా దాన నానోపవా
స పరత్వంబులు నేల మర్త్యునకుఁ గం♦జాతారి వారంబునం
దుపవాసం బొనరించి పంచముఖు స♦ద్యోగీంద్ర సంభావ్య భ
వ్య పదాంభోరుహుఁ బూజ సేయఁ గల భా♦గ్యం బొక్కటే కల్గినన్.

గీ. ఇందు వారంబునందు ఖం♦డేందుధరునిఁ, గొలుచు వేళఁ బ్రదోషంబు♦ గూడె నేని
జాపతర కాంతి మీఱం ప♦దాయ వన్నె, కాంచనముతోడ రత్నంబు♦ గదిసినట్లు.

చ. జగతి నతిప్రశంస గనఁ♦జాలు సుధాంశుని వాసరంబునన్
బగలు భుజింప కంబురుహ♦బాంధవుఁ డస్తమయంబుఁ జెందినన్
నిగమ నికాయ గోచరుని♦నీలగళున్, గరుణా ప్రసన్నుఁ జె
న్నగు వివిధోపచార నిచ♦యంబునఁ బూజ యొనర్పఁగాఁ దగున్.

గీ. అమృతకరు వాసరము నప♦రాహ్ణ వేళ, హరునిఁ బూజించి భోజనం♦బాచరించి
మాపు భుజియింప కుండిన♦మానులార, సద్వ్రతమె యందు రన్యప♦క్షంబునందు.

గీ. ఇందు వాసరమునను రా♦త్రిదివసంబు, భోజనము మాని హరు పదాం♦భోజ పూజ
చేసి మరునాఁడు పారణఁ♦జేసె నేని, సత్తమోత్తమ మంద్రదు వే♦జొకర మరము.

1 కరటిసారం (మూలము)

క. యేరీతినైన నీవ్రతి, మారూఢముగా నొనర్చు ♦ నఘుని యందున్
గారుణ్య భరము పూనును, గౌరీ రమణుండు ప్రమద ♦ కలి తాత్ముఁడై.

గీ. క్రతుల శతకంబు సకల తీ♦ర్థముల సేవ, యర్థ దానంబులును మొద ♦ లైన వె
ల్లనిందు వాసరమునఁ బార్వ♦తీశు పూజ, యాచరించుట కోడఁ దు♦ల్యంబుగాదు

క. అని సూతుఁడు బల్కిన న, మ్మునివరు లాశ్చర్యమున్ బ్ర♦మోదంబు మనం
బునఁ బెనఁగొనఁగా నిట్లని, రనుపమ వినయోన్నతిన్ గృ♦తాంజలు లగుచున్.

చ. గిరి తనయా మనోహరుని ♦ కిన్ బ్రియమైన సుధా మయూఖ వా
సర మహిమంబుఁ జెప్పితి వ♦(సాధ్య)సుఖైక నిదాన మంచు నో
పురుష వరేణ్య యావ్రతము♦ పూర్వ యుగంబున నెవ్వ రాచరిం
చిరి వివరింపఁగాఁ దగియె♦ శ్రీకర మైన కృపా భరంబునన్.

గీ. అనవు డాసూతుఁ డిట్లను♦ నసఘులార, సోమ వార వ్రతంబు న♦స్తోక మహిమ
ప్రకటముగఁ జేయు నితిహాస♦ మొకటిగలదు, వినుఁడు వివరింతు దానిస♦విస్తరముగ.

శా. ఆర్యా జన్మ నివాస వింధ్య గిరి మ♦ధ్య క్షోణి భాగంబునం
దార్య శ్రేణికి నాశ్రయం బగుటచే♦ నన్వర్థ నామంబుతో
నార్యావర్త మనంగ దేశ మలరున్ ♦ హార్యాది దిక్పాల కై
శ్వర్య శ్రీ పరిహాస భాసుర గృహ♦స్థ వ్రాత సంకీర్ణమై.

సీ. నవ కుంకుమ పరిమా♦న వితాన చర సమీ, ర కిశోర చయ విహా♦ర క్రమంబు
జగదేక కలుష నా♦శన సుధాశన ధునీ, సాధు నీర తరంగ♦ సంగమంబు
కాశీశ మకుట ప్ర♦భా శీతభాను స, చ్చంద్రికా సాంతత్య♦ సౌష్టవంబు
సద్య స్సమానీత♦ సారంగ నాభికా, సార సౌరభ సము♦ద్గార మహిమ
తెలుపుదు తనయంద కలదని♦ యితర దేశ, ఘనత హాసియించు చుండున♦ జ్జనపదంబు
పాలిత వనచర చమరికా♦ ప్రకర వాల, జాత రుచి ధాళధళ్యంబు కైతవమున.

ఉ. అందు నమంద ధర్మ గుణ♦మందు మహా గృహ మేధి బృంద మిం
పొంద గృహాగతాతిథి స♦ముత్కరమున్ గని సేదఁ దేర్చు నా
నందము చిత్ర మౌను నిజ♦ సౌధ పరంపర గల్గు నీడలం
జెందిన ఖేద రోత్కరము♦ సేదలు దేర్చు ప్రకార మెన్నఁగన్.

ఉ. సరస కురంగ నాభి యని♦శంబు నలం దెడు మంద యానలం
దుకుజల కేళికా నిరతి♦ నొందఁగ గంగ, పతంగ కన్యకా

---

(వ♦రుఖైక) మూలము.

కఠోర మను సంశయంబునకు ♦ సంశ్రియ మయ్యెఁ దదీయ కీర్తి వి
స్ఫురణము గూడి పోడి యయశో విసరంబు వహించె నే యనన్.

ఉ. ఆమహనీయ దేశ మని ♦ లాశన హార విలాసి కాశికా
స్వామిని గాఁగలించుటకు ♦ సంశయ మొందు భవానిఁ దేర్చు గో
ధూమధురట్ట నాద నవ ♦ తోయద గర్జిత జాత కౌతుకో
ద్దామ కుమార వాహన ర ♦ తంబు కతంబున నెల్ల వేళలన్.

ఉ. ఆతఁడు గాంగ తోయ నిచ ♦ యంబుల నెల్లపుడున్ దదీయ తీ
ర క్షితి యందుఁ బండి పలు ♦ రాజనముల్ గనుపట్టు నాజగ
ద్రక్షకు కాశికావిభుని ♦ రాణి ధృతా భయపాణి కూర్మి దు
ర్భిక్షము శిక్ష సేయ నడ ♦ రించిన కన్నుల కెంపులో యనన్.

ఉ. ఈతుల 1 లేని జాని ధృతి ♦ కే నతివృష్టి యవృష్టి నింక నే
రీతియు నైన మీర లడ ♦ రింపకుఁ డంచు ఘనాలిఁ జేరి వి
ఖ్యాతగతిన్ దదీయ రమ ♦ గల్లఁ చపేట మొనర్చు చంచల
చేతన కైతవంబున నొ ♦ గిన్ గన నైన కరాంచలంబులన్.

గీ. యతఁడు నాయక లజ్జాక ♦ రాత్మయ ప్ర, కాశకా శ్రీలఁ దనరు నా ♦ దేశ మేలు
మేలు ధర్మగుణంబుచే ♦ మృదుపదాంబు, జాశ్రియా ధృతి చిత్రవ ♦ ర్మాఖ్య నృపతి.

సీ. తన యశో మయ పిసూ ♦ తన సుధాకరునకు, గగన మంతర కళం ♦ కంబు గాఁగఁ
దన యనర్ఘ్య దయా సు ♦ ధా వారిరాశికి, ధరణి మధ్య ద్వీప ♦ తలము గాఁగఁ
దన ధర్మ నిర్మ లో ♦ ద్యమ రమా సేతకుఁ, జక్రవాళము సుద ♦ ర్శనము గాఁగఁ
దన ప్రతాప దగ్ర ♦ దావ పావకునకు, గ్రహము లగ్ని స్ఫులిం ♦ గములు గాఁగఁ
దన యనుపమాన సుగుణ ర ♦ త్నములకఖిల, పంకజాత భవాండంబు ♦ భరణి గాఁగ
నవనిఁ బాలించె సకల లో ♦ కాభినంద్య, ధర్మమతి యైన యా చిత్ర ♦ వర్మనృపతి.

ఉ. అంతిక వర్తి యైన తుహి ♦ నాచల వర్య మవార్య ధైర్య మ
శ్రాంతము నా నృపాలకుని ♦ సన్నిధి నేర్చుచు నున్నదో గుహా
భ్యంతర సీమఁ దద్విమత ♦ పంక్తుల డాఁచి భయంబు బెందెనో
సంతతము న్మనోజ్ఞ మణి ♦ సంతతి నర్పణ సేయుచుండెడున్.

చ. అలఘు తదీయ హేతి నిహ ♦ తారుల కబ్బు సురత్వ మంచు నా
ర్యు లనిరి గాని నాదు మది ♦ నూహ యొనర్పఁగ బ్రహ్మ భావమే

---

1 జావనీచటి (మూలము)

కలుగఁగఁ బోలు నెట్టనినఁ ♦ గాంచిరి వారి సధర్మిణీ మణుల్
గళముల నిర్గుణత్వమును ♦ గన్నుల యందు నిరంజనత్వమున్.

సీ. బహురత్న నిచయ మ♦ర్పణము సేయు పయోధి, నరివధూనయనాంబు♦ఝరుల చేత
నవిరళ సస్య ఫలంబు♦ సమకూర్చు జగతి ను, న్నతి బాహు సంస్థాప♦నంబు చేత
సమరీతి వర్షించు జల♦ధర శ్రేణి ను, త్తమ యాగ హోమ ధూ♦మముల చేత
సంతతంబు లోపఁగు నష్ట♦య్యమర పుంగవుల ది, క్పాలన సాహాయ్య♦పటిమ చేత
వృద్ధి నొందంగ నతిసౌఖ్య♦వృత్తి గనఁగ, ఘనత గాంచంగ నుత్సాహ♦కలననలరఁ
జేసె నజ్జగతీ నాథ♦శేఖరుండు, చర్చ సేయఁ గృతజ్ఞతా ♦ శాలి గాఁడె.

క. అతని యరాతి భీతి నభ ♦ యార్థిగ నన్యులఁ గావతేమి యు
ద్భుతకర మానె తద్వినత ♦ భూపతి గోపన రతురీతి నా
యత మగు దశ్రివాళి గిరి ♦ యందలి గద్దతి యంధకారమున్
కత నిజకీర్తి చంద్రికల ♦ చేత నతం డలరించు చుండఁగన్.

భువన జనాభిరామ గతిఁ ♦ బొల్పగు నాతని 1 శోప్రతాప హై
భవమను పావకంబుఁ గని ♦ పావకుఁ డెంతయు వ్రీడఁ జెంది త
ద్భువన జయాంచి కాందుటకుఁ ♦ బోయి తపం బొనరించు చుండెఁ దా
నవిరతమున్ సముద్ర జల ♦ తాంతర సీమను బాడబాకృతిన్.

ఉ. అసమానీయ కీర్తి ఖని ♦ యైన జనాగ్రణి భక్త లోక చిం
తామణి నాదిదేవుఁ గరు ♦ ణా పరిపూర్ణ సుమా మనోహరున్
గోమల చంద్ర మౌళిఁ దన ♦ కుం గల దేవత గాఁగ నాత్మలో
నేమఱుపాటు లేక భజి ♦ యించు నచంచల భక్తి సంగతిన్.

సీ. తన చిత్త మెప్పుడు చి♦త్తజ గర్వ హార మనో, హర పదాంభోరుహాం♦తరమునంద
తన జిహ్వ యెప్పుడు చం♦ద్ర కళా కిరీట పా, వన నామ మంత్రకీ♦ర్తనమునంద
తన చెయ్వి లెప్పుడు భూ♦ధర రాజ కన్యకా, రమణోపచా రార్చ♦ణములయంద
తన వీను లెప్పుడు వే♦దండ దైత్యారి నా, నా చరిత్రాకర్ణ♦నముల యంద
కాని వేఱొక చో నియు♦క్తంబు గాఁగ, నీక యమ్మేదినీ జనా♦నీక కీర్తి
నియత చారిత్ర శాలి యా♦నృపతి మౌళి, సౌఖ్యసంగతి సమయంబు♦జరుపుచుండె.

భవు సేవించు భవానిఁ గొల్చు హరునిం ♦ భాషించు శీతాద్రి సం
భవఁ గీర్తించుఁ దలంచుఁ బంచవదనున్ ♦ భావించు దాక్షాయణిన్

1 టక (మూలము.)

భువనం బంతయుఁ దత్స్వరూప మనుచున్ ◆ బుద్ధి న్విచారించు న
య్యవనీ నాథ శిఖావతంసము తదే ◆ కాయత్త చిత్తంబునన్.

చ. అతఁ డతను ప్రతాప తప ◆ నాతప ధూత పరాంధకార సం
హతి యగుచున్ బరంగ కిర ◆ ణావళి సోఁకను జేలయెల్ల న
ప్రతిహత ధర్మ శీలఁ బరి ◆ పాలన సేయుచుఁ బార్వతీ మనః
పతి యతి నిశ్చలంబగు కృ ◆ పా విభవంబునఁ గొన్ని నాళ్లకున్.

గీ. సుతులనతుల ప్రతాప వి ◆ శ్రుతుల శాస్త్ర, పటులఁ గీర్తిరమానివా ◆ సములఁ గాంచి
కన్య కాపత్యమునకు నా ◆ కాంక్షఁ గన్న, మనసుతోఁ గొంత సమయంబు ◆ చనినయంత.

చ. వనరుహ వాసినిన్ గలశ ◆ వారిధి గాంచిన రీతి లోక పా
వన చరితన్ భవాని హిమ ◆ వంతుఁడు గన్న తెఱంగునన్ మహీ
జన హృదయాను రంజన వి ◆ శారద ధర్మ గుణాఢ్యుఁ డైన యా
ఘనుఁ డొక కన్యఁ గాంచె గుణ ◆ గౌరవ ధన్య ను దార వైఖరిన్.

క. తనయా జననము విని యం, త నయానయ శాలి సమ్మ ◆ ద పయోరాశిన్
మును దేలి శాస్త్ర పద్ధతి, దనరన్ గృత వాహినీ కృ ◆ త స్నానుండై.

క. హేమంబులు బహు ధాన్య, గ్రామంబులు సఫలతరు ని ◆ కాయ సమగ్రా
రామంబులు సుందర తర, ధామంబులు విప్రతతికి ◆ దానముఁ జేసెన్.

చ. అనయము భోగి గర్వ పరి ◆ హార మహా విభవాప్తి నొక్క చో
నొనరిన యీశ శేఖరత ◆ నొండొక చోఁ గని యుబ్బుఁ డయ్యె న
య్యనుపమ దాత యిద్దరు మ ◆ హా ద్విజరాజుల కింతె గాక త
ద్ఘన కనకోత్కరం బపుడు ◆ గాంచని సద్విజుఁ డొండుఁ గల్గెషిన్.

చ. తడయ కతండు నిందు ప్రమ ◆ దంబున బంధుల నెల్లవారలన్
విడిచియుఁ గీర్తిచేఁ బరిధ ◆ వించి ప్రతాపమునన్ జయించి యే
ర్పడఁ బరివేష పాశముల ◆ బద్ధులఁ జేసిన రాజహంసలన్
విడువఁగ నేరఁ డయ్యె నతి ◆ విస్మయ మయ్యెడి నెంచిచూచినన్.

ఉ. అంతట వంతసం బమర ◆ నానరనాయక చక్రవర్తి కా
ర్తాంతిక రాజిఁ బిల్చి తన ◆ యా జన నావసరంబు నందు న,
త్యంత శుభాను భగ్రహ స ◆ మాజములం బరికించి తద్బలం
బంతయు నేర్పరింపుఁ డన ◆ నందొక భూమి సుపర్వుఁ డిట్లనున్.





సీ. తుహినాచలాధీశ ◆ దుహిత చందమున నీ, తొయ్యలి గాంచు నై ◆ ఁషతినంబు
శద్మాయుతాత్ముని ◆ భామినీతిని, బద్మాక్షిగను మహా ◆ భాగ్య మహిమ
చతురాస్యు వదన సం ◆ గతి లీల నీబాల, భాసిల్లు మృగుల వా ◆ క్పాటవమున
సర్వమాన్యంబు నృపా ◆ చార్య నీకరణి ని, త్యాలంది శైలాఖ్యందు సా ◆ ధ్వి గుణమున
నదితి వైఖరి నీహరి ◆ ణాయతాక్షి, పొందు నందనలాభ సా ◆ నంద లీల
బాల వాగ్విస్తరంబేల ◆ చర్చ సేయ, సకల గుణధన్య నీకన్య ◆ జనవరేణ్యా.

ఉ. పదివే ల్వర్షము లీతలోదరి నిజ ◆ ప్రాణేశుతోఁ గూడి స
మ్మదలీలం సుఖయించుఁ గాంచు సుతులం ◆ మత్తారి గర్వోదయ
చ్ఛిదురో దార భుజా విలాస యుతులన్ ◆ సేవించు నశ్రాంతమున్
మదనారాతి సమా సమేతముగ శ ◆ మ్యగ్భక్తి మార్గంబునన్.

క. అను నవ్విప్రుని వాక్యము, లను మోద పయోధి దేలి ◆ యాలింపుచు న
జ్జననేత పారితోషక, ధన మతని కిచ్చె నత్య ◆ దారత వెలయన్.

చ. ఉరువడి నంత భూమిసురుఁ ◆ డొక్కరుఁ ◆ డేమొగమోట లేక ని
ష్ఠుర మని తత్సభాసదులు ◆ శ్రోత్ర పుటంబులు మూయుచుండ నో
నరవర నీతనూజ పదు ◆ నాల్గవ యేఁటను భర్తృహీనయై
నిరుపమ దుఃఖ మొందునని ◆ నిక్కముగా వచియించె నయ్యెడన్.

చ. అరుదుగ నద్ధరామరుఁ డు ◆ దగ్ర కళాధరుఁ డాడినట్టి యా
ప్పరుసని మాట కర్ణముల ◆ పద్ధతి సోఁగి మనోరవిందమున్
జొరకని నొంపఁ జెంపఁగయు ◆ సోమకళాధరు చిత్తవృత్తి యే
కరణి మెలంగు నట్టిదయ ◆ కాఁగలదంచు నచంచలాత్ముఁడై.

గీ. తన తనూజాత కంత న ◆ ద్ధరణి నేత, జాతకర్మంబు గావించె ◆ జాత హృదయ
సర్వ సకల ధరిత్రీ సు ◆ పర్వ జాత, రచిత పుణ్యాహ ఘోష పూ ◆ ర్వకము గాఁగ.

క. సామంత లోక మకుఁటా, ధీమంతుఁడు పదునొకండు ◆ దినములు చన నా
సీమంతినీ లలామకు, సీమంతిని యను సమాఖ్యఁ ◆ జేసెం బ్రీతిన్.

గీ. చెలు వలరఁ బద్మరాగంపు ◆ మొలక లీలఁ, గాంతి జెలువొందు రాకేందు ◆ కళవిధమున
నవ్యతర చూత లతరీతి ◆ నర వరేణ్యా, కన్య నానాఁటి కభివృద్ధి ◆ గాంచు చుండె.

ఉ. నిద్దపు టందమంద ధర ◆ ణిం జరణంబులు మోపు నప్పుడున్
ముద్దుల మాట లాడుదను ◆ మోహ విలాసము చూపు నప్పుడున్

బ్రొద్దొక వింతగాఁ జెలుల ♦ పొందులకున్ దిలకించు నప్పుడున్
ముద్దియ తల్లిదండ్రులఁ బ్రి ♦ మోద భరంబునఁ దేల్చె నెంతయున్.

ఉ. బొమ్మల పెండ్లి సేయుచును ♦ 1 బోధ యొనర్చుచు ముద్దు చిల్కలన్
గొమ్మల తోడఁ గూడి ప్రతి ♦ గొమ్మల యిమ్ముల డోలికా విహా
రమ్ములఁ గేలి శైల నిక ♦ రమ్ములఁ బద్మ సరోవరంబులన్
సమ్మద లీలచే జరపె ♦ శైశవ మానృప కన్య యంతటన్.

క. సరస రసాల వల్లిక వ ♦ సంత సమాగమ మైనలీల భా
స్వర సరసీ సరోజనికి ♦ శారద సంగతి గల్గు వైఖరిఁ జా
నిరుపమ చంచలా లతకు ♦ నీరద వేళ లభించినట్లు సా
హరిణ విలోచనా మణికి ♦ యౌవన మించుక యంకురించినన్.

గీ. చూపులకునంత నొకవింత ♦ చూపు లమరెఁ, జెక్కులకు నంత నొకవింత ♦ జిగి దనర్చె
మొగమునకు నంత నొకవింత ♦ మురువు దోఁచెఁ, దల్పులకునంత నొకవింత ♦ దారి గల్గె

చ. పతి పతి యన్న మాట విని ♦ ఝల్లున నుల్లము నందుఁ జిత్రదం
పతుల విచిత్ర కేళి పలు ♦ మారుఁ గనుంగొను నేకతంబునన్
రతికథ లెవ్వరే నుడువ ♦ రాగమున న్విను మానసాంతర
స్థితి గల కాముఁ డేమి యుప ♦ దేశ మొనర్చెనో నీలవేణికిన్.

గీ. కతలఁ గన్యా నికాయముల్ ♦ కౌతుకాప్తి, కతల భావ రహస్యముల్ ♦ కనినయట్టి
మారు మాటలు పలుకంగ ♦ మనసు గరఁగె, మారు మాటలు పలుక దా ♦ మంజువాణి.

చ. ప్రతి దివసంబునం దిమిర ♦ భార మణంగఁగఁ జంద్రికోత్కరం
బతిశయమంద నందమగు ♦ నాదిమ పక్షముతోటి సాటియై
ప్రతి దివసంబు శైశవము ♦ భారము దూరము గాఁగ నవ్వనం
బతిశయ మంద మంద గమ ♦ నాంగ విలాసము మీఱె నెంతయున్.

సీ. మగతుమ్మెదల యంద ♦ మగు కుంతలము లంత, నలిక భాగముఁ గొంత ♦ యాక్రమించె
మృగ శాబకుల తీరు ♦ మీఱు వాల్జూపులు, కర్ణాంతికము గొంత ♦ గడియఁ జేరెఁ
దమ్మి మొగ్గల కెగ్గుఁ ♦ దలఁచు తేజను దోయి, యురమునకొక వింత ♦ మురువు దెల్పెఁ
వరుణ సైకతపు సౌం ♦ దర్య మందు పిరుందు, గౌరవంబునఁ గొంత ♦ గాన నయ్యెఁ
వీఁడ యొక కొంత మదిలోన ♦ విస్తరిల్లె, మదనుఁ డొకకొంత తనగుట్టు ♦ మతము దెల్పె
శైశవముగొంత పడలియ ♦ చంద్రముఖికి, యౌవనము గొంత సముదితం ♦ బైనయంత

---

1 భోలియు (వ్రూలము)

## సీమంతినీకళ్యాణము.

క. అల నలరాజ రాజసుతతి ♦ తానన మానస సీమఁ జెందఁగా
నలి గుణమంతఁ గుంతల స ♦ మాశ్రయ మందెను జిల్కుటెక్కుడున్
నెలకొని ముద్దు బల్కులను ♦ నిల్చెను మీనవు డాలి కన్నులన్
[illegible]యు నిజేశు చేరెఁ ద ♦ దీయము లిల్చుట యుక్తమే కదా.
నిగనిగ లీను మానవతి ♦ నీలకచంబను కైతవంబుచే
జిగిఁ దగు నీలరత్నములఁ ♦ జేకొని లోక నికాయ మోహకం
దగు మదనుండు తా యువ స ♦ మాజపు డెందపు కమ్మి యుంచుచున్
దిగుల నుపక్రమించె నన ♦ దీర్ఘము లయ్యెను నాఁడు నాఁటికిన్.

ఉ. శ్రీగల నీలహారము న ♦ జేతపమాఖ్య వహించి యైన నా
భోగము నాసుభోగ్నతియుఁ ♦ బొందఁగ లేక యనేక భూమిభృ
ద్భాగము నందు నేగెఁ ద ♦ వం బొనరించెనో యెంచి చూడ నా
భోగము నాఘనోన్నతియుఁ ♦ బొందెను దత్కబరీ భరాకృతిన్.

సీ. ఉవిద కబరీ భరంబు ప♦యోధరంబు, డంబు నిరసించుటకుఁ గౌతు♦కం బొనర్పఁ
జారు సీమంతి[1]నిముఖ సిం♦దూర రేఖ, మించుతోఁ గలహించఁగా ♦మించుటయు గా.

ఉ. శంబర దాన వాగ్గలము ♦ సల్పితి నింకఁ బ్రసూన కాండ యో
గంబును జంచరీక గణ ♦ గర్వముఁ గన్న జగద్వి మోహక
త్వంబు లభించు నంచు జల ♦ దం [2]బట నంబుజనేత్రి కేశపా
శంబున నిల్చి కాంచె నని ♦ శంబును దాదృశ లక్షణంబులన్.

ఉ. చందన గంధి ఫాల మట ♦ చందురు చందము కన్నఁ గన్న హె
చ్చందురు కందు లేమి యని ♦ యాశశి నంటు మృగంబు కస్తురిన్
బొందఁగఁ గాంచి యానెలఁత ♦ బొట్టు ధరింపఁగఁ జేసి సామ్యపుం
జందము కూర్చు రాజనయ ♦ శంబు సహింతురె యెందు జాత్రితుల్.

చ. రతికడకున్ మనోభవుఁడు ♦ రాగము మీఱఁగ వ్రాసినట్టి య
ప్రతిమపు లేఖ కాంచనపుఁ ♦ బట్టము ఫాలము రెండు వంకలన్
వితతము లైన శ్రీలు చెలి ♦ వీనులు వక్రత లేటి కంటిమా
ఘతుల మనంబు లిట్టివను ♦ సన్నుతు లైన పరికార మయ్యెడిన్.

ఉ. నీలపు జాలచేత రతి ♦ నేత శరాస యుగం బొనర్పఁగాఁ
జాలఁడు చాలినన్ వికచ ♦ సారస పత్రి యుగంబు నిద్దపుం

---

1 సీమార్గ (మూలము). 2 దంబుజనేత్రి (మూలము)

గోలలు దాని నడ్డముగఁ ♦ గూర్చి జగంబుల గెల్వ నేఁడే
పోలిక గల్గు కాంత కను ♦ బొమ్మలకున్ సరిగన్న దోయికిన్.

గీ. తెలుపు నలుపుల కిల మేర♦పాలము లనుచు, నలువ నలువొప్పఁ గూర్చిన♦ వాతికన్ను
గవకు నెవ్వొక యుపమాన♦కల్పనంబు, కవివరుల కెల్ల నధిక దు♦ష్కరము గాదె.

చ. నలిన దళాక్షి చెల్వ మగు ♦ నాసను బోల్పఁగ నాస మాని నేఁ
డలఁతిఁ దదీయ తారకల ♦ తౌల్యముఁ గాంచితి మంచుఁ గ్రొవ్వునం
జెలియ రటంచుఁ జంపకము ♦ తేఁటులపై వగ పూనెఁ గాక యే
కలనను నూహ చేసినను ♦ వైరపు హేతువు వేఱె యున్నదే.

గీ. కాంత వదనారవిందంబు♦ చెంత రాజ, బింబ మంత యనధరీకృ♦తంబు గాఁగ
బింబ మచ్చోట నధరీకృ♦తంబటన్న, నెంత వైచిత్ర్య మయ్యది ♦ యెంచి చూడ.

ఉ. కెంపు సృజించె ధాత మునుఁ ♦ గెంపు జనింపఁగ దానిచేఁ బ్రవా
ళింపఁగఁ గెంపు మార్దవము ♦ దేరఁగ బింబముఁ జేసె దాన నం
దింపక కెంపు మార్దవము ♦ తీరు సుధారసమున్ జనింపఁగా
నింపగు కాంత మోవి సృజి ♦ యించి భజించె నతిప్రమోదమున్.

చ. జగముల గెల్చు నమ్మదను ♦ శాసన వర్ణ సువర్ణ పత్రికా
యుగళ మె కాల చెక్కులని ♦ యూహ యొనర్చెదఁ గాక యున్నచో
మృగమద పత్ర కైతవ న ♦ మేల వరేణ్య విలాస ముబ్బరం
బుగ ధరియించి తద్బిరుదు ♦ ముద్రిక లెంటికిఁ గందు గల్గెడిన్.

చ. ఒకతతి యందుఁ గృష్ణ గుణ ♦ యోగమునం దగు నెల్ల మల్లికా
ముకుళ కులంబు ముత్తెముల ♦ మొత్తములన్ విషయోదయంబులౌ
సుకవి నికాయ మెన్న నతి ♦ శుభ్రము లై పసురీతి నున్న యా
వకియ మనోజ్ఞ దంతముల ♦ సాటికి నేమి ఘటిల్లఁ జాలెడిన్.

గీ. సద్విజత్వంబు మొదలకె♦ సంగ్రహించి, కావి తెలువొప్ప పైకప్పు♦ గాంచి యతివి
కాసము ధరించి మీఱెడు♦ కాంత రదము, లరయ ముక్తాభిరాముంబు♦ లౌటయరుదె

ఉ. అంబుజ నేత్ర నున్నలుతు ♦ లందు మృదుత్వము పూనఁ గోరి కీ
రంబు తదీయ మైన యధ♦రం బది బింబము గాఁగ నెంచి స
త్యంబుగఁ దత్సమాగమ కృ ♦ తంబగు మేలని నిశ్చయించెనో
బింబము నెంచుఁ గన్నఁ గదెఁ ♦ జేరిమ ఘటించు నిజాననంబునన్.

మొనసి నానాసుఖంబుల ♦ మొరసి రైన, దరము కలకంఠి కంత సౌం♦దర్యమునకు
గాక సుడిగొని సకల లో♦కంబు తెఱఁగ, నవిరతంబు వనాశ్రయం♦బయ్యెఁగాక

ఉ. చంద్రుఁడు వైరియై మిన్నుల ♦ జాలి యొనర్పఁగఁ జిక్కి జక్కవల్
చంద్రవి వితంద్ర లీల నగఁ ♦ జాలిన మేలి నవీన కాంతియున్
జంద్రవి సమాగమంబు తరి ♦ సార విలాసము గల్గఁగోరి యా
చంద్రముఖీ కుచాకృతిని ♦ జన్మము నొందిన వెంచి చూచినన్.

సీ. కల్ప లతలో తలోదరి ♦ ఘన విలాస, కల్పకా నల్ప మదన సం♦కల్ప లతలో
యను చుసందేహమందుదు ♦రనుదినంబు, తన్నె మృదు బాహువల్లరుల్ ♦ గన్న జనులు

ఉ. ఆకలవాణి పాణి లలి ♦ తాకృతి దా యువ ధైర్య చర్యఁ జీ
కా కొనరింపఁగా నెఱఁగి ♦ కాయజుఁ డిట్టిది గల్గ లోకముల్
చైకొని గెల్వవచ్చు నని ♦ పల్లవ మల్లుగఁ బూనెఁ గాని చో
నాకులచేఁ గటారుల ని ♦ రాకులతం ధరించుతు తే దొరల్.

ఉ. శ్రీరమణీకుమారుఁడు వ్రి ♦ సిద్ధపు బాణము లేదు గాక వె
న్నారఁగ భామ రోమలత ♦ యన్న వినీల భుజంగ బాణమున్
వేరె సృజించి యున్నటిగ ♦ ణించు తరిం దరి నున్న దానితో
నారని పల్కఁగాఁ గలిగె ♦ నారను నామము దాని కెప్పుడున్.

ఉ. ఆనలినాయతేక్షణ కు ♦ చాచలదుర్గము లాక్రమింపఁగాఁ
బూని ప్రసూన బాణుఁ డను ♦ భూపతి రాఁగలఁ డంచుఁ గొశల
శ్రీ నెరయంగ యౌవనపు ♦ శిల్పి రచించిన కాంచనంపు సో
పానములో యనన్ వళులు ♦ భామినికిం గన నయ్యె నయ్యెడన్.

చ. కరివర కుంభ జృంభణముఁ ♦ గాదను చన్గవ భారమయ్యె నె
వ్వరుఁ గనలేని కల్మి కని ♦ వారిత సూచక మయ్యె నొంప నే
వెరవును లేక కౌను కుఖ ♦ వృత్తియె కాంచె వివేకరీతిచే
నరయఁ బరాపకారములు ♦ హార్యనువర్తుల నంట నేర్చునే.

చ. సరసిజ నాభి శైల గుహఁ ♦ జక్కనిరీతి సృజించి చూచి సుం
దరి యని యంత నవ్వనిత ♦ నాభిబిలంబు సృజించి దీనితోఁ
దరమని పల్కినం దరము ♦ దానికి సంధిలఁ బూర్వ వర్ణముం
దతలఁగఁ జేసి చేసె నట ♦ తథ్యముగా దరి యన్న నామమున్.

ఉ. తరల విలోచనా గురుని ♦ తంబ మిషంబున నొక్క చక్రమున్
మఱఁ దమరించి రెండవ స ♦ మానపు చక్రము ముజ్జగంబునం
దరసిన లేమి మంచి రథ ♦ మందక చందన శైల మారుతం
బరదముగాఁగఁ గొందఱు మ ♦ హాత్ములఁ గెల్వఁగ నేరఁ డేమియున్.

ఆ.వె. రమణి యూరు యుగమె ♦ రంభా విలాసంబు, నపహసింపుచుండ ♦ నన్యదేహ
సౌష్ఠవంబు చేత ♦ సకలాప్సరో గర్వ, హారియగుట కేమి ♦ యబ్బురంబు.

గీ. కాంత జంఘలు మరు నిషం♦గంబు లౌనొ, కావొ యను సంశయపుకళం♦కంబదేల
యంఘ్రితల కైతవమున దృ♦శ్యంబులైన, కమలబాణంబులవి నూద♦కములుగావె.

చ. సలలిత హేమకాంతియును ♦ జాల మృదుత్వముఁ బూని నట్టి యా
దళదరవింద నేత్రి ప్రప ♦ దంబులతో సరియౌనె యెప్పుడున్
మలినపు ఛాయ డాయఁగతి ♦ సత్వము గల్గిన బర్బరాంగముల్
గలిగి వనాంతరంబులనె ♦ కన్పడు కూర్మము లెంచి చూచినన్.

చ. అనుపమరాగమున్ జిప్రుప ♦ లంద యమంద మృదుత్వ వైభవం
బనయము మెట్టతామరల ♦ యంద సృజించితి రెండు నొక్కచోఁ
దనరిన లెస్సయౌననుచుఁ ♦ దామరసోద్భవుఁ డూహ చేసి యా
వ్వనరుహ పత్ర నేత్రి పద ♦ వారిజముల్ సృజియించెఁ జక్కఁగన్.

గీ. అవ్వనిత యివ్విధంబున♦జవ్వనంబు, నివ్వటిలఁ బువ్వ విలుకాని♦నిశిత శరము
భాతిఁ జెలు వొందుచుండె న♦ప్రతిమ రీతిఁ, దల్లిదండ్రుల కానంద♦దాయి యగుచు

చ. జలరుహ నేత్రి యంతఁ దన ♦ జన్మపు వేళ ప్రసంగ మంతయున్
జెలులు రహస్య రీతిని వ ♦ చింపఁ గరంగి మనంబు లోపలన్
గలఁక వహించి యెవ్వరికిఁ ♦ గన్పడకుండని దారుణాంతర
జ్వలననిభా సమేత నవ ♦ జాత శమీ తరుశాఖవైఖరిన్.

గీ. కలికి భవితవ్య చింతచేఁ♦గలఁక నుండి, యైనఁ బ్రాచీన వాస నా ♦ ధీనయగుచు
సత్యధర్మదయాధిక♦సద్గుణములఁ, బరఁగి యొకకొంత సమయంబు ♦ జరపునంత

శా. బాణారాతి నిశాంతభాసి దళిత ♦ ప్రవ్యక్త దోస్సర్వ గీ
ర్వాణారి త్రిపుర ప్రకాండ సకల ♦ ప్రాచీన వాచా శిర
శ్శ్రేణీమృగ్య నిజస్వరూప సదరా ♦ జీవ ద్వయీ సంశ్రిత
త్రాణానూన దయాధురీణ ఘనసం ♦ ధ్యా నాట్య లీలాచణా.

1 రోమరా (మూలము)

క. నానాచేతన సముదయ, మానస మాలాభివాస ♦ మానిత్త స
త్యానందరూప గజముఖ, సేనానీ ముఖ కుమార ♦ సేవిత చరణా.

మాలిని. మకుట నిహిత గంగా ♦ మాని చేతోబ్జ భృంగా
ప్రకటన వృష తురంగా ♦ పాణి దంచత్కురంగా
సకల శుభ మయాంగా ♦ చంద్ర ఖండోత్తమాంగా
సకరుణ సదపాంగా ♦ శైలజా నిత్యసంగా.

గద్య—ఇతి శ్రీశైల నివాస భ్రమరాంబా సమేత మల్లేశ్వరస్వామి కృపాపాత్ర
భారద్వాజ గోత్ర పవిత్ర పెనుమళ్ల సోమమంత్రి పౌత్ర పెద
నీల ప్రధానపుత్ర సకల సుకవి స్తుత్య సోమనామాత్య
ప్రణీతంబైన సీమంతినీకళ్యాణం బనుమహా
ప్రబంధంబునందు ప్రథమాశ్వాసము
ఏతత్సర్వం శ్రీ సదాశివబ్రహ్మార్పణమస్తు.

శుభమస్తు.

అవిఘ్నమస్తు.

శ్రీసదాశివాయనమః.

# సీమంతినీకళ్యాణము:

## ద్వితీయాశ్వాసము.

శ్రీశాదిదేవ నికర న్త, దాశాస్య విహార సుంద ♦ రాకార యుత
శ్రీశైల నిలయ, భ్రమరాం, బా శాశ్వత యోగ ముదిత ♦ భవ మల్లేశా.

క. అవధరింపుము

సీ. పలితంపు జిగి కొంత ♦ గల కుంతలపు గాంతి, గాంగ యామున సమా ♦ గమము దెల్ప
భసిత పుండ్రము(తోడి)మిసిమి ♦ కుంకుమ రేఖ, నెలతునక్రై సంజ ♦ చెలువుగూర్ప
రుచిమీఱు కుచపాళి ♦ రుద్రాక్ష మాలికల్, సుమ గుచ్ఛ గతమిళిం ♦ దములఁ దెగడ
పలుఁద చందుర కావి ♦ వలువతో నెమ్మేను, చిగురు 1 పయిండితోఁ ♦ జెలిమి సేయ
మహిత పంచాక్షరీమంత్ర ♦ మధుర సూక్తి, విని వినీతతఁ గోయిలల్ ♦ వెనుకొనంగ
వచ్చె నొకసాఁడు భాగ్యదే ♦ వతయనో లె, యాజ్ఞవల్క్యనిసతియమ్మ ♦ గాక్షిఁగనఁగ.

. మానివరకాంత వంత న ♦ మ్మానవేంద్ర, తనయ తనయాత్మలోఁ బ్రమో ♦ దంబుదవుల
దవులనే కాంచి పులకాంచి ♦ తంబులైన, గల్లముల మంద హాసితంబు ♦ పల్లవింప.

. తొదుర చనితత్పదంబులు ♦ సుదురుసోఁక, మ్రొక్కినకంజనయన స ♦ మ్మోదమమర
వనజభవ పాణి రచిత దు ♦ ర్వర్ణ పంక్తిఁ, దుడువఁగడు వాంఛఁగనురీతి ♦ దోఁపనపుడు

. పదనఖ చంద్ర రాజియెడ ♦ బాల నవేందుఁడు పొందు 2 సేయఁగా
వదన సుధాకరుండు పద ♦ వారిరుహంబులతోఁ జెనంగఁ బో!
యిదియును సంశయంబు జని ♦ యించెను జూపఱ కెల్ల మాని రా
న్మదగజయాన కాన్నృపతి ♦ నందన వందన మాచరింపఁగన్.

---

1 పెండిలి (మూలము) 2 (జీర్ణమూలము)

క. అంత[1]ట నయ్యుశిశోపల దంతల ముని కాంతఁ దోడు కొని చనియె మణీ
సంతాన కాంతి ఖచిత రి, శాంతర దీప్తి నిజ గృహాంతరమునకున్.

గీ. అర్ఘ్య మర్పించి సంచితా నర్ఘ్యనియతిఁ, బాద్యమిడియెనుబుణ్య సంపాద్యమనుచు
నా దరోపమ కంఠి యత్యాదరంబు, దారి వెలయంగ నా జడదారి చెలికి.

ఉ. ఆరయ మున్ను నీరజ శుభాకృతిఁ గన్న తదంఘ్రి యుగ్మమున్
నీరజ మాటకుం గడిగె నేరుపు మీఱ మృగాక్షి యాత్మ హృ
న్నీరజ మవ్విధంబునను నీరజ మాటకు వోలె నేమొ యం
భోరుహ లోచనల్ మిగుల ముగ్ధలుగా! పరికించి చూచినన్.

గీ. చంద్రముఖి యాచమించెఁ దచ్చరణ కంజ, వారి దుర్వార దురితని వారియనుచు
నదియె మదియందు నిందుచూడాంఘ్రి భక్తి, వల్లి యెడ నాలవాలంపు వారియయ్యె

ఉ. అంతట యాజ్ఞవల్క్యుని యంగనకుం గనకాసనంబు ది
క్కాంతములందు దంతరుచి పంక్తి నటింపఁగఁ దెచ్చియిచ్చి హృ
చ్చింతనితాంతముం దొలఁగఁ జేరిక యందు తదాజ్ఞచేత నా
కాంత వసించెఁ గాంత శశికాంత శిలా రచితాసనంబునన్.

గీ. అంత నయ్యింతి ముకుళిత హస్తయగుచు, వినయ మమరంగ నాతపస్వినికనితోఁ
తద్వదన చంద్ర బింబంబు దారసిల్లి, చారు నేత్ర చకోరముల్ సంతసిలఁగ

గీ. భాగ్య దేవత వచ్చె మా భవనమునకు, నిందిర ప్రవేశ మయ్యె మా మందిరంబు
నెల్ల కళ్యాణ వితతి మా యిల్లుఁ జేరెఁ, బద్మలోచన నీస్వరూపంబు చేత.

క. ఊరక పతివ్రతా మణు, లారయ నెవ్వారి యిండ్లకరు దెంతురు త
ద్భూరితర పుణ్య లీలా, గౌరవ పరిపాక సూచకం బది కాదే.

గీ. అనినఁ జిరునవ్వు వదన చంద్రాంతరాళ, చంద్రికల తోడఁ బెనఁగన జ్జలజగంధి
రాజ కన్యకతోఁ గృపార్ణవ తరంగి, తాంతరంగంబు వెలయ నిట్లనుచుఁ బలికె.

గీ. రామ నీకెల్ల యెడల నిరామయంబె, తల్లిదండ్రులు సౌఖ్య సంతానయుతులె
యాత్మ సఖులకుఁ గల్యాణమతిశయంబె, బాంధవుల కెల్ల భద్రంబె పద్మగంధి.

చ. కలికి నిజాన్వయంబు వెలుఁగంగ జనియించిన యట్టి రత్నపుం
గలికవు తల్లిదండ్రులకుఁ గాంతు యొసంగెడు కల్ప వృక్షపు
న్మొలకవు తావకీన గుణముల్ విని నిన్నుఁ గనుంగొనంగ ను
త్కలిక వహించి వచ్చితి నకారణ మైత్రి విలోల లోచనా.

---

1 (జీర్ణమూలము.)

గీ. ప్రాణి తోడనె కూడ సం♦భవము జెందుఁ, గాని సద్గుణ మొకచోట♦ గల్గి రాదు
పువ్వు జనియించు వేళనే♦ పుట్టుఁ గాని, పట్టి యొకచోటఁ దెచ్చిరే♦ పరిమళంబు.

గీ. అంబుజదళాక్షి నీకు బా♦ల్యంబు గాని, నీగుణోన్నతి పెద్దయా♦ నిర్ణయింప
నమృతకర రేఖ కధిక బా♦ల్యంబు గాని, తద్విలాసంబునకుఁ బెద్ద♦తనము గాదె.

క. గుణధన్య కన్య చేతం, గుణధన్య కుమారు చేతఁ ♦ గులము వెలుంగున్
గుణహీన కన్యచేతం, గుణహీన కుమారు చేతఁ ♦ గులము నశించున్.

ఉ. ఎందఱు గల్గిరేమి సుతు♦ లెవ్వరి యందు గుణంబు గల్గు నా
నందనుచేత నన్వయమ♦ నంత సమృద్ధి వహింపఁ గల్గెడున్
జందురుఁ గాంచి సంద్ర మతి♦ సాంద్ర సమృద్ధి వహించెఁ గాక పూ
ర్ణేందు నిభాస్య యందు జని♦యింపవె కర్కట కూర్మ మీనముల్.

చ. అనవుడు రాజకన్యక ద♦యామతి యో మహనీయసాధ్వి దు
ర్జన చరితంబు సజ్జనుల♦ చందము ధర్మపు రీతి ధర్మ వ
ర్తనమును దుష్కృతంబు సుకృ♦తం బన నెట్టిది విస్తరంబుచే
వినఁగఁ గుతూహలంబు ప్రభ♦వించె మదిం దయ సేయఁగాఁ దగున్.

. ఆనిమమునినాథుకాంతయ♦య్యవనికాంత, తనయవినయంబునకుఁ బ్రమో♦దము వహించి
యమృత పూరంబు రీతిఁ గ♦ర్ణములుఁ దనుపు, ననుపమానమృదూక్తి ని♦ట్లనుచుఁ బలికె.

. పలుకుదు జేయు మేలు మదిఁ♦ బట్టఁ డొకించుక తుచ్ఛకైననున్
గలహ మొనర్చుఁ బేర్చు నధి♦కంబుగ నొక్కొక వేళ గెల్చినం
జెలఁగుదు నవ్వ నోటమికి♦ సిగ్గు వహింపఁడ యిట్టి దుర్జనుం
దలఁచిన వచ్చుఁ బాతకము♦ తామరసప్రతిమాన లోచనా.

. కోపము వాని సొమ్ము ఘనుఁ♦ గొంచెము సేయుట వాని విద్య చూ
పోపమి వాని వృత్తి పరు♦ షోక్తియె వాని గుణంబు సాధు సం
తాపము వాని సంతసము♦ దంభము వానికి గన్నతల్లి యా
పాపపు దుర్జనుం దలఁచు♦ పాపము వాయు నుపాయ మున్నదే.

పరధనము కన్న రుచియైన♦ భక్ష్య మేది, సూచకుని కన్న ననువైన♦ చుట్టమేఁడి
సాధు జనబాధ కన్న ను♦త్సాహ మేది, దుష్ట జనునకు నెన్నంగఁ♦ దోయజాక్షి.
చకిత సారంగ నయన దు♦ర్జనుల లోనఁ, గృత మెఱుఁగని హీనుఁ డ♦గ్రేసరుండు
వానితోఁ బొందుకన్న[1] శు♦భమ్ము సువ్వె, సారమేయంబుతోఁ బొందు♦ జగతి యందు.

1 సుపవము (మూలము)

సీ. తన కార్యమునకు నర్థంబొసఁగిన వాని, కలధనంబు హరింపఁ గాఁ దలంచు
దన శత్రుతోడ గాఁతిర మొనర్చిన వాని, శత్రుతో నతిమైత్రి సంఘటించుఁ
దన సర్వదిశలఁ గీర్తన మొనర్చిన వాని, చరిత మెల్లెడల దూషణము సేయుఁ
దన ప్రాణభయ నివర్తన మొనర్చినవానిఁ, దవిలి హింసింపఁగాఁ దలఁచుచుండు
దన సమృద్ధికి మిత్రుల సంతసము నందు, వాని యభివృద్ధిఁ గని యాత్మ వనటనొందు
వనజ నయన కృతఘ్నుండు వానితోడ, నీడయిన యట్టి దుర్జనుం డెందుఁ గలఁడు

ఆ.వె. పరుని సద్గుణంబు పరమాణువుగఁ జూచు, దొడ్డకొండ సేయు దుర్గుణంబు
నాత్మ వినుతియందు నత్యంత రసికుండు, దుర్జనుండు వికచ తోయజాక్షి.

గీ. తనకు మేలొనరించు బాంధవున కైనఁ, దోడనే కీడు చింతించు దుర్జనుండు
తనకుఁ గీడొనరించు శాత్రవున కైనఁ, జాల మేలు విచారించు సజ్జనుండు.

ఉ. కారణ మేమిలేక యప కారము సేయు దురాత్ము పోలికన్
గారణ మేమిలేక యుప కారము సేయు మహాత్ముఁ డెంతయున్
గారణ మేమిగల్గె శిఖి కానన మంతయు నీరు సేయఁగాఁ
గారణ మేమిగల్గె శశి కైరవముల్ వికసింపఁ జేయఁగన్.

గీ. దుర్జనుని కల్మి దురితప్రోవ యగును, సజ్జనుని కల్మి పుణ్యంపు సరణి యగును
పాము బలసిన గరళంబు ప్రబల మగును, గోవు బలసిన దుగ్ధంబుఁ గురియుచుండు

ఉ. వైకొని దుర్జనుండు కడు బాంధవ మందు దురాత్ముతోడనే
కైకొని సజ్జనుండు చెలి కార మొనర్చు మహాత్ముతోడనే
ఘూకము లంధకారమునఁ గూడి చెలంగవొ చక్రవాకముల్
లోక విలోచనంబు దమ లో విమలోన్నతి మైత్రి బూనవా.

ఉ. క్రూరుఁడు సభ్యునందు గుణ కోటులు గల్గిన వాని నీర్ష్యచే
వైరము సేయుఁ గాక శుభ వర్తన మేగతిఁ బూను నట్లయాఁ
గీరము ముద్దు బల్కులకుఁ గిన్క వహింపుచు నుండుఁ గాని మా
ర్జారము చిత్త మెంతయును సమ్మద వృత్తి వహింప నేర్చునే.

చ. ఘనుఁడగు వానితోడఁ జెలి కారము సేయుచు నున్నఁ గాని దు
ర్జనుఁ డనయంబు నుండిన ని సర్గము మానునె యాలమందలో
శునకము ధేనువత్సముల చోటనె మాటికి సంచరించినన్
దన సహజ ప్రకార మను దానికిఁ బోనక యుండఁ జెల్లునే.

సీ. తనచరిత్రమశేష ధర్మసందేహ(ల), తారతాయతలవి త్రంబు గాఁగ
తనదర్శనంబు పా తకజాతకపటోగ్ర, దనుజమర్దనసుద ర్శనము గాఁగ
తనసంగమము దురం తవిషాదఘనభుజం, గమవిష్ణురథవిహం గమము గాఁగ
తనుసల్లాప ము త్తమపుణ్యబర్హిణ, ప్రావృడంబుదకలా పంబు గాఁగ
తనకటాక్షంబు దీనసం తాననిత్య, సకలఫలదానకల్పవృ క్షంబు గాఁగ
జనుల నలరించు నొకపుణ్య జనుఁడు గల్గ, జగతినిల్చుటయే పూర్ణ చంద్రవదన.

సీ. కామంబు కామారి కారుణ్యరూపచిం, తారత్నలాభయ త్నంబు నొంద
క్రోధంబు బోధావ రోధకరాక్షసం, తానశిక్షాసము ద్యమము నంద
లోభంబు సురలోక వైభవప్రియకారి, ఘనపుణ్యవిత్తసం గ్రహము నంద
మోహంబు యోగిసం దోహమోహనముక్తి, కాంతానితాంతసం గమము నంద
మదము చిదమేయహృదయస మ్మదము నంద, ప్రకటమాత్సర్యము గ్రహాంతకము లంద
కానివేఱొకచోటఁ జా గంగనీని, యతఁడు సజ్జనుఁ డొకఁడు ప ద్మాయతాక్షి.

క. ఏతాదృశసజ్జనసం, ఘాతముచే భూతలంబు గదలకయుండన్
వాతాశనకమఠేంద్రుల, చేతంబలె నిష్కళంక శీతాంశుముఖీ.

గీ. జగతి దుర్జనరీతి స జ్జనవిధంబు, సబలయొకకొంత వివరింప నయ్యె నీకు
ధర్మము నధర్మమును రెండు తత్త్వరీతి, నింక వివరింతు వినుము పూ ర్ణేందువదన.

క. జగతీశనిర్మితంబగు, జగతీస్థలిఁ గలుగు మనుజ జాతమునందున్
నిగమోదితమగుధర్మము, దగు నాలుగుజాతులందుఁ దామరసాక్షీ.

గీ. అవనిసురునకు యజనంబు యాజనంబు, నంచితాధ్యయనంబు న ధ్యాపనంబు
దానము ప్రతిగ్రహంబనఁ దనరనైన, యాఱు కర్మంబులగుచుఁ జె న్నారుచుండు.

గీ. అట్టి యుర్వీసురవ్రజ కాశ్రమంబు, లర్హములు నాల్గు బ్రహ్మచ ర్యము గృహస్థ
తయును వనవాసమును యతి త్వమునసంగ, వినుము తత్ప్రకారముల్ వనజగంధి.

గీ. జాతకర్మాదివిహితసం స్కారనియమ, సరణి మునుఁగాంచి యంతనా చార్యుచేత
నర్హరీతిని నుపనీతుఁ డైన యతని, కంబుజదళాక్షి బ్రహ్మచ ర్యాశ్రమంబు.

ఉ. మానవతీమతల్లి విను మా శిఖమౌంజియు బ్రహ్మసూత్రకౌ
పీనపలాశదండములు పేశలకృష్ణమృగాజినంబునున్
బూని యధోక్తవైఖరిని భూసురగేహములందు భైక్ష్యచ
ర్యానిరతుండుఁ జేసి ని [illegible]

చ. శమదమశాలియై వెలయు ♦ సద్గురువర్యుని చెంతఁ జేరి యు
త్తమసహచారులం గలసి ♦ తత్పరిచర్య యొనర్చుచోఁ బ్రమా
దములవమాత్రియుం గనక ♦ తత్పరతన్ సకలాంగయుక్తవే
దములు పఠింపఁగావలయుఁ ♦ దామరసేక్షణ బ్రహ్మచారికిన్.

క. వరవర్ణియైనవానికి, వరవర్ణినిఁ జేరిచూడ ♦ వలదు త్రిపురసం
హారు నంతటివాఁడైనను, మరుగెల్వఁగఁజాలుమాట ♦ మఱువుము తన్వీ.

క. పరిహాసభాషణంబులు, పరనిందాభాషణములు ♦ బహుభాషణముల్
పరమార్థ మూహసేసిన, సరసిజముఖి వలదు బ్రహ్మ ♦ చారికి నెప్పుడున్.

చ. వశతను మాఱి భూరిబల ♦ వంతములై తమఁదామె యెల్లెడన్
దిశలకుఁ బాఱు నింద్రియపు ♦ ద్రిమ్మరివాజుల ధీమశేముషీ
కశఁ గొనిపట్టి కొట్టి బలు ♦ గట్టివిరాగపుసొగవాగెచే
భృశగతినిల్వఁబట్టఁదగు ♦ బిట్టదలింపుచు బ్రహ్మచారికిన్.

గీ. ఎప్పుడేమి ప్రమాదమో ♦ యెఱుఁగరాము, మనసుగెల్చితిననుచు న ♦ మ్మంగరాదు
కాన గానంబుశృంగార ♦ కథలు వినుట, వటువరున కావటముగాదు ♦ వారిజాక్షి.

గీ. కళకుఁజిరుగని యశ్వంబు ♦ కరణిఁ గడిఁది, యంకుశము మీఱినట్టి ని ♦ శ్శంకగజము
మంత్రమునతిక్రమించిన ♦ మత్తఫణియుం, నేదియన్నను హృదయంబు ♦ కాదె చెలియ.

క. సాధనమొకకోటి గల్గఁగ, సాధింపఁగవచ్చు నెట్టి ♦ సాధ్యముఁ దానే
సాధనసాధ్యము లౌటను, సాధింపఁగరాదు మనము ♦ సన్మునికైనన్.

క. అటుగావునఁ గుటిలాలక, వటుఁడతిపటుధైర్యనౌక ♦ వదలక ఘనసం
కటమైన బ్రహ్మచర్యో, ద్భటవారిధి దాఁటవలయుఁ ♦ బ్రాజ్ఞులుమెచ్చన్.

ఉ. అంతట సాంగవేదని ♦ యాధ్యయనప్రియపూర్వమైనచోఁ
జింతయొకింత లేక గురు ♦ చేతననుజ్ఞవహించి యుంచిత
స్వాంతముతోడ రూపగుణ ♦ జన్మముల న్నుతిఁగన్నకన్య న
త్యంతశుభక్రియన్ బరిణ ♦ యంబగుటర్హము విప్రజాతికిన్.

గీ. అర్హదారపరిగ్రహం ♦ బాదిగాఁగ, నయిన మహనీయతరగృహ ♦ స్థాశ్రమమున
నశ్రమమున మహీసురుం ♦ డందవచ్చు, నబల ధర్మార్థకామంబు ♦ లవిరతంబు.

సీ. అధ్వగాయాసమ ♦ హాతపోజ్జృంభణం, బపహరించుటకు వ ♦ ర్షాగమంబు
సకలేంద్రియవ్రాత ♦ సౌఖ్యసుధారసా, స్వాదనంబునకు మం ♦ దరనగంబు

పితృదేవదేవతా ♦ వితతివాంఛార్థముల్, ఫలియించుటకుఁ గన్య ♦ పాదపంబు
స్వర్గాధిరోహణా ♦ నర్గళమార్గక, ల్పనకు సనల్పసో ♦ పానపంక్తి
ధర్మమున కాశ్రమంబు సం ♦ తానమునకు, పటము శాశ్వతకీర్తి కిఁ ♦ బట్టుగొమ్మ
చిత్తసంతోషజనకంబు ♦ నిగురుబోణి, యార్యజనుల సెన్నఁదగు గృహ ♦ స్థాశ్రమంబు

చ. అనుదినవేదపాఠము హు ♦ తాశనుఁ దన్పుటయున్ గృహాగతా
ర్చన పితృదేవతర్పణము ♦ సల్పుటయున్ బలికల్పనంబు నాఁ
దనరెడు పంచయజ్ఞము లు ♦ దారతఁ దానొనరింపఁగాఁదగున్
వనజదళాక్షి భూమిసుర ♦ వర్యుఁడు రెండవ యాశ్రమంబునన్.

గీ. యాజ్ఞవల్క్యాది మునివరు ♦ లఖిలలోక, హితులు సెప్పినధర్మసం ♦ హితలయందు
సముదితంబైన యాచార ♦ సరణి యెల్ల, నాచరింపంగఁదగు గృహ ♦ స్థాశ్రమమున.

సీ. నిర్హేతుకంబుగా ♦ నిఖిలాంగసహితవే, దాధ్యాపనంబు సే ♦ యంగవలయు
నర్హధర్మాగతం ♦ బగు వరాటికకైన, సాత్మలోనఁ బ్రమోద ♦ మందవలయు
ఋతుకాలమాత్రసం ♦ గతిచేత నిజధర్మ, సతియందు సుతులఁ గాం ♦ చంగవలయు
దల్లిదండ్రుల నిష్ట ♦ దైవతంబులకన్నఁ, బరభక్తిచే నిరీ ♦ క్షింపవలయు
విబుధవరులను గురుల సే ♦ వింపవలయుఁ, బార్వతీసంయుతుండైన ♦ పరమశివుని
విమలతరచిత్తుఁడగుచు భా ♦ వింపవలయు, (నకని బ్రాహ్మణుఁ డెప్పుడు) గా ♦ ర్హ
[స్థ్యమునను.

గీ. అఖిలభోగానుభవముచే ♦ నాత్మఁ దనిసి, కష్టములచేతఁ బితరుల ♦ కాంక్షఁ దీర్చి
యాగముల దేవతాతృప్తి ♦ యాచరించి, యాశ్రయింపంగఁ దగు వన ♦ స్థాశ్రమంబు

ఉ. అంబుజనేత్ర భూమిసురుఁ ♦ డంత సతీయుతుఁడై యరణ్యవా
సంబునకేఁగి మౌనిజన ♦ సంగతిఁ జీరజటాదికంబు చి
హ్నంబుగఁ బూనినిశ్చలత ♦ బోధితుఁడై వనకందమూలము
ఖ్యంబులు భోజనంబులుగఁ ♦ గాలము పుచ్చుట యర్హమెంతయున్.

గీ. అంతఁ (దన) యంతరంగ మ ♦ త్యంతవిమల, మైన సురనరలోకసౌ ♦ ఖ్యములు రోసి
మదియు నహంకారమంతయు ♦ గుదిలపఱచి, సకలకర్మంబులందు ని ♦ స్సంగుఁడగుచు.

క. విశ్రుతఫలమైన తురీ, యాశ్రమమంగీకరించి ♦ యంతట వేదాం
తశ్రవణ మాచరింపుచు, సశ్రమమున ముక్తిఁ గాంచు ♦ టర్హము తస్వా.

ఉ. సాహసయుక్తదేవరిపు[1] ♦ సంఘములం ఘనచక్రధార ను

1 పుర (మూలము)

గీ. బ్రాహ్మణునితోడ నలుగంగఁ ♦ బాడిగాదు, తప్పుజేసిన దండింపఁ ♦ దగవుగాదు
నిష్ఠురోక్తులు పలుకుట ♦ నీతిగాదు, ధర్మసంగ్రహరతియైన ♦ ధరణిపతికి.

క. ఊరువునం బ్రభవించిన, వారికిఁ గృషిపాశుపాల్య ♦ వర్తనములన
త్యారూఢమగు వాణిజ్యము, నారయ ధర్మంబులందు ♦ రమతేందుముఖీ.

క. నాలుగవజాతివారికి, వాలాయముఁ జేయవలయు ♦ వర్ణత్రయసే
వాలక్షణనిర్మలధ, ర్మాలంబన మదియయొసఁగు ♦ నఖిలశుభంబుల్.

క. చాతుర్వర్ణంబునఁ గం, జాతవిలోచనలకెల్ల ♦ సత్యంబరయన్
బాతివ్రత్యసమాఖ్యము, హాతపము త్రివర్గజలరు ♦ హాతప మబలా.

సీ. కులహీనుఁడైన స ♦ త్కులసంభవుండైనఁ, బతి యిష్టదైవంబు ♦ భామినులకు
జడుఁడైన సకలశా ♦ స్త్రజ్ఞాననిధియైన, నాత్మనాథుఁడు సేవ్యుఁ ♦ డంగనలకు
సమరభీతుండైన ♦ సాహసాధికుఁడైన, ధవుఁడు పూజ్యుఁడు ప్రమ ♦ దామణులకు
నత్యకించనుఁడైన ♦ నమితకాంచనుఁడైనఁ, గాంతుఁడీశ్వరుఁడు సీ ♦ మంతినులకుఁ
గామినీనింద్యకుత్సితా ♦ కారుఁడైనఁ, గీర్తనీయమనోజాత ♦ మూర్తియైన
ననలసాక్షిగఁ దనహస్త ♦ మందినట్టి, యతఁడె రెండవశివుఁడు బిం ♦ బాధరలకు.

గీ. విహితధర్మంబు సేయక ♦ విడుచుటయును, మానకవిహితధర్మంబుఁ ♦ బూనుటయును
ననఁగ రెండు నధర్మంబు ♦ లరసిచూడ, నవియెపాతకకర్మంబు ♦ లరసిచూడ.

గీ. బ్రాహ్మణులహింసయును సురా ♦ పానరతియు, స్వర్ణచౌర్యంబుగురుదార ♦ సంగమంబు
తత్సమాగమమును బ్రశ ♦ స్తంబులైన, యైదును మహోగ్రదురితంబు ♦ లనఁగఁ బరఁగు.

ఉ. ద్యూతము కైతవంబు పర ♦ దూషణముం గటుభాషణంబు ని
ర్హేతుపరాపకారమును ♦ నీర్ష్యయసూయయు సూచకత్వమున్
భూతదయావిహీనతయుఁ ♦ బుణ్యముఁ గాదను నాస్తికత్వముం
బాతకమూలముల్ వికచ ♦ పంకజపత్రవిశాలలోచనా.

క. పరవనితాజనితాశయుఁ, బరకాంచనవంచనంబు ♦ పరికించినచోఁ
బరమోత్తరపాతకములు, పరిపూర్ణశశాంకనిభవి ♦ భాసురవదనా.

సీ. తలిదండ్రు లధికవా ♦ ర్థకవికారములనొ, చ్చిన ననాదరమును ♦ సేయుటయును
నాచార్యునొద్ద వి ♦ ద్యాభ్యాసమొనరించి, మించియాయన ధిక్క ♦ రించుటయును
దనునేలినట్టిభూ ♦ ధవుని మంత్రియువిభే, దించివంచనముఁ గా ♦ వించుటయును
ననిమిత్తముగ నుత్త ♦ మాచారవతియైన, సతిఁబరిత్యాగంబు ♦ సలుపుటయును

తగవులందునఁ బక్షపా♦తంబుకలిమి, కలిమివేళల నిజ లేని♦ గడుసుతనము
కూటసాక్షిత్వమునకైన♦ క్రూరవృత్తి, తరళలోచన యధికపా♦తకములండ్రు.

గీ. అతిథి నాఁకటనలసి మ♦ధ్యాహ్నవేళ, యిందుఁ దనయింటికే తేర♦నన్నమిడక
యాదరింపక పరుషంబు♦లాడినట్టి; కిల్బిష మశేషపాతకా♦గ్రేసరంబు.

గీ. విప్రనిందయు గురునింద♦వేదనింద, యనఘసాధ్వీవినిందయు♦నాదిగాఁగఁ
గలవు కలవాణి మనుజలో♦కంబునందు నెన్నఁగా రాని దురితంబు♦లెన్నియైన.

క. పుణ్యంబులు కళ్యాణక, రణ్యంబులు వెలయువాని♦రమణీయప్రా
వీణ్యంబున వినుపింతు న, గణ్యగుణోదారవికచ♦కమలదళాక్షీ.

సీ. అత్యాహితాక్రాంతుఁ♦డభయంబు వేఁడినఁ, గరుణార్ద్రచిత్తుఁడై♦కాచినదియు
నత్యంతదూరప్ర♦యాణఖిన్నుండైన, పథికు నాయాసంబు♦వాపినదియు
మనుపుజీర్ణత్వమం♦దిన దేవభూదేవ, నిలయము ల్మరుగ డంగ♦నిలిపినదియు
బలిమిచేఁ గలిమికై♦బందీభవత్కాంది, శిశునకు విముక్తి♦చేసినదియు
తస్కరాదులచేతవి♦ధ్వస్తమైన, దీనుని ధనంబుమగుడ సా♦ధించి తెచ్చి
యిచ్చినదియును మొదలుగా♦నెన్నఁదగిన, సుకృతములు విశ్రుతంబులు♦సుందరాంగి.

క. సత్యంబగు నప్రియము న, సత్యంబగు ప్రియముఁ బలుకఁ♦జనదని బుధుల్
సత్యంబు ప్రియముఁ బలుకుట, యత్యంత విశేషధర్మ♦మందురు తన్వీ.

ఆ.వె. సాధురక్షణంబు♦సమదర్శనంబును, సర్వభూతజాత♦సదయవృత్తి
వితరణంబునఁగ♦వివిధపుణ్యంబుల, నుత్తమోత్తమంబు♦లుత్పలాక్షి.

ఉ. పుణ్యములెన్నియేనియును♦భూమితలంబునఁ గల్గెఁగాని నై
పుణ్యసమేతులైన బుధ♦పుంగవులెంచినయన్నదానపుం
బుణ్యఫలంబుతోడ సరి♦బోలవు వేలుపురెండకోనియున్
బుణ్యమతీమతల్లి! ఫణి♦భూషణుతో సరిదూఁగ నేర్తురే.

సీ. ప్రకుపితాంతకనితాం♦తకటాక్షవీక్షామ, హానలం బణఁగింప♦నదియొ చాలు
1 సంసారవాహినీ♦సంతాపభంగితో, వ్యతికరాల లణఁగింప♦నదియొ చాలు
పితృదేవతామనో♦ప్రీతిదైన్యపాతక, విదళనం బొనరింప♦నదియొ చాలు
విరహాతురాప్సరో♦విసరచిత్తజచిత్ర, జాతుగశిఖి మాన్ప♦నదియొ చాలుఁ
గాకయేఁకొని ఘర్మాంబు♦శీకరములు, జాఱఁగడుదప్పి దిటదప్పి♦చేరఁ గొనిన
యతిథికిడినట్టి యోదనం♦బాదరాగ్ని, భేదకరమాత్రమే చంద్ర♦బింబవదన.

1 నంగారవాహినీసంతాభంగతో వ్యతకరాల (మూలము)

చ. జపుఁడౌ ఘభూసురాగ్రణికి ♦ సత్కృప నన్నము వెట్టి జాఠరా
గ్నిని వెడలంగఁ జేయునది ♦ కేవలముం బగఁబూనె నేమొ 1 చ
య్యనఁ జనిజన్మకోటినిచ ♦ యంబులనుండియుఁ గూర్చుకొన్న త
ద్ఘనదురితౌఘముల్ నిప్పుఱు ♦ గానొనరించు విశాలలోచనా.

క. కమలాక్షి సప్తసంతా, నముల ఘనవనములంద ♦ నంతఫలనిదా
నము లైన సుకృతములుగల, వమరున్ వినిపింతువాని ♦ నాలింపఁదగున్.

సీ. శిఖిసాక్షిగాఁ బ్రాణ♦సఖి యైన కులకాంత, యందు నౌరసపుత్రుఁ♦ గాంచుటయును
మధువైరికైన ను♦న్మథవైరికైన మం, దిరము సుందరము గా♦ నిలుపుటయును
శ్రోత్రియద్విజవర్య♦పుత్రుఁ బావనగుణాం, చితచరిత్రునిఁ బెండ్లి♦ సేయుటయును
పూర్వమహారాజ♦పుణ్యకథాళి, వెలయఁ గావ్యంబు ని♦ర్మించుటయును
ధనము పాఁతుట పుణ్యసా♦ధనము గాఁగ, వనము నిల్పుట పుణ్యజీ♦వనము గాఁగఁ
జెరువుఁ ద్రవ్వుటయనఁగన♦ చ్చెరువు మీఱు,2(సప్తసంతానములు) జగ♦త్సంతతులను

వ. మరియు నగ్నిష్టోమాదియాగంబులు తులాపురుషాదిమహాదానంబులు కృచ్ఛ్రచాంద్రాయణాదివ్రతంబులు మహాభారతాదిపురాణశ్రవణంబులు గంగాదిపుణ్యనదీస్నానంబులు సౌరగాణపత్యాదిమహామంత్రజపంబులు వేదవిద్యోపదేశంబులు మొదలైన యనేకపుణ్యవిశేషంబులు గలవింక నొక్కరహస్యంబుఁ జెప్పెద నాకర్ణింపుము.

చ. ధరణిపతిత్వమున్ సుమద ♦ దంతితురంగమరత్నకాంచనో
త్కరవరపూర్ణలక్ష్మి ప్రమ ♦ దాసముదాయము లింద్రచంద్రభా
స్కరకమలాసనాదిపద ♦ సౌఖ్యము లియ్యఁగఁజాలుఁగాని ము
క్తిరమ యొసంగఁజాలవు స ♦ తీమణి యీసుకృతంబులన్నియున్.

సీ. వలయాద్రిమధ్యభూ ♦ వలయసామ్రాజ్యల, క్ష్మీనిధానము సదా♦శివునిభక్తి
యాజవంజవసాగ ♦ రాలింగ్యమానవో, ద్ధరణంబు పార్వతీ ♦ శ్వరునిభక్తి
జన్మపారంపరీ ♦ చరితోగ్రదురితసం, హరణంబు నీలకం ♦ ధరునిభక్తి
సురవధూకుచకుంభ ♦ పరిరంభమానని, ర్నిద్రంబు కైలాస ♦ నిలయుభక్తి
ముక్తిరమణీమణీనవా ♦ మోదవల్గు, టాక్షవిన్యాసజన్యాస ♦ దృఢనిత్య
విభ్రమాదభ్రసౌఖ్యని ♦ ర్వేశఘటన, పటుతరోద్యుక్తి యమ్మహా ♦ నటునిభక్తి.
మనుజలోకానేక ♦ మధురాధరాపరో, ధరరసంబులయందు ♦ నరుచిపూన్పు
శమనవాహనగళాం ♦ చలకలద్ఘంటికా, ఘననినాదంబుల ♦ వినికి మాన్పు

1 గ్రిక్కున (మూలము)   2 మీఱు నీజగత్సంతతులను (మూలము)

సీ. బహుళతాయుతమహా♦పాతకభూజాత, భూతజాతనికాత♦హేతి భూతి
పూర్వదుర్వాసనా♦ఖర్వకాననగర్వ, హేళాకరాశాగ్ని♦హేతి భూతి
గ్రహయోగదోషదు♦ర్గహనాగనిగ్రహా, (ఘన)పతంగాగ్రియ♦ఖ్యాతి భూతి
కాలకింకరభయం♦కరకోపదవశిఖా, భూతివర్షాగమో♦ద్భూతి భూతి
జలజభవముఖదేవతా♦శాస్యమాన, తరుణశశిచూడకరుణాసు♦ధారసమయ
సారతాసారరసము♦ద్ధారకార, ణాతివిపులప్రణాళికా♦రీతి భూతి.

సీ. త్రివిధపాపముల యు♦ద్రేకంబు నిదియు, శిక్షించుచున్నట్టి సం♦కేత మేమొ
త్రిభువనసామ్రాజ్య♦విభవోదయముతోటి, సాటియగానిది యన్న♦సన్న యేమొ
త్రిపథగాజలమురీ♦తిని పావనత్వంబు, నందించు నిదియన్న♦నాన యేమొ
త్రిణయనాకృతియె సం♦దేహంబుగా నింక, దయసేయు నిదియన్న♦దారి యేమొ
కాని యలపచ్చవిలుకాని♦మేనికణఁక, మానిపిన వేలుపులశేని♦జూని కొలుచు
భక్తులుధరింతురే♦ప్రొద్దుఫాలసీమ, భసితలసితత్రిపుండ్రంబు♦పద్మగంధి.

గీ. కంఠమునఁ గంబుకంఠశ్రీ♦కంఠమంత్రి, పూతముగ మానవుఁడు దాల్చు♦భూతిశేఖ
శేషకంఠసరంబు ని♦శేషమూర్తి, గరిమఁ బరిణామమందు న♦బ్బురముగాదె.

గీ. భూతపతికిఁబ్రియంబైన♦భూతిరజము, మేన నేమానవుఁడలందు♦మీననయన
పరమముక్తివధూటికా♦కరసరసిజ, దత్తకర్పూరసారము♦తండలందు.

సీ. చపలతాపత్రయీ♦సలిలోగ్రసంసార, (ఘోర)పారావార♦తారణంబు
సకలజన్మార్జిత♦జాతపాతకమహో, ద్ధతకుంభికుంభవి♦దారణంబు
సంతతానంతకో♦పారంభజృంభణ, క్రూరరూపవికార♦వారణంబు
బహుతరాయాస♦సంపాద్యమానానేక, ఘనపుణ్యపరిపాక♦కారణంబు
మృత్యుజరగాంతరాధప్ర♦భూతభేద, జాతవిద్యోతమావజీ♦మూతపటల
విఘటనాపటుచాతుర్య♦విస్ఫురత్స, మీరణంబగు రుద్రాక్ష♦ధారణంబు.

గీ. ధారణంబేల వేదాంత♦గౌరవార్థ, ధారణంబేల విషమశా♦స్త్రవ్రజవ్ర
ధారణంబేల రుద్రాక్ష♦ధారణంబె, చాలు నరులకు మోక్షంబు♦సంగ్రహింప.

గీ. మోములొకటియు రెండును♦మూడు నాల్గు, నైదు నాఱునుగల్గు రు♦ద్రాక్షములను
నేకముఖమందులోన న♦నేకముఖము, హాఫలవిధాయకంబగు♦నవలతాంగి.

సీ. ఏకరూపజ్ఞాన♦మిచ్చునిశ్చలతనై, ఖరి నెతఁగింప నే♦కముఖమయ్యె
సతతలోకద్వయీ♦సౌఖ్యదానోద్యు, వెలయింప రెండుమో♦ములు ధరించె

భువనత్రయీరాజ్య♦భోగవిశారదునో, ద్యమునూచనకు ముఖ♦త్రయము దాల్చి
ఘనచతుర్వర్గసం♦ఘటనపాటవయుక్తిఁ, దెలుపంగ నాల్గుమో♦ములఁ జెలంగి
పంచవిధపాతకప్రక్షో♦పరిహరించు, శక్తి ప్రకటించుటకును బం♦చముఖమయ్యె
షడ్గుణైశ్వర్యమహిమయుఁ♦జాటుఁ దనిసి, యాఱుమోములు బూనెరు♦ద్రాక్షు మబల

క. రుద్రాక్షుసగము పూనిన, రుద్రాక్షుపకీర్తనీయ♦రూపవిరాజ
ద్భద్రిముగల నరుఁడతిశుం, భద్రముఁడౌ నందు నిందుఁ♦బర్వేందుముఖీ.

క. పంచాననినిభమధ్యా, పంచత్వంబన్న రోగ♦బాధయణంచుం
బంచముఖుఁడు నిర్మించెను, బంచాక్షరి యనఁగఁబఱఁగు♦పరమాపదమున్.

సీ. దురితంపుఁగుఱ్ఱి తెంపు♦మరిపింపు, నలిహేతువగు సేతు♦వదియకాదె
బలువంతఁగలవింత♦బరసంతసమసంత, హరియింపఁ జంద్రి♦కదియకాదె
విదయంచుమదిమించు♦పెనుమంచు విదళించు, నుదయదర్కమరీచి♦యదియకాదె
పురవైరి కేధారి♦గిరిదారి సిరిమీఱి, యరుగుచోఁ జేయూత♦యదియకాదె
నిత్యపరతత్త్వనిధిని స♦న్నిధిగనంగ, నబ్బురంబైన యంజనం♦బదియకాదె
మహితపంచాక్షరీమహా♦మంత్రవరము, ప్రణుతి సేయంగఁదరమానె♦బ్రహ్మకైన.

సీ. పంచాక్షరీమంత్ర♦పంచాననము గాక, తరుము నే పాపదం♦తావళముల
పంచాక్షరీమంత్రి♦బడబానలము గాక, హరియించునే పాత♦కంబునిధుల
పంచాక్షరీమంత్ర♦పరమౌషధము గాక, యణఁచునే ఘనదుష్క♦తామయముల
పంచాక్షరీమంత్రి♦పవనవేగము గాక, కలఁచునే వృజినౌఘ♦జలధరముల
మగువ పంచాక్షరీమహా♦మంత్రరాజ, గారుడక్రియాసాద♦గౌరవంబు
గాక చీకాకుసేయునే♦లోకభీక, రాతికల్మషభూరిపా♦తాళనములు.

సీ. నిపుణమాయాశిల్పి♦నికల్పనీయపరి, పంచదుర్గంచరా♦భ్రాంతి యుడిపి
ఆజవంజవసాగ♦రాపనోపప్లవ, సాధిగతపరిప్ల♦వము నణఁచి
యతిదయారహితాంత♦1 రాహితప్రక్రుతాప, కారవికారంబు♦కడకునొత్తి
విషమోదయావినోద♦వివశపంచేంద్రియా, పాదితోన్మాదంబు♦పరిహరించి
చిద్విశేషంబుమదిఁ బరి♦కింపఁజేసి, రాజతాచలరాజవి♦రాజమాన
శిఖరసుఖరామణీయక♦శ్రీవిలాస, మొసఁగుఁ బంచాక్షరీమంత్ర♦మో మృగాక్షి.

. హరివిరించిసురాధినా♦థాదులైన, వేలుపులలోన నధికుండు♦విశ్వభర్త
సప్తకోటిమహామంత్ర♦సముదయంబు, నందుఁ బంచాక్షరీమంత్ర♦మధిక మబల.

---

1 ♦రహితవారకకృతాప (మూలము)

గీ. అతినిపుణశిల్పివర్ణంబు ♦ లైయుఁగూర్చి, చిత్రముఘటించు వైఖరి ♦ శివుఁడు దాను
నంచితములైన వర్ణంబు ♦ లైయుఁగూర్చి, సతిపెఁజిత్రంబు త్రైలోక్య ♦ సదనసీమ.

ఉ. అక్షరపంక్తిమాత్రపఠ ♦ నాధికగర్వులు భూసురుల్వచో
పక్షమునన్ గతాగతికఁ ♦ బాల్పడిపోయిన నట్లపోవనీ
యక్షరమోక్షలక్ష్మిఁ గమ ♦ నాసఁ జెలంగెడు వారికెల్లఁ బం
చాక్షరికన్న వేఱొకయు ♦ పాయముగల్గదు పంకజేక్షణా.

క. మానవరాజికి వలదన, మానమొకింతయు మనోజ ♦ మదనుని మూర్తి
ధ్యానము భవనాశాంతే, ర్ధ్యానము చింతామణీవి ♦ తానము తన్వీ.

సీ. అతులసౌదామినీ ♦ లతల కెంజిగిమించు, లతల మీఱెడుఁ జటా ♦ వితతివాని
నకలంకహారిణాంక ♦ శకలకోటీరంబు, దండమిన్నేటిపూ ♦ దండవాని
వనజాప్తచంద్రశిఖా ♦ వకనివాసైకపా, త్రములైన విషమనే ♦ త్రములవాని
లలితకుండలితకుం ♦ డలిఫణామణిరాజి, జిగిధరించిన గళ ♦ యుగమువాని
నసదృశానందమయసుధా ♦ రసము మిసిమి, పసత్రులను నద్దమించిన ♦ పసిమిఛాయ
కన్నుఁజిలికెడు వెన్నెల ♦ కలిమి జెలువు, చూపు ముఖచంద్రబింబంబు ♦ సొగసువాని.

సీ. సత్రాసభువనత్రి ♦ యత్రాణశీలనమై, కరమొప్పు మెడకప్పు ♦ గలుగు వాని
నతిచారుమాధురా ♦ హారహారవిశేష, రమణీయబాహాంత ♦ రంబు వాని
ఖడ్గత్రిశూలధ ♦ నుఃకుఠారమృగాది, సహితప్రశస్తహ ♦ స్తముల వాని
దత్తపరిధానవే ♦ దండదానవచర్మ, కల్పితానల్పాంశు ♦ కంబు వాని
నిగమమయమంజుమంజీర ♦ యుగము వాని, నగణితామరవరకిరీ ♦ టాగ్రమణిని
కాయకషణదరుణశర ♦ ణాయమాన, విమలచరణాబ్జనఖరాజి ♦ వెలయు వాని.

ఉ. పంకజపత్రనేత్రి హిమ ♦ పర్వతరాజసుతాలలామ వా
మాంకమలంకరింపఁ జెలు ♦ వందెడువాని విశేంద్రచంద్రికా
హంకరణంబణంచు జిగి ♦ యందమునందగు వాని నీశ్వరున్
శంకరునాదిదేవు నని ♦ శంబుమదిన్నిలకొల్పఁగాఁదగున్.

చ. నిరుపమయోగకర్మముల ♦ నేయుపులేల యనేకతీర్థసం
చరణములేల దానములు ♦ సల్పఁగనేల వినిశ్చలవ్రతా
చరణములేల భక్తజన ♦ సౌఖ్యకరున్ గిరిజామనోహరున్
హరుని నిరంతరంబు హృద ♦ యంబుననిల్పు వివేకశాలికిన్.

క. దానంబుల బహుయాగవి, ధానంబుల నందరాని ♦ తత్కైవల్య
స్థానంబు పార్వతీశ, ధ్యానంబున నందవచ్చుఁ ♦ దామరసాక్షీ.

సీ. సర్వగురుఁడైన శివునిపా ♦ షాణదారు, మృత్తికాదివిశేషని ♦ ర్మితములైన
లింగములయందు భావించి ♦ సంగతాత్మ, భక్తిఁబూజింపవలయు నో ♦ పద్మగంధి

గీ. శివభవహరాదు లైనట్టి ♦ శీతశైల, జాతజామాతనామముల్ ♦ నియతభక్తి
నుచ్చరింపంగవలయు నీ ♦ లోత్పలాక్షి, పాపనిర్మూలనోపాయ ♦ పరులకెల్ల.

గీ. కమలముఖి శివయన్నవ ♦ ర్ణములరెండు, మనుజజిహ్వాలతాగ్రసీ ♦ మను వసించు
రెండులోకంబులందు న ♦ ఖండసౌఖ్య, సంగతి యొసంగుటకు నేమి ♦ సంశయంబు.

సీ. జన్మపారంపరీ ♦ సంపాదితానేక, కలుషకర్మనికాయ ♦ కర్తనంబు
కామాదికౌశిక ♦ గ్రామగర్వకరదు, ర్వారరూపతమోని ♦ వర్తనంబు
సకలపుణ్యావాప్త ♦ జలజాతవికసన, క్రమపరీభూతవి ♦ కర్తనంబు
బృందారకాంగనా ♦ బృందవన్మందార, వాటీకృతానంద ♦ వర్తనంబు
పరమయోగీంద్రదుర్లభ ♦ భ్రాజమాన, మానసానందసౌఖ్యసం ♦ ధాననిపుణ
నవ్యముక్తివధూటికా ♦ నర్తనంబు, కేవలంబౌను శివనామ ♦ కీర్తనంబు.

క. పరమేశ్వరుభక్తులకున్, బరమామోదానుభవము ♦ పాటిలఁజేయున్
బరలోకతరువులోయన, సరసిజముఖి కొన్నిగలవు ♦ శైవవ్రతముల్.

క. శివునకధికప్రియంబులు, శివరాత్రి శనిత్రయోద ♦ శీయోగంబుల్
ధవళాంశువాసరము మొద, లవువివిధవ్రతము లమరు ♦ నమలేందుముఖీ.

మ. కపటోద్యోగమొకింతయున్ గనక గం ♦ గాస్నానశుద్ధాంగుఁడై
యుపవాసంబొనరించి భక్తి మదిలో ♦ నుప్పొంగఁ బంచాక్షరీ
జపయోగంబున నిర్మలాత్ముఁడగుచున్ ♦ సర్వేశు గౌరీపతిన్
త్రిపురారాతి నుదారరీతి శివరా ♦ త్రిం బూజ సేయందగున్.

ఉ. భోగివరేణ్యకంకణునిఁ ♦ బూజయొనర్చుచు శైవయామినిన్
జాగరమాచరింప నగు ♦ సంతతి యాత్మలఁగోరి కూరిమిన్
జాగరమాచరింతు రట ♦ సౌరపురీకరిగామినీమణుల్
సాగరకన్యకానుతని ♦ శాతశరాతతఘాతవేదనన్.

క. శివరాత్రి నిశీథంబున, శివునితలన్ బిల్వదళముఁ ♦ జేర్చిన నరుఁడా
శివపురమున నిత్యంబును, శివసామీప్యంబు నొందు ♦ శీతాంశుముఖీ.

గీ. మగువ శివరాత్రియందు నే ♦ మనుజుఁడైన, విమలతరమైన దీపంబు ♦ వెలుఁగఁజేయు
నతని మదియందు నిందుశే ♦ ఖావతంసుఁ, డలఘుసుజ్ఞానదీపంబు ♦ వెలుఁగఁజేయు.

గీ. యెన్నఁగల శైవరాత్రమో ♦ యన్నఁ దాంగి, కన్నమూయని వ్రతముచే ♦ గొన్నవారు
కన్నమూయనివారల ♦ కన్నఁగన్న, యున్నతస్థానమున వేడ్క ♦ నున్నవారు.

ఉ. అచ్చపుయోగకర్మనిచ ♦ యంబులనైనను మెచ్చఁడేమియున్
నిచ్చలపుం దపోజపవి ♦ నిద్రతనైనను మెచ్చఁడేమియున్
బచ్చనివింటిదంట తను ♦ భావము మాన్పినవేల్పు మాటికిన్
మెచ్చు శివత్రయోదశిని ♦ నిశ్చలభక్తి వసించువారలన్.

ఉ. కోటిమహావ్రతంబులును ♦ గోటిశతంబు విశిష్టదానముల్
కోటిసహస్రయాగములు ♦ కోటిశతాయుతతీర్థసేవలున్
పాటలగంధి పంకరుహ ♦ బాంధవసూను దినత్రయోదశిన్
హాటకశైలచాపధరు ♦ నర్చన సేయుటతోటి సాటియే.

చ. నరుఁడిననూను వాసరము ♦ నాఁటి త్రయోదశి సాంధ్యవేళఁ ద్రి
పురదనుజారిఁ జారుమతిఁ ♦ బూజ యొనర్పఁగఁ జాలె నేనియున్
సురలఁట వానిబాంధవులు ♦ సోముని మేనఁట వానిబోనము
చ్చరలఁట వానినెచ్చెలులు ♦ సారసపత్రవిశాలలోచనా.

చ. మఘవముఖాభివంద్యుఁ బుర ♦ మర్దను నమ్మినభక్తు లెన్నఁగా
నఘటితకార్యసంఘటను ♦ లౌట నిజంబది యెట్టులన్నచో
లఘిమవిదూరభక్తిభర ♦ లాంఛితమైన ప్రదోషపూజచే
సిఘనమతిం బ్రదోషములఁ ♦ జెంపరు జన్మశతాయుతంబులన్.

ఉ. చెప్పఁగనేల వేయు సర ♦ సీరుహనేత్ర శివత్రయోదశిన్
దప్పక యప్పురారి మదిఁ ♦ దాల్చు ఘనుం గనుఁగంత వేలుపుల్
ముప్పదిమూఁడుకోటులును ♦ ముప్పదియందురు నైజలక్ష్మికే
చొప్పున వానికేపరము ♦ చొప్పడునో యను సంశయంబునన్.

మందవారంబుఁ దెలియక ♦ మానెఁగాక, మందవారత్రయోదశి ♦ నిందుధరుని
పూజ భూజనరాజి నం ♦ భోజనయన, భాజనము భుక్తిముక్తిసౌ ♦ భాగ్యములకు.
అతిశయభుక్తిముక్తిఫల ♦ దామితశక్తిఁ జెలంగు శాంభవ
వ్రతములు గొన్ని యాగతిఁ బ్ర ♦ వర్తిలుచుండెడుఁగాని వానిలో

నతిశయ మిందువాసరమ ♦ హావ్రతరాజమె సర్వదేవసం
తతులకుఁ జంద్రమౌళియును ♦ దంపము హంసవిలాసగామినీ.

గీ. తరువరములందుఁ బారిజా ♦ తంబువోలె, గ్రహనికాయంబునందు భా ♦ స్కరుఁడు వోలె
నమృతకరమౌళివ్రతసమా ♦ జముల లోన, సోమవారవ్రతంబు వి ♦ శ్రుతము సాధ్వి.

సీ. సోమవారవ్రత ♦ స్ఫుటభానుబింబంబు, పుణ్యాబ్జజనము ♦ బోధకంబు
సోమవారవ్రత ♦ భీమజీమూతంబు, పాపదావానల ♦ భంజనంబు
సోమవారవ్రత ♦ సురభూజరాజంబు, కామితఫలదాన ♦ కారణంబు
సోమవారవ్రతా ♦ శుగమహావేగంబు, దారిద్ర్యజలదావి ♦ దారకంబు
సోమవారమహావ్రత ♦ కామవిశిఖ, సముదయంబు నసర్గదు ♦ ర్గమమదాప
వర్గలక్ష్మీవధూమనో ♦ వాతిరుహావ, శీకరణకారణంబు రా ♦ జీవగంధి.

ఉ. సతతము భుక్తిముక్తిఫల ♦ సాధనమై తగు సోమవాసర
వ్రతములరంగ మర్త్యుఁడిత ♦ తంబగు రెంబడిఁబోవు టెల్ల నో,
సతి సురవాహినీర్ఝరము ♦ సన్నిధి సన్నిధిలీలనుండ న
ల్పతరతటాకశీకరజ ♦ లంబుల దానము సేయుటయ్యెడిన్.

ఉ. యింకనువేల్పులందు హరుఁ ♦ డింతుకళాధరుఁడౌ రహస్యసం
జందముగాన నెవ్వరును ♦ జందనగంధి తదీయవాసరా
మందనిజవ్రతంబు మహి ♦ మంబున కీనిఖిలవ్రతంబులన్
గ్రిందనిసెల్లవారి కెతిఁ ♦ గింపఁగసన్న పరికారమయ్యెడిన్.

సీ. జలరాశిధృతసర్వ ♦ సర్వంసహావిలా, సరతి కేగతిఁగల్గు ♦ సవవిభుండు
విలసితాలంకార ♦ విస్తారభారతీ, వృత్తి కేగతి నబ్బుఁ ♦ గౌరిత్రజలజు
రంభాదిసురవధూ ♦ జృంభితశుచకుంభ, పాళి కేగతి మీఱు ♦ వచ్చుగోర
కైలాసగిరిదరీ ♦ గతకిన్నరీగత, వితతి కేగతివచ్చు ♦ వింతమెచ్చు
నిష్క[1]శంకభవన్మనో ♦ నియతిచేత, రాజబింబాస్య సోమవా ♦ రవ్రతంబుఁ
బూనిమొనరించు పరమసై ♦ పుణ్యపుణ్య, ఘనులు గొందఱుధరయందుఁ ♦ గలుగకున్న

గీ. జలజనయన యుమావధూ ♦ సహితుఁడైన, మదనవైరికి సోమవా ♦ రంబుచెలఁగు
నతిని పేరను విశ్రుతం ♦ బైనయట్టి, సోమవారంబు కామిత ♦ స్తోమదంబు.

ఉ. ఉర్వీసుపర్వుఁడ ♦ ఖర్వగీర్వైశద్య, విద్యానవద్యుఁడై ♦ వెలయుచుండు
రాజవందనుఁ డన్య ♦ రాజపూజితపదాం, భోజవిభ్రాజిత ♦ స్ఫురణఁ గాంచు

---

1 శంకింభ భవన్మ (మూలము)

నూతనసంశ్రవృత్తమని ♦ తోయరమేరుసమాన, చామీకాంచనరాశి ♦ సంగ్రహించు
శూద్రుండు సద్విజో ♦ న్నిదర్సేవారూప, భద్రపదర్మ్యమై ♦ భవముఁ గాంచు
సతులు పతివల్లభత్వంబు ♦ సంగ్రహింతు, రతివ యతివాంఛితార్థంబు ♦ లందుచుండ్రు
జనములకునెల్ల సౌఖ్యభా ♦ జనములగుచు, దధ్యముగ సోమవారవ్ర ♦ తంబుచేత

సీ. ఏకాతపత్రభూ ♦ లోకసామ్రాజ్యలా, భోన్నత్యమున కాసఁ ♦ గన్నవారు
మణివిమానాధిరో ♦ హణముచేఁ ద్రైలోక్య, సంచారమునకు వాం ♦ ఛించువారు
రాజతాచలసూత్న ♦ రత్నసౌధాంచలా, చంచలక్రీడఁ గాం ♦ క్షించువారు
ప్రమథేశు కొల్వుకూ ♦ టమునందు మిత్రులఁ బె, ద్దరికంబుఁ గననాత్మఁ ♦ దలఁచువారు
పరమయోగీశ్వరులకును ♦ బ్రాప్యమైన, ముక్తిసాయూజ్యమునకుఁ గా ♦ మించువారు
రాజబింబాస్య సోమవా ♦ రవ్రతశ్రీ, యానిరతి గాక చరితార్థు ♦ లౌదురెట్లు.

సీ. చిరదరిద్రాణతా ♦ పరిపీడితులకు ల, క్ష్మీకటాక్షాలోక ♦ సిద్ధియిచ్చు
ననపత్యతానిత్య ♦ జనితార్తిఁ గనువారి, కనురూపసంతాన ♦ మలరఁ జేయుఁ
బతివియోగార్తిపీ ♦ డితులైనసతులకుఁ, బతియోగసంతోష ♦ మొదవఁ జేయుఁ
బ్రతిపక్షులఁ బరా ♦ జితులైనవారికి, నధికజయోత్సాహ ♦ మబ్బఁ జేయు
జడులకభిరామశేముషీ ♦ సరణి యిచ్చు, నేమి ఘటియింపఁజాల దో ♦ యిందువదన
సోమవారవ్రతంబు ని ♦ స్సమనియమ, సత్యమైనట్టి శివభక్త ♦ జనులకెల్ల.

తే. అమృతకరు వాసరమునందు ♦ నవనతాంగి, యమృతకరశేఖరుని పూజ ♦ యాచ్చనేని
యమృతకర మాటకే సంశ ♦ యంబు గలద, దమృతభోజను లాశ్చర్య ♦ మనినుతింప

గీ. అనుచు నత్యాజ్ఞవలుకాని ♦ వనిత సోమ, వాసరవ్రతమహిమంబు ♦ వరుసఁ దెలుప
జిత్రవర్త్మసుమారి శౌ ♦ చిత్రి వెలయఁ, బులకితనిజాంగలతికయై ♦ పలికె నిట్లు.

ఉ. పావనిపీఠునాపయిఁ గృ ♦ పారసపూరసమృద్ధిఁ గాంచి యెం
తే విశదంబుగాఁ బలుప ♦ శివవ్రతచర్య దెలుపఁగఁ జేయుచోఁ
దావకవాక్సుధారసముఁ ♦ ద్రావఁగ వీనులు చల్లనయ్యె నా
జీవనమెల్లఁ బావనతఁ ♦ జెందెఁ దలంగె నశేషదోషమున్.

గీ. శివునియానతి నన్ను ర ♦ క్షించుకొఱకుఁ, గాననయ్యెడి పార్వతీ ♦ కాంత వేమొ
యున్నఁగల భాగ్యదేవత ♦ వేమొ కాక, మానివరకాంతవే నీవు ♦ మంజువాణి.

వ. అనుచుఁ బునఃపునరభివాదనంబుఁ జేసి నిటలతటంబున నంజలిపుటంబు ఘటించి కుటిలకుంతల మానికాంత కిట్లనియె.

సీ. వినవమ్మ మున్ను నే ♦ జనియించినట్టి యా, సమయంబునను విప్ర♦జనులఁ బిలచి
మాతండ్రి యడుగంగ ♦ మహిదేవతావరుం, డొక్కరుం డీబిక ♦ యుత్పలాక్షి
చిరకాలపతియోగ ♦ వరపుణ్యవతియును, బహుపుత్రవతియునై ♦ పరఁగ విల్లు
నని పల్కెనంతలో ♦ నన్యభూసురమౌళి, పదునాలుగవ యేఁటఁ ♦ బంకజాక్షి
యమిత వైధవ్యదుఃఖంబు ♦ లందు ననియె, నట్టి మహానటు నాజ్ఞయె ♦ ట్లొనో యనఘ
దుస్తరవిషాదవారాశి ♦ నిస్తరించు, యుక్తి యేమియుఁ దెలియక ♦ యున్నదాన.

ఉ. ఓనలినాక్షి యాతనిమ ♦ హోగ్రపుఁబల్కు సఖీముఖంబుచే
వీనులసోఁకుటాదిగ న ♦ వీనముగాఁగ మదిం జనించె నె
మ్మేను గృశత్వమందఁ గను ♦ మీఁదిఁ యట్టి దురంతరూపచిం
తానలకీల యార్పఁగను ♦ పద్మదయారసవర్షసంగతిన్.

గీ. అట్లుకానున్నదో యీశ్వ♦రాజ్ఞచేతఁ, గాక వేఱొక్కచందమా ♦ కార్యమౌనొ
యిందుబింబాస్య యీరెండు ♦ నేర్పరించి, చల్లఁగాఁ జేయు మామక ♦ స్వాంతవీథి.

గీ. అనిన దరహాసచంద్రిక ♦ లాననేందు, విపులతరచంద్రికలతోడ ♦ వియ్యమందఁ
గండలితకరుణావలో♦కములఁ గమల, వదన నీక్షించి మానీంద్రు ♦ డనియె పలికె.

మ. భవితవ్యంబెటులయ్యె నేమి చెలియా ♦ ప్రత్యగ్రమత్యుగ్రజ
న్మవచోభీతి యశేషమున్ విడచి నా ♦ నాదీనసంరక్షణ
ప్రవణోదారకృపారతిం బశుపతిన్ ♦ భావింపు నత్యున్నత
ప్లవమౌఁ దచ్చరణారవిందయుగ మా ♦ పద్ఘోరవారాశికిన్.

సీ. ఆశ్రితశ్రేణికి ♦ నభయ మిచ్చుటకునై, శివుఁడు సంకల్పంబుఁ ♦ జేసినాఁడు
దీనులఁ గరుణార్ద్రదృష్టిచే ♦ నరయంగఁ, జంద్రమౌళి ప్రతిజ్ఞ ♦ సల్పినాఁడు
భక్తకోటులకు నా♦పన్నివారణ సేయఁ, బురశాసనుఁడు దీక్షఁ ♦ బూనినాఁడు
కాందిశీకశ్రేణిఁ ♦ గావంగ నద్రిజా, నాథుండు శపథంబొ♦నర్చినాఁడు
గట్టిగా నాత్మఁ దనునమ్మి♦నట్టి జనుల, కభిమతము లిచ్చుటకుఁ దక్ష♦కాహిరాజ
కంకణముఁ గేల(గట్టిగాఁ) ♦ గట్టినాఁడు, చింత నీకింత వలవదో ♦ చిగురుఁబోఁడి.

పాపోగ్రరూపస♦ర్పముల దర్పమువెల్ల, హరుని నామము తార్క్ష్యుఁ♦ డై యణంచు
గండదోషమదవే♦దండకాండంబుల, శివపూజ సింహమై ♦ చెండివైచు
తాపత్రయాభీల♦తాపంబు నీశ్వర, ధ్యానంబు జలధరం♦బై హరించు
నమితాజవంజవ♦తిమిరంబు నభవమం, త్రావృత్తి రవిదీప్తి ♦ యై తెరల్చు

ఘనతరవిషాదదుర్గ్రహ♦గ్రాహపరమ, పాపదాంభోధిఁ బ్రసవసా♦యకవిరోధి
భక్తి బాడబకీలియై♦పరిహరించు, నమ్మ మదిరమ్మవమ్మ స♦త్యమ్ము గాఁగ.

గీ. హరునిగిరికన్యకామనో♦హరుని పొద, పల్లవను లాశ్రయింపు మా♦పల్లవములు
చేరవమ్మ ముక్తిమార్గంబు♦చేరువమ్మ, యింతిమది వంతఁ జేసెడి♦చింతరోల.

ఉ. చిత్తజునిల్చినట్టివొర♦ చిత్తము గెల్వఁగఁజాలినమ్మ న
మ్మత్తగజేంద్రగామిని ను♦మారమణిం రమణీయభక్తి చే
హత్తిన చిత్తవృత్తి వల♦యం గలకంఠి భజింపవమ్మ నీ
చిత్తమునందుఁ గోర్కెలగు♦ చింతలకంతము గానయ్యెడిన్.

సీ. కీర్తింపు మాటికి♦గిరిరాజకన్యక, భాషింపు వేమారు♦ఫాలనయనుఁ
మదినిల్పు మదనాంగ♦మథను పట్టపురాణి, భావింపు పార్వతీ♦ప్రాణభర్తఁ
బూజింపు మనయుంబు♦భువనైకజనయిత్రి, నర్చన సేయు బ్ర♦హ్మాండజనకు
నాశ్రయింపుము కదం♦బారామకృతకేళి, శరణమందుము రౌప్య♦శైలనిలయు
నమ్మ నెమ్మనమున షడా♦ననునితల్లి, విశ్వసింపు మహేశాన♦విశ్వభర్తఁ
జంద్రవదన యుమామహే♦శ్వరులకన్న, దీనజనులకు వేఱొక్క♦దిక్కుగలదె.

గీ. సర్వమంగళ యాహిమ♦శైలకన్య, పరమశివుఁడ మ్మహాదేవి♦ప్రాణభర్త
వారిభజియింపువారికో♦ వారిజాక్షి, వివిధకల్యాణలాభ మే♦విస్మయంబు.

ఉ. సావధుమామహేశులన♦ నంతదయాభ్యుదయప్రకాశులం
సేవయొనర్చు వేళయు వి♦శేషవిధానము సేర్పరింపు మో
పావనమూర్తి యన్న నర♦పాలతనూభవఁ గాంచిపల్కె భూ
దేవవధూటి మాటికిని♦ తేనియలీనుప్రసూక్తిచాతురిన్.

గీ. సరసిజదళాక్షి సోమవా♦సరమునందు, హరునిఁ బూజింపగౌరీస♦మన్వితముగఁ
దద్వ్రతము నీకుఁ గల్పపా♦దపమురీతి, సకలవాంఛాఫలంబులు♦సంఘటించు.

సీ. ఉడురాజదినము ప్ర♦త్యూషకాలమునందు, మహితపుణ్యావధూన♦మన్వితముగ
జహ్నుకన్యాజల♦స్నానంబుఁ గావించి, ధూతధౌతాంబరం♦బులు ధరించి
చంద్రఖండకిరీట♦చర్చాశ్రవణద, కుతఁ గొంత సమయంబు♦జరిపి యంత
రమణీయపంచవ♦ర్ణకరంగవల్లికా, సుమమాల్యదళతోర♦ణములచేత
విమలపట్టాంశుకవితాన♦వితతిచేత, శివుని పూజాగృహంబుఁ గై♦సేసి యంత
దోషవిరహితమతియై ప్ర♦దోషవేళ, శివునిఁ బూజింపవలయు నో♦చిగురుబో

# ద్వితీయాశ్వాసము

క. మరకతచంద్రశిలాదిక, పరచితలింగంబునందు ♦ విశ్వైకపతిం
గిరిజాసమేతముగ సు, స్థిరమతి భావించి పూజ ♦ సేయంగఁదగున్.

గీ. అంచితావాహనాసనా♦ర్ఘ్యాదులైన, షోడశమహోపచారముల్ ♦ సోమఖండ
ధామునకు భక్తి నర్పించు ♦ సుందరాంగి, తత్పరాయత్తమైన చి♦త్తంబుచేత.

గీ. వాహినీకృతహంస ♦ వా 1ద్యాదస, వాహనుని భక్తి పూర్వకా ♦ వాహనంబు
జేసి కినశేషవాంఛార్థ ♦ దోహనంబు, ముక్తివనితాని తాంతస ♦ మ్మోహనంబు.

ఉ. ఆసనకాదిభావ్యపదుఁ ♦ డైన యుమాపతికిన్ వినూత్నర
త్నాసన మేకచిత్తమున ♦ నర్పణసేయు మహాత్ముఁ గాంచి యు
ద్భాసనమిత్తు రుత్తమప ♦ దాన్వితులై విలసింత్రు చున్న ప
ద్మాసనపద్మలోచనము ♦ ఖామరవత్యులు హంసగామినీ

గీ. భక్తి వెలయంగ శైలజా ♦ ప్రాణపతికి, నర్ఘ్యపాద్యంబు లర్పించు ♦ నతనిఁ గాంచి
యర్ఘ్యపాద్యంబు లర్పింతు ♦ రా సుధాంశు, శకలకోటీరనాస్థాన ♦ సభ్యజనులు.

సీ. ప్రత్యగ్రరూపతా ♦ పత్రియీపావక, జ్వాల లార్పింపంగఁ ♦ జాలునదియు
విమలక్రియాపల్ల ♦ వితపుణ్యవల్లికా, జాలంబుఁ బోషింపఁ ♦ జాలునదియు
బహుళజన్మాయత ♦ పాతకపంకసం, క్షాళనం బొనరింపఁ ♦ జాలునదియుఁ
బృథుదైన్యసంగత ♦ పితృదేవతాసిపా, సానివృత్తి యొనర్పఁ ♦ జాలునదియు
నేది యాదిత్యధరణిధ ♦ రేంద్రచాపు, విలసితంబైన శీర్షాగ్ర ♦ తలమునందు
నర్పితంబయ్యె భక్తిస ♦ మన్వితముగ, నిర్మలంబైన యాభిషే ♦ కనీరధార.

సీ. బహుళాస్త్రగణమహా ♦ గహనాంతరములందుఁ, దప్పుదారులఁ దారు ♦ దప్పియెల్ల
నమితహింసాయోగ ♦ యాగక్రియాగత, కలుషసంతతి నైన ♦ కలఁకయెల్లఁ
బటులితపోవిభవసం ♦ భవితాంతరాయశం, కాకళంకాదిక ♦ గ్లానియెల్ల
సుమబాణవిక్రమ ♦ క్రమసమగ్రజ్ఞాన, మేదురాంబుధి నీఁదు ♦ సేదయెల్లఁ
దీరునే సారసానన ♦ మేరుశైల, చారుకార్ముకధరనిర్వి ♦ చారభక్తి,
సారరూపసుధారస ♦ ధారఁ దనియ, నానఁగొనలేని నరుని కెం ♦ దైనఁగాని.

-. అంబరకల్పితాంబరుని ♦ కంబరమర్పణసేయు సాతఁడో
యంబుజపత్రనేత్ర విను ♦ మంబరమధ్యవిహారిహారిహో
లంబకచాకచాంచలచ ♦ లాచలభావకభావహోత్రకీ
యాంబరముల్ హరించుకన ♦ కాంబరముఖ్యులు సత్కరింపఁగన్.

---

1 యథామూలము.

ఉ. గంధగజాసురారికిసు ♦ గంధసమర్పణ సేయువాఁడు పు
ష్పంధయనీలవేణి విను ♦ భర్మసరోజవిరాజి దేవతా
సింధుతటీపరిస్ఫుటవి ♦ శేషవికస్వరపారిజాతసం
బంధి సుగంధియోగమున ♦ మాటికిఁ జెందు నతిప్రమోదమున్.

గీ. రక్షితామరలోక ని ♦ ర్మలదయాక, టాకుతాశాలియైనశ్రీ ♦ తాఁకుమాళి
కతుకము లెవ్వఁడర్పించు ♦ నంబుజాక్షి, యతఁయమూతాను వానిప్ర ♦ ణ్యాంబులెల్ల

గీ. పువ్వువిలుకాని గెల్చిన ♦ ప్రోడ తలను, బువ్విడినమానవుఁడు నిటఁ ♦ బుట్టుఁబట్టి
పువ్వులనుదవ్వులంగన్న ♦ పోలుపురరపు, పువ్వుధరియించు సౌదలఁ ♦ బువ్వుబోఁడి.

చ. భువనములందు ధూపములు ♦ ధూమపయోధరకారణంబులై
భువనము లెప్పుడుం గురియుఁ ♦ భూధరరాజకుమారికామనో
ధవునకు నర్పితంబగును ♦ దంచితధూపమునందు ధూమముల్
వివిధమనోరథార్థములు ♦ వేమరునుం గురియున్ దలోదరీ.

ఉ. ఇందుకళావతంసునకు ♦ నిచ్చిన దీపము మానసంబులోఁ
జెందమసొల్లఁ బోనణఁచు ♦ బీరముచూపుట యేమిచిత్రమిం
కొందఁగఁ జాప్యభూధరము ♦ నొద్దకుఁ బోయెడి త్రోవ సవ్యాపృ
త్రేదగుకోటిలక్షకర ♦ దీపికలై పెనువెంటనంటెడున్.

గీ. షణ్ముఖునిఁగన్న ప్రోడకో ♦ చంచలాక్షి, షడ్రసాహారములఁ దృప్తి ♦ సలుపుజనుఁడు
షట్ప్రకారవికారవ ♦ ర్జంబుగాఁగ, షడ్గుణైశ్వర్యమందు ని ♦ స్సంశయముగ.

గీ. చంద్రమౌళికిఁ గర్పూర ♦ శకలకలిత, మైన తాంబూలమర్పింపం ♦ బయ్యోసేని
పరసముక్తివధూటికా ♦ పరిణయప్ర, ధానతాంబూల మదియొసఁగ ♦ దరళనేత్రి.

ఉ. రాజితశైలభర్తకు వి ♦ రాజితభక్తినిరూఢి మీఱ నీ
రాజనమిచ్చు వానిఁగని ♦ రాజమణీరమణీయశేఖర
భ్రాజితనూత్నరత్నఘృణి ♦ పంక్తులచేత మృగాయతాక్షి. నీ
రాజనమిత్తురాదరభ ♦ రంబునఁ దత్పదపద్మసన్నిధిన్.

ఉ. కంజదళాయతాక్షి శిత ♦ కంఠు నకుంఠితభక్తిఁ జేరి పు
ష్పాంజలి యెవ్వఁడేనొసఁగు ♦ నంచితరాగపరాగతాప్సరః
కంజవిలోచనల్ నవవి ♦ కాసమనోహరపారిజాతపు
ష్పాంజలులన్ముహుర్ముహుని ♦ యాదలఁ జల్లుదురుల్లసింపుచున్.

గీ. దక్షకైరికి నియమప్ర ♦ దక్షిణంబు, దక్షతనొనర్చి నాతఁడో ♦ తరలనేత్రి
దక్షిణేశునిఁ గోపప్ర ♦ ధానరూక్షు, వీక్షణంబుల నదలించి ♦ విశ్రమించు.

ఉ. మానవలోకనాయకను ♦ మారిక భక్తిభరంబుమీఱఁగా
నానతిసేయు వానిఁగని ♦ యానతిసేయు సదాశివుండు స్వ
స్థాన మతిక్రమించి సుర ♦ సంఘములెల్ల విచిత్రమంద స్వ
స్థానమునందు నుంచుటకు ♦ సారసపత్రవిశాలలోచనా.

క. మహితంబగు శివపూజా, మహిమంబిట్టిదగు రాటుఁ ♦ మారిక యదియుం
దుహినాంశునివాసరమున, బహుగుణఫలదాయకత్వ ♦ పటిమ న్వెలయున్.

గీ. మగువ యటుఁగాన నిటువంటి ♦ మహిమఁగన్న, విశ్వపతిపూజ భక్తిగా ♦ వించివిప్ర
దంపతులపూజ సేయుము ♦ తగననాది, దంపతులుగాఁగ భాషించి ♦ తరళనేత్రి.

ఉ. బాలిక విప్రవర్గమును ♦ బావన భూమిమరుత్కుటుంబినీ
జాలముగూడ భోజనము ♦ సల్పి యనంతరమిట్టి పతిప్రియా
హేలఁ బ్రతిందువాసరము ♦ నిద్ధగతిన్ వ్రతమాచరించు నీ
పాల నవశ్యమున్ భువన ♦ పాలుఁడు చాల దయాళుఁడయ్యెడున్.

ఆ.వె. అనుచు నృపకుమారి ♦ కా యాజ్ఞవల్క్యని, రమణి సోమవాస ♦ రవ్రతంబుఁ
దెలిపి మఱియుఁ బార్వ ♦ తీభర్త భక్తవా, త్సల్యవృత్తిఁ గొంత ♦ సన్నుతించి.

క. ఉభయాన వినుము గౌరియు, నభినవశశిశేఖరుండు ♦ ననిశము నీకుం
శుభములొసఁగెదరని యా, యుభయాత్మక మజునిమంత్ర ♦ ముపదేశించెన్.

చ. అతులచరిత్రభవ్య యగు ♦ నా నృపకన్యకు శైవమార్గవీ
గతి దెలియించి తద్భ్రియర ♦ కప్రకరక్షణసాహచర్య భూ
షితపదపద్మయై కరుణ ♦ చేఁ బలుదీవనలిచ్చి మానిరా
ట్సతి చనియెన్ దదీయగుణ ♦ సంజనితప్రమదాంతరంగయై.

ఉ. ఆనరనాథకన్యయది ♦ యాదిగ నీశ్వరపాదపంకజ
ధ్యానము సోమవాసరమ ♦ హోవ్రతచర్యయు శైవభక్తస
న్మానము విప్రదంపతిస ♦ మాజసపర్యయుఁ భక్తిఁజేయుచున్
మానుగఁ గాలయాపన మె ♦ నర్చుచునుండెఁ బ్రమోదమూనయై.

ఉ. అంతటఁ జిత్రవర్మమను ♦ జాగ్రణి యర్ఘ్యగుణాభిరామ సీ
మంతిని యాత్మనాయకస ♦ మాగమయోగ్య నవీనయౌవనా

క్రాంతి నితాంతముం దనరఁ ♦ గాంచి నిజాప్తజనంబుతోడ నే
కాంతమునందు నిట్లనియె ♦ నంచితనీతివివేకసంగతిన్.

క. సీమంతినీకుమారిక, భామాజనతామతల్లి ♦ పరిణయయోగ్య
శ్రీమహిమ వెలయుచున్నది, యీమగువకుఁ దగిననాథుఁ ♦ డెవ్వండనియెన్.

ఉ. ఒక్కగుణంబుగల్గ మఱి ♦ యొక్కటి తక్కువగాని యన్నిటం
జక్కనయైనవాని మహి ♦ దక్రమునం బరికించి కానరాఁ
డెక్కడ నున్నవాఁడొ హరి ♦ లోకరక్షకుం డగు రాజనందనుం
డక్కట పద్మసంభవుని ♦ యానతి యెట్టి ప్రకారమయ్యెనో.

సీ. ఘనకులీనత్వంబు ♦ గలవాని కిచ్చిన, జనియించు నవమాన ♦ శంక యచట
లక్ష్మీకటాక్షులౌ ♦ లాతాలి కిచ్చిన, జరగు సపత్నికా ♦ శంక యచట
ససహాయసమరసా ♦ హసికి నర్పించిన, సంఘటించు వియోగ ♦ శంక యచట
శ్రుతిపారగమునకు ♦ శ్రుతునితోఁ గూర్చిన, పరఁగు వైరాగ్య ♦ శంక యచట
కన్యకెటువంటిసద్గుణ ♦ గౌరవమునఁ, జెలఁగుమగనికి నిల్లాలిఁ ♦ జేసిరైన
జనకుహృదయంబు ప్రమదలే ♦ శంబుఁ గనక, సంతతంబును సంశయ ♦ క్రాంతిఁ జెందు.

గీ. కమలతండ్రి కనేకథం ♦ గములుగల్గె, గిరిజతండ్రియు నాపదా ♦ కీర్ణుఁడయ్యె
గంగతండ్రియు నెదఁగళం ♦ కము ధరించెఁ, గన్యఁగన్నట్టివరుఁడు సౌ ♦ ఖ్యంబుఁగనునె

సీ. హిమవంతుఁడంత యు ♦ త్తమనీతినిధికన్య, కను విషాదాయత్త ♦ గా నొనర్చెఁ
గలశవారిధియంత ♦ ఘనుఁ డాత్మనందని, ననివారపదేశగా ♦ నాదరించె
రైవతుఁడంత ధా ♦ త్రినరయండు కుమారి, మోహనాకృతినొక్క ♦ మునకిచ్చె
వల పులోమునియంత ♦ బలవిక్రమాఢ్యుఁడు, సుతశతమన్యునం ♦ గతికిఁ జేసె
నాఁడు బిడ్డలఁ దగినచో ♦ టరసికూర్చ, నేరరెటువంటివారును ♦ నిటలనయను
నాజ్ఞ యేరీతి వర్తించెన ♦ ట్లుగాక, కలదెయొండైన నన్యప్రి ♦ కారఘటన.
అయిన మీబుద్ధిబలముచే ♦ నరయవలయు, నిఖిలగుణవతి సీమంతి ♦ నీకుమారి
కెనయనఁగఁజాలినట్టి రా ♦ జేంద్రతనయు, వలయగిరిమధ్యధారుణీ ♦ వలయమునను,

అయిన సవిశేషశేముషీవైశద్యవిద్యాప్రదీప్తులైనతదీయాప్తులందఱుం బలుతెరంగుల విచారించి యైకమత్యంబున నిట్లనిరి.

ఒకగుణము గల్గియుండ వే ♦ ఱొకటి వెలితి, గాక సకలగుణాధిక ♦ గౌరవంబు
నలిగి నీకన్యకెనయైన ♦ ఘనుఁడొకండు, దొరకెనఁతఁడెంచ నించువి ♦ ల్లునికె సాటి

ఉ. రంగదభంగకీర్తి నల ♦ రాజతనూభవుఁ డింద్రసేనుఁ డా
సంగరరంగసాహసవి ♦ శాలునకుం బ్రియనందనుండు చం
ద్రాంగదుఁ డంగనాజనన ♦ వాంగజమూర్తి నిజాంతరంగశే
షాంగమదోగ్రవైరినిచ ♦ యాంగదుఁ డెన్నఁదగుస్ ధరాస్థలిన్.

ఆ.వె. రత్నజాతులెల్ల ♦ రత్నాకరమునంద, నిలిపినట్టి నేర్పు ♦ కలిమి నేమొ
జగములందు గల్గు ♦ సుగుణంబులన్నియుం, నతనియందె నిల్పె ♦ నబ్జసూతి.

ఉ. దానపరాయణుండు ప్రమ ♦ దానవపంచశరుండు శాంభవ
ధ్యానవిధూతకల్మషుఁడు ♦ దర్పితశాత్రవగర్వభంజనుం
డానతరక్షణక్షమద ♦ యాపరిపూర్ణకటాక్షవీక్షణుం
డానృపసూతి నీసుతకు ♦ నర్హవరుండు ధరావరాగ్రణీ

గీ. లలితగతి మీఱు నెలకువె ♦ న్నెలకుఁ బోలె, వికసితంబైన విరికిఁ దా ♦ వికినిబోలె
ధీరుఁ డగు నింద్రసేనకు ♦ మారమణికి, నీసుతకు నర్హయోగంబు ♦ నిశ్చయంబు.

చ. అనుటయుఁ జిత్రవర్మ మను ♦ జాగ్రణి యాహితలోకవాక్యముం
దనహృదయంబు నేకగతి ♦ దారసిలం గడునుబ్బు నబ్బురం
బును నగుమోము దమ్మిఁ జిగి ♦ పొల్పు నిజంబుగఁ దెల్ప వారికి
ట్లనియె ననూనవాణిదన ♦ వారవధీరవరేణ్యవైఖరిన్.

గీ. అతులమతిలీల మీఱ మీ ♦ రన్న పలుకు, నస్మదాశయగతియు నై ♦ క్యంబు జెందె
నరయనిది పార్వతీయుమనో ♦ హరుననుగ్ర, హంబు తెరఁగింతె కానియ ♦ న్యంబుగాదు.

వ. అదికావున నట్లసేయందగుఁ దగినవారలం బాంచాలమహీభర్తసన్నిధికిఁ బనుప వలయునని సిద్ధాంతీకరించె నంతకమున్న సమున్నతతేజోవిరాజమానుండగు నింద్రసేనకుమారు నాకారలీలావిశేషం బశేషంబు నభ్యాగతజనులవలనఁ గర్ణానందంబుగా విని సీమంతినీకన్యయు దైవానుకూలంబున నమ్మహారాజనందనునియంద యమందానురాగంబు వహించె నట్టియెడ.

వనమయూరము. అంతట వసంతము దు ♦ రంతవిరహాంత
స్స్వాంతబహుచిత్తజవ ♦ సంతతిఁ గృతాంత
ప్రాంతవనికాంతరని ♦ రంతరలతాంతా
నంతశరకంతుజయ ♦ వంతము జెలంగెన్.

సీ. అతిజీర్ణపర్ణసం ♦ హతులకన్నను మున్న, రమణీనియుక్తకా ♦ ర్యములు జాఱె
బహుపల్లవాంకుర ♦ పటలికన్నను మున్నఁ, దరుణిచిత్తములహ ♦ ర్షములు వొడమె

సమునకోకిలవిరా ♦ వములకన్నను మున్న, యతనునిశంఖహుం ♦ కృతులు వినె
వితతశైశిరగుణో ♦ న్నతులకన్ననుమున్న, భామినీపరిణయకో ♦ వములు సెదకె
ప్రకటితవిజయసభాసుర ♦ ప్రసవజాల, కల్పితపురందవర్షంబు ♦ కన్నమున్న
విరహిణీబాష్పవర్షంబు ♦ నిస్తరిల్లె, నభినవంబైన యావాసం ♦ తాగమమున.

ఎ నవజాతవివిధప ♦ ల్లవజాతరుచివిలా, సము పల్లజసలకెం ♦ జాయగాఁగ
మదనభ్రమత్స్వంభ్ర ♦ మరమరీచిచయంబు, గళహాలాహలకాంతి ♦ కలనగాఁగ
బ్రస్యగ్రివిలసిత ♦ ప్రసవోచ్ఛలచ్ఛాయ, మహితవిగ్రహపాండి ♦ మంబు గాఁగ
నమితమరందపూ ♦ రముల యాసారంబు, పటుదయాపరుషవి ♦ భ్రము గాఁగ
సంచితాతామలక్ష్మిని ♦ త్యానపాయి, భూమిధరరాట్కుమారీల ♦ లాము గాఁగ
సకలభువనజనానంద ♦ జనకుఁడైన, మాధవుఁడు మాధవునిపోలెకు ♦ మహిమఁదనరె.

౨. సకలవియోగినీ ♦ జనబృందముల డెంద, ములఁగొందలపుసెకల్ ♦ మొలకలెత్తె
సుమజాలసముదయ ♦ త్సుమరందరసపూర, ములనవ్యకాసార ♦ ములు ఘటిల్లె
రతిజాని యతిజయా ♦ ర్జితమహోర్జితకీర్తి, కార్తికీచంద్రికల్ ♦ గాననయ్యె
మునిమానసజ్ఞాన ♦ కనజాప్తదీప్తి వా, మనికామహిమమహి ♦ మంబుఁగప్పె
నాశితములైన శమనది ♦ గ్జాతవాత, పోతములశీతమతిశయో ♦ ద్భూతమయ్యె
నఖిలఋతుజాలసామంతుఁ ♦ డగువసంతు, నంటియున్నవాఁగ్రిష్మ్మఁడు ♦ లైదునెపుడు

సీ. చండప్రిస్మూనకో ♦ దండప్రితాపపా, వకభీమధూమ ♦ వల్లిక లనంగ
ముహురలంకరణస ♦ మ్ముదితలతాంగనా, ప్రకటితాంజనకరం ♦ డిక లనంగ
మాధవస్వామిస ♦ మానీతవనరమా, ధృతనీలరత్నస ♦ తతు లనంగ
జాతిసుమాజాత ♦ సౌభాగ్యనిర్ధళా(రంభ), కృద్ధురితవా ♦ రము లనంగ
నఖిలదంపతిమానసా ♦ న్యోన్యనిబిడ, బంధకతణాభిలాషసం ♦ పన్నపద్మ
భవరచితనీలపట్టర ♦ జ్జువు లనంగ, భ్రమరపంక్తు లుదీర్ణసం ♦ భ్రమములయ్యె.

. విస్ఫురపమశేణు ♦ విసరకైతవముచేఁ, బహుమిగులం భసితతే ♦ పనము సంగి
రసలాలసాయత్త ♦ భసలకైతవముచేఁ, బ్రకటరుదాడిమా ♦ తిక లొసంగి
కలకంఠకులకుహూ ♦ కారకైతవముచే, రమణీయశైవమం ♦ త్రము లొసంగి
యాతతకిసలయ ♦ వాతకైతవముచే, లలితకాషాయచే ♦ లము లొసంగి
చైత్రనామకదేశిక ♦ చక్రవర్తి, వృద్ధతరులను నతికృపా ♦ వృద్ధివెలయ
జిగిదగినయట్టియొకవింత ♦ జిలువమెన్నఁ, బాశుపతదీక్ష యొసఁగెవి ♦ భ్రాజితముగ

చ. సరసవసంతగాయకుఁడు ♦ చారుగతిన్ గలకంఠగీతవి
స్ఫురణముఁ జూపుచో మిత్రులఁ ♦ బ్రోడతనంబున నెల్ల పల్లవో
త్కరములయందు రాగములు ♦ గన్పడఁజేయుచు మాటిమాటికిన్
గుసుమనోనికాయముల ♦ కుం గరుణించె రసాతిరేకమున్.

చ. సలలితచాతురిం దగుచ ♦ సంతకవిప్రవరుండు మత్తకో
కిలముఖవృత్తివైఖరులో ♦ గిన్ జనకర్ణసుఖప్రదంబులై
వెలయఁగఁ జేసి జాతులకు ♦ విస్ఫురణంబు ఘటింప లేమిఁ దా
నలికులకైతవంబునన ♦ పాపయశంబు వహించె నెంతయున్.

ఉ. అమ్మధుమాస(సమ్మదము ♦ యంబు)1 నృపాలతనూజహృత్సరో
జమ్మునఁ గ్రమ్ముకొన్న నృప ♦ చంద్రునియందు వినూత్నమైన రా
గమ్మను వారిరాశి పెరుఁ ♦ గన్ బరిపూర్ణవిధూదయోపమా
నమ్ముగ నెంతురంతనద ♦ నమ్మగుచింత నితాంతరాంతమై.

ఉ. అన్నృపసూతి శీతకిర ♦ ణాతతరూపవిలాస మెప్పుడున్
గన్నులఁ గట్టినట్లు మదిఁ ♦ గన్పడ వ్రాసినయట్లు చాలనా
సన్నతిఁ గన్నయట్లు తను ♦ సంగతిఁ గాంచినయట్లు స్వాత్మసం
ఛిన్నతనున్న చిత్తజుఁడ ♦ జేయముఁ గాఁదనమాయఁ బన్నఁగన్.

చ. పిలిచినఁ బల్కదోకల్కెడుఁ ♦ బిల్వకయున్నను బల్కుఁబల్కుఁదోఁ
జిలుకయటందునందకువ ♦ చిందును బద్యములందయంచు రా
చిలుకకు నెన్నడల్ గఱపుఁ ♦ జేతిక రత్నపుబొమ్మఁ బిల్చు నె
చ్చెలియని నెచ్చెలిన్ గదియఁ ♦ జేరదు కృత్రిమపుత్రికామణిన్.

ఉ. వీణియ కేలఁ బూన దొక ♦ వెంబడిఁ బూనినఁ గాని తద్గుణ
క్వాణము సేయఁ గైకొనదు ♦ గైకొనినన్ శ్రుతిరాగతీల వి
న్నాణము లేమియున్ గనదు ♦ నాఁటికి నాఁటికిఁ బంచబాణుఁ డ
క్షీణశరాలి నాటు తన ♦ చిత్తము మెత్తఁగఁ జేయుచుండఁగన్.

ఉ. సంగతిదృష్టిఁదన్ గెలువఁ ♦ జాలిన చంద్రకిరీటి నందమున్
నంగవిలాసవైభవస ♦ మగ్రతచేఁ దను గెల్చినట్టి చం
ద్రాంగదునందు నేఁడునన ♦ యంబును బ్రేమవహించె నంచు న
య్యంగజుఁడగ్గలో యనఁగ ♦ నంగనఁ జాలఁ గలంగఁ జేయఁగన్.

---

1 మాసనుదమ్మనృపాల (మూలము)

సీ బాష్పంబు వర్షరూ ♦ పము వహించుటెకాక, ఘటికలన్నియు నట్లు ♦ కానవయ్యె
శుభములన్నియు మహా ♦ శుభములౌటయెకాక, యభిలాషసంతతు ♦ లట్లయయ్యెఁ
గ్రీడలన్నియు విషా ♦ కృతివహించుటెకాక, ధైర్యంబు నటువంటి ♦ దారిమీఱె
వనజారిముఖులు దా ♦ వంబులౌటయెకాక, ప్రాసాదములునట్టి ♦ పగిది నుండె
నొక్కటిపగవ్వాని దానివే ♦ యొకటిగూడి, కలికిచిత్తంబు మిగులఁజీ ♦ కాకుపఱచె
నతనుదేవతప్రాతికూ ♦ ల్యంబునొంద, నన్నియును బ్రతికూలంబు ♦ లగుటయరుదె.

చ. తరుణి యుమామహేశ్వరుని ♦ దన్ దలకొల్పెడువేళ వారియు
ద్దతిమకుటాంచలంబుల సు ♦ ధాకరరేఖలు రెండుగూడి త
త్పరమదయాసుధారసము ♦ పైకొన నిండునటంచు నాత్మలోఁ
దరలతఁ గాంచురాకలకుఁ ♦ దాలఁగలేమి వసించు నేటికిన్.

సీ. మలయమారుతపాత ♦ కలనచేఁ జలయింప, నతిమేను లతయౌట ♦ సత్యమయ్యె
నిందుకోకలఁ జెంది ♦ కందుసుందరిమొగము, బరవిందమౌట యు ♦ థార్థమయ్యె
అలవసంతునిచేత ♦ నలయంగ నెలఁతయు, త్తమజాతి యనుమాట ♦ తథ్యమయ్యె
నళులకైయలుగంగ ♦ నబలచంపకగంధి, యన్న ప్రసిద్ధి సి ♦ ద్ధాంతమయ్యె
మదనుబలసుఖ పలుమాఱు ♦ నుచ్చరింపఁ, బణఁతిసౌందర్యలీల వి ♦ స్పష్టమయ్యెఁ
బరులు గావించునపకృతుల్ ♦ పరమపుణ్య, కరులకును భద్రకరములు ♦ గాకయున్నె

సీ. తెల్పురెచ్చటఁగన్నఁ ♦ బోలుపుమీఱు వితంద్ర, చంద్రాతపములంచు ♦ సంశయించి
నలువెందుఁబాచినఁ ♦ జలితాలికులసమా, కులకోకిలములందుఁ ♦ గలఁకఁ గాంచు
నెఱుపురెచ్చోటని ♦ రీక్షించినఁ బ్రఫుల్ల, పల్లవోత్కరమంచుఁ ♦ బరిహరించుఁ
బచ్చరెచ్చటనేత్ర ♦ పథము జెందిననది, చారకీరములంచు ♦ సంచలించుఁ
బద్మభవకల్పితంబౌ ప్ర ♦ పంచ మెల్ల, మదనబలరూపమేయంచు ♦ మదిఁదలంచు
నెనయనెడ లేనివిరహాబ్ధి ♦ నితడువేళఁ, బద్మలోచన యతిశయ ♦ భ్రాంతిఁ జెంది.

ఉ. ఆకలకంఠి యాకరణి ♦ నంగజసాయకజాలబాధిత
వ్యాకులచిత్త యయ్యును ని ♦ రాకులతం శితికంఠపాదసే
వాకలనంబు శీతకర ♦ పాదమహావ్రతరాజచర్యయుం
గైకొనియుండె నాత్మ నధి ♦ కంబగు భక్తిభరంబుమీఱఁగన్.

వ. అంత.

మ. ఒకపద్మాకరతీరభూమి నొకచో ♦ నుద్యానమధ్యంబునం
దొకచంద్రోపలసౌధసీమ నొకర ♦ త్నోద్యదగ్రపీఠంబుపై

నొకరాకానిశివేళయందు నొకకీ ♦ రోదారసల్లాప మా
నొకసంగీతకళానిరూఢి నొకరా ♦ గోద్యుక్తి వాటింపఁగన్.

గీ. ఎందునంతంతకును బల్ల ♦ వించుమోహ, మించుకయు నాపరాకుద్గ ♦ మించు ప్రేమ
మించు తనమానసంబు భ్రి ♦ మించుగతి న, లంచుతతినైంద్రిసేనీంద్ర ♦ లాదుచుండె.

మ. శశికాంతంబులరీతి సర్వవిరహి ♦ స్వాంతంబులుం నీఱుగాఁ
గృశపద్మాకరలక్ష్మివైఖరివియోగి ♦ శ్రేణి భీతిల్లఁగా
దశదిగ్వ్యాపినియైన దర్పకయశో ♦ ధాళాద్ధళీలీల నా
శశిబింబంబువితంద్రచంద్రికమహో ♦ సాంద్రాకృతిన్ మీఱఁగన్.

ఉ. కుందములందు నందముగఁ ♦ గ్రుమ్మరి ముమ్మరమైన కమ్మదా
విందిలకించు చెందొవల ♦ విందులకుం గడు మెచ్చి యచ్చటం
జిందులు ద్రొక్కి(తొక్కి)సర ♦ సీపరిశీలన మాచరించి యా
గందపుఁగొండ దెమ్మెరలు ♦ గ్రమ్మఁగ నుమ్మలికం బొనర్చుచున్.

గీ. చెఱకువిలుకాని బలుకాని ♦ కఱకు[1]టంబ, కములు తనయంగములు సురం ♦ గములు చేసి
మానధనమెల్ల హరియింప ♦ మగుడలేక, మనసు గడుఁ బేదరికము నొం ♦ దంద యాన

గీ. గుట్టు చెదరంగ ధైర్యంబు ♦ బట్టు వదల, వ్రీడతోఁ గూడి మానంబు ♦ నోడిపోవ
శాంతియునుఁ జెందమనసువి ♦ భ్రాంతినొందఁ, గాంతయిట్లనుదుర్దశా ♦ క్రాంతయగుచు

క. శిలయించుకైదువదొర, యలయించుం జెఱకువింట ♦ నదరంటంగా
నలిగీతముఁ గలిగించఁగ, నలిగీతము దాము శుకపి ♦ కాళికరంబుల్.

ఉ. గ్రక్కునఁగన్నచో విషముఁ ♦ గ్రక్కు నళిప్రకరంబు చందురులా
రక్కలు మేనికిన్ గడుఁజూ ♦ రక్కలు నిక్కముగాఁగ నక్కటా
వెక్కసమయ్యెఁ బంచశరు ♦ వెక్కసమానత రొండు లేక యీ
చిక్కనకెల్ల నామనసు ♦ చిక్కనహాయింక నేమి సేయుదున్.

ఉ. పువ్వులదవ్వులంనిలువ ♦ భూరిశరంబులు చేరఁ బోయినం
దవ్వపుఛాయలారయ న ♦ మందదళంబులు మేను సోఁకినన్
నవ్వులుగావు నామదిని ♦ నమ్మఁగరాదిఁక నేమి సేయుదో
యవ్వలరాజకాండములు ♦ నవ్వలరాజు దుచిప్రకాండముల్.

గీ. అనుచుఁ బూర్ణేందువదన యా ♦ యదన పదన, శరములకుఁ జంద్రకళసము ♦ తక్కరె
[ములకున్

1 టంకగములు (మూలము)     2 యథా మూలము.

గరము పాటీరమారుతాం ♦ కురములకును, గాక పెనుగాఁకతోడఁజీ ♦ కాకుసొంద.

ఉ: వాడిన మోము తీరు బల ♦ వంతపు కంతుని వింతదాడిచే
నోడిన యట్టి బీరమును ♦ నోలిమియున్నది లేక వ్రీడతో
వాడిన డెందమందమును ♦ సంగసకుం గనసైన సంతలోఁ
దోడిసఖీమణుల్ కలఁక ♦ తో వెఱఁగందిన మానసంబులన్.

గీ. అంపటులు గూడి యుడిరేమి ♦ సుందరాంగి, చందమొక వింతయైనదా ♦ చందమామ
యల్లు సురభిళ్లములు కాఁకఁ ♦ బెల్లుఁదల్ల, డిల్లుట నిజంబటంచు భీ ♦ తిల్లిరంత.

సీ. జడిగొన్న పూఁదేనె ♦ దడిసిన తేమావి, చివురులు సెజ్జగాఁ ♦ జేసెనొకతె
పెనుహిమంపు నీటఁదోఁ ♦ గిన చల్వగలకల్వ, విరులప్పయిని నిండ ♦ నెఱపెనొకతె
పుష్పోడి పచ్చకర్ ♦ పూరముతోడను గూర్చి, తఱుచుగా నామీఁదఁ ♦ బఱపెనొకతె
వెలజాలనీటితోఁ ♦ గలిపిన పన్నీరు, పెల్లుదట్టఁగ నందుఁ ♦ జల్లెనొకతె
తెలుపువెన్నెలలోఁ గల ♦ చెలువుగులుకు, కలికిజిగిపన్న వలివంపు ♦ వలువఁగట్టి
వలదువలదనఁ గొంగేలు ♦ బలిమిఁబట్టి, చెలువఁ జెలులైన పాన్పునఁ ♦ జేర్చెనొకతె.

సీ. పగబాలు కర్పూర ♦ సారంబుఁ గలిపిన, మృదుచందనము మేన ♦ మెత్తిమెత్తి
కలువపూఁదేనెతోఁ ♦ గలసిన పన్నీరు, సారెసారెకు మీఁదఁ ♦ జల్లిచల్లి
పరసలామజ్జక ♦ పనుదాయకృత తాళ, వృంతజాలములచే ♦ విసరివిసరి
పద్మస్సమానీత ♦ జలజనాళంబులు, వరహారలతలుగా ♦ వైచివైచి
మఱియుం బహుయత్నములు పూని ♦ మానవతులు, చాల శైత్యోపచారముల్ ♦ సంఘటింప
నంతకంతకు మదనబా ♦ ణానలమునఁ, గాంతమృదులాంగలత యతి ♦ క్లాంతయయ్యె.

సీ. ఘనసాంద్రగతి నలం ♦ దిన చందనపు గంధ, మూష్మయుక్తంబుగా ♦ నుడుకఁజొచ్చె
సెజ్జగాఁ గూర్చిన ♦ చిగురులన్నియుఁ వాడి, యతివిమర్దనతఁ జూ ♦ ర్ణితములయ్యె
నచితోపనీతంబు ♦ లయిన పంకజనాళ, హారవల్లులు దెగించి ♦ నట్లయుండె
హిమవారి గలిపి సాం ♦ ద్రములుగాఁ జిలికించి, నట్టి పన్నీరద్ర ♦ వ్యత వహించెఁ
జలువపనులెల్ల నీరీతి ♦ సలుపుచున్న, సతుల కరపల్లవంబుల ♦ చాయగలఁగె
ననమశరపావకక్రాంత ♦ రైన యట్టి, సుందరీమణి తనువల్లి ♦ సోఁకినంత.

వ. ఇవ్విధంబున.

చ. వనితకునంతనంత బల ♦ వంతపువెట్టల మేననెత్తుకొ
న్నను చలికత్తెలెల్ల వది ♦ నాయక సాయక తాపమంతయున్

మన శిశిరోపచారముల ♦ మానుపఁబూనుటయెల్ల నెన్నఁగా
ననలము నాజ్యధారఁ జెగ ♦ టార్పఁదలంచు ప్రకారమయ్యెడిన్.

క. యిందుకుఁగర్త మరుండ, య్యిందుసురభిమందపవను ♦ లీతనికిఁ జెలుల్
సుందరి నూరక యందఱుఁ, గుందించెదరనుచు మివ్వులఁ ♦ గుపితాత్మకలై

సీ. ద్విజరాజమౌళిపైఁ ♦ దివిరి నిహారకిరణం, బడిదమెత్తిన పాత ♦ కాత్ముఁడొకఁడు
తనసహోదరి యింటి ♦ ఘనతరశ్రీయెల్లఁ, గొని ప్రకాశమునొందు ♦ క్రూరుఁడొకఁడు
విదితవనప్రియు ♦ ద్విజరాజి వంచనా, క్రాంతగాఁ జేసిన ♦ ఖలుఁడొకండు
మొదలనావాన్యనెదిరి ♦ పాంథులకప, కారంబుసేయు దు ♦ శ్చారియొకఁడు
మదనకుము దాప్తమధుమాస ♦ మందపవన, సంజ్ఞఁగలవీరు పరమదు ♦ ష్కర్మరతులు
భూరివిరహానలంబుచేఁ ♦ బొదువఁబడిన, సఖియఁగలఁచుట కొకయింత ♦ సంశయంబె.

క. తనుజాతుఁడవై మన్మథ, దనుజాతునిరీతి పలుపఁ ♦ దగునే సతులన్
దనుజాతమైన రోగము, తనుధారులవలఁదు నడియుఁ ♦ దథ్యంబుసుమీ.

సీ. చపల(తా)పాశప ♦ కుమ్మగు నీయశ్వ, (మపు)రూపమగు నీశ ♦ రాంగకంబు
భువనౌఘచరణవి ♦ స్ఫూర్తి నీదుపతాక, బహుళజన్మరతి నీ ♦ సహచరుండు
మధుపానసముదితో ♦ న్మాదంబు నీనారి, ఘనరజోయుతము నీ ♦ కార్ముకంబు
నియతవైషమ్య(మా ♦ నిన) సాయకంబులు, పంచమాన్వితము నీ ♦ బంట్లమూఁక
భావసంభవ యిటువంటి ♦ పరికరంబు, గుణసమగ్రంబుగా నేర్చి ♦ కూర్చుకొన్న
నీకు నీకుటిలాలకా ♦ నీకములకు, నార్తిగావించు పనియేమి ♦ యబ్బురంబు.

గీ. మదనయెదసోకినంత నీ ♦ మనుజతతుల, మతులు వేఁదుటఁ బుట్టించు ♦ మదనమునకు
నీకునొకపేరు గల్పించె ♦ నిఖిలదిశల, నబ్జభవునేర్పు వర్ణనీ ♦ యంబుగాదె.

క. కాంతారచాపుఁ డాతఁడు, కాంతాతాజిం గలంచెఁ ♦ గాక వధూటీ
సంతానములకు నేటికి, సంతాపము జేసెదవువ ♦ సంతానీవున్.

ఉ. మత్తిలి యోవసంత పలు ♦ మౌనులు మానుగఁ దావకీనదు
ర్వృత్తియెఱుంగ కేకరణి ♦ వేఁడుటఁగాంచినఁ గాంచెఁగాక యా
యుత్తమజాతి వృక్షముస ♦ మున్నతి బూయక కాయకెంతయున్
రిత్తయియుండి నీగుణగ ♦ రిష్టత యెల్లనుఁ జాటిచెప్పెదే.

సీ. అత్యంతతాపస ♦ మన్వితంబై రిక్త, సరసులతోడ గ్రీ ♦ ష్మంబునిలిచె
వనవృత్తి యేప్రొద్దుఁ ♦ గనికమలోల్లాస, విరహితంబై వర్ష ♦ వేళయుండె

జీవనాల్పతచేఁ గృ ♦ శించిన వాహినీ, సముదయంబుల శర ♦ త్సమయమున
గళితమితోర్మిస్మేష ♦ కలుషమై ప్రతిదినా, క్రాంతకార్శ్యంబు హే ♦ మంతమందు
విపులజడమయ్యె శిశిరంబు ♦ మేలుమేలు, తేజమున నీవు సకలర్తు ♦ రాజవైన
యంతనే వంతకాంతాజ ♦ నాంతరంగ, కృంతనము సేయువింత నీ ♦ కెంత భరము.

ఉ. మాధవుఁడీ ధరన్ మును ప ♦ మస్తపలాశచయంబుఁ గూల్పఁగా
బాధయణంగి లోకములు ♦ బ్రస్ఫుటసమ్మదవృత్తిఁ గాంచె నీ
మాధవుఁ డాదరంబున ప ♦ మస్తపలాశచయంబుఁ బెంపఁగా
బాధ జనింపదే భువన ♦ పంక్తులకెల్లను వేయు నేటికిన్.

ఆ.వె. మధుమాధవుఁడును ♦ మాత్సర్యమొనరింప, జగములెల్ల నిలిచె ♦ శంకలేక
మనుజతతికి నేఁటి ♦ మధుమాధవైక్యంబు, నియతి వైపరీత్య ♦ నిరతిగాదె.

క. ఆమని కామని గానీ, కాముని కామన్న యుడతు ♦ గానీ చెలివై
నేమంబుం గినిసెదు నీ, వే మంచుం జాయలయ్య ♦ వీయెడఁ జంద్రా.

చ. జలజముగాదు సెప్ప్రెగము ♦ చక్రయుగంబిదిగాదు రోరుహం
బులయుగళంబు శాత్రిశ్రుల ♦ పొందొనరించె నటంచుఁ గాంచి చం
చలనయనం గలంచుటకు ♦ సారెఁ దలంచెదవింతయేటికిన్
వొలఁగుతొలంగు మిచ్చటఁ బ్ర ♦ దోషవిజృంభిత యోనిశాకరా.

చ. గురుతరయుక్తిచేఁ బ్రియులఁ ♦ గూడిన వీడిన వారిచెంతలం
గురియుటకేసుధారసము ♦ ఘోరవిషంబును రెండుగూర్చె దహా
సరసిజసూతి నీతనువు ♦ సల్పినవాఁడు మృగాంక కానిచో
నిరవుగఁ జెల్పువల్పులవి ♦ యేటికి నీయెడఁ గానవచ్చెడిన్.

ఆ.వె. గరళమూర్తివౌటఁ ♦ గాంతాజనంబుఁ, గలఁచెదీవు కల్ల ♦ గాదు చంద్ర
అమృతమూర్తివైన ♦ నమృతాంధసులు నిన్ను, మెసఁగినఁ గూడ నుద్భ ♦ వింతువేల.

గీ. పద్మినీజాతి లక్షణ ♦ ప్రౌఢఁ గాంచి, విధుమధులు కాంతఁ గలఁగించు ♦ విధముగల్గెఁ
బ్రాణమైయుండి మలయాద్రి ♦ పవన నీవు, కలికి నలయింప నేల ని ♦ ష్కారణంబు.

సీ. దివిజుల కందజాల గల్గ ♦ భువనభీకరుఁడైన, శిఖికి నిత్యముఁ బ్రాణ ♦ సఖుఁడవౌట
దశదిశల్ గలుగ నం ♦ తక నిరంతరనిశాం, తదిశాంతవిహరణో ♦ త్సాహివౌట
ప్రాణులెల్లెడఁ గల్గఁ ♦ బ్రత్యగ్రిగరళోగ్ర, జంతుసంతతి భో ♦ జనమవౌట
వివిధసూరులు గల్గ ♦ భువనోపకారవి, స్ఫురితమాజలదంబుఁ ♦ బోనడఁచుట

యాదిగా మీయునికితు ♦ లరసి చూడ, మందపవనకిశోర యీ ♦ మందగమన
యందుఁ గినుకందు దురితంపుఁ జగడంబు వొందు, చంద మెందుఁ దుఁ యాశ్చర్య ♦ చర్య యౌను

గీ. చలువ వెదచల్లు కల్లని ♦ చ్చలువహించి, యానివాఁడవు వేఁడిగ ♦ ర్భాంతరమున
భవుఁ డుదరసంభవుండైన ♦ పావకుండు, మాకు నెఱిఁగి చుచున్నాఁడు ♦ మందపవన.

ఉ. చందనకోటరాంతరని ♦ శాంతములందునె సంచరించి యా
యిందువతంసు హారముల ♦ హీనవిషంబుల మీఱుక్రూరగప్రం
జంద మమందబుద్ధిబల ♦ సంయుతులూహ యొనర్చి రేనియున్
మందసమీర నిన్నుఁ బలు ♦ మారు మెసంగిన దోసమయ్యెడిన్.

మ. మలయవ్యాప్తిఁ జెలంగి యీవిరహులం ♦ మర్దించుటే కాక య
మ్మలయవ్యాప్తి నెనీ విశేషభువనో ♦ న్మాదంబుఁ గావింపఁగాఁ
గల వింకమ్మలయానిలంబ మిపులం ♦ గారుణ్యాహైన్యంబుఁ జేఁ
జెలియం జాలిరె యేతదర్థము మహా ♦ ధీమంతులౌ వారలున్.

క. అనికాంతకంతకంతకుఁ, దనువల్లికయందు నతను ♦ తాపభరమునం
జనితముగఁ జకితమృగలోల్, చనలందఱుఁ గూడి యధిక ♦ చకితాత్మకలై.

శా. వేలుపులం గనుంగొని ప్ర ♦ వీణతచే నతియాదరింపు చు
ద్వేలదయావిలాసమున ♦ వేఁడిన యర్థము లెల్ల నియ్యఁగాఁ
జాలుదురింతె గాక మతి ♦ చాలక నిందయొనర్చు బాలకున్
జాలియ చాలఁ గూర్చితిమి ♦ చాలు నికన్ నుతిసేయఁ గాఁదగున్.

గీ. అనతాఖిలజనతాఖి ♦ లార్థజాల, దాయకాయ రతిప్రాణ ♦ దాయకాయ
ముఖ్యయోగిసమూహావి ♦ మోహసంవి, ధాయకాయ నమఃపంచ ♦ సాయకాయ.

సీ. ఇంద్రియంబుల నేల ♦ యేలఁజాలు వివర్థ, మానచాంచల్యమా ♦ మానసంబు
మాధురీధుత నేలఁ ♦ మలయఁబర్వంగృహ్యా, తారూఢిఁ గన్న కాం ♦ తాకరంబు
నిరతమిందిరకు మం ♦ దిర మేలయగుఁబెఁక, జాతస్వరూపత ♦ సరసిజంబు
ధర జగత్ప్రాణమై ♦ పరఁగు నేలప్రభంజ, నారూఢిఁ గలమంద ♦ మారుతంబు
హృదయసంభవ నీపుట్టి ♦ నిల్లువిల్లు, కాండము రథపరికాండము ♦ గాకయున్న
నున్నతి లభించినన్నె నీ ♦ వున్నచోటఁ, గన్నె భాగ్యంబు చిన్నెలే ♦ కరణిఁ గాక.

ఉ. గారవియింబు రారికిన ♦ ఖండితరాగభరంబుఁ బూనె నీ
నేరుపు చూపఁగాఁ గద జ ♦ నింజెషడాననుఁ డాపరితాపవి

స్తారకుఁ దుగ్రతారకవి ♦ దారకుఁడై కనుపట్టె నంతటం
గారణమీవ నీవలనఁ ♦ గా జగముల్మనియెన్మనోభవా.

సీ. కరికుంభముల యానఁ ♦ గడిసి కాంతాజన, స్తనకుంభముల యానఁ ♦ దరుమలేరు
జిగికెంపుగమికోరెలఁ ♦ దెగడి నెచ్చెలులు, కెమ్మోవికెంపుల కోరెలఁ ♦ ద్రావలేరు
భూమిపైఁ గామంబు ♦ పోఁడోలి బాలికా, కటిభూమికామంబు ♦ గప్పలేరు
వసనాభిలాషంబు ♦ వదలికాంతానంత, వసనాభిలాషంబు ♦ వంపలేరు
కలుములకు రోసిరైనను ♦ కంజముఖులు, చెలువములకురోయరీ పాణి ♦ కులములన్న
గరిడిహరితీవ్రతురగ నీ ♦ యుంచకముల, గములనగు భంగములప్రసం ♦ గములఁగాడ

క. వరబుధగణసామంతా, చిరబాంధవపక్షదయాను ♦ స్మృతరతికాంతా
పరితోషితవిపినాంతా, సరసాకృతిగుణనిశాంత ♦ శరణు వసంతా.

ఆ. వె. సురభివీవు సర్వ ♦ సుజనార్థసందోహ
దోహనంబు నీకు ♦ దొడ్డతనమె
మాధవుండ వీవు ♦ మహియెల్లరక్షించు
నాదరంబు నీకు ♦ నబ్బురంబె.

సీ. కిసలయోత్కరసము ♦ ల్లసనకారివి నీవు, కిసలయాధర యీస ♦ ఖీలలామ
సముదాలిసముదయ ♦ ప్రమదకారివి నీవు, సముదాళిచికుర యీ ♦ చంచలాక్షి
సుమజాలవికసన ♦ స్ఫురణకారివి నీవు, సుమకోమలాంగి యీ ♦ కమలగంధి
మేదురపికకుహూ ♦ నాదకారివి నీవు, పికవాణి యీచంద్ర ♦ బింబవదన
ఘనంగనకు నీకు నిన్నిటి ♦ రైన బాంధ, వమ్ము చెలువమ్ము వమ్ముగ ♦ మమ్మరంపు
టలజడి యొనర్ప నేర్పుచే ♦ నాననేల, యూరకీవింత నీవింత ♦ యో వసంత.

పంచచామర. రసాలముఖ్యసాలరాజి ♦ రాజిలంగఁ జేయు సు
ప్రసన్నమూర్తి యెల్లమాని ♦ పద్మపాణి చెంత నీ
వసహ్యవృత్తిఁ దాల్పనేల ♦ యా దయాలవాలయో
వసంత నీవు సంతసించి ♦ వారిజాక్షిఁ బ్రోవుమీ.

సీ. సముదితానంతసం ♦ తమసదంతావళ, హింసావిలాసమ్ము ♦ గెంటబ్రి చంద్ర
1 యమరాళసార్థను ♦ నాయాసపరిహారి, సత్కళాసముదాయ ♦ సాంద్రచంద్ర
తరణికరగ్లాన ♦ ధరణిసౌఖ్యావహం, చత్సుధాకరణని ♦ స్తంద్ర చంద్ర
నిజచంద్రికాసము ♦ న్మేషవిశేషప్ర, సారనిర్జితనవ్య ♦ చంద్ర చంద్ర

---

1 యమిరాశాసాయకు ♦ నా (మూలము)

సకలజగదేకకల్యాణ ◆ జనకపద్మ, మందిరాసోదరత్వసా ◆ మర్థ్యరచిత
బంధురస్యాలభావసం ◆ బంధవర్ధనరత, సంతోషితోపేంద్ర ◆ శరణు చంద్ర.

చ. అమృతపయోధియందుదయ ◆ మందిన యుత్తమవృత్తి గాకయో
యమృతమయూఖ లోకనిక ◆ రావనపావనసత్కృపామృతం
బమితముగా వహించిన ము ◆ రాసురవైరిమనంబునందు జ
న్మము గనినట్టినీకుఁ దగు ◆ నామృగనేత్రలనింత సేయఁగన్.

క. వందేశ్వామ్రలయాచల, కందరచరదమరయువతి ◆ కచనిచయాంతా
మందేతరపరిమళభర, మందాగాంతరవిహార ◆ మలయసమీరా.

పంచచామర. అమంద [1] చందనాద్రికాన ◆ నాంతసారసౌరభో
ద్గమంబుఁగందునన్న యట్టి ◆ గట్టి యాస విూఱనో
సమీర దోసమీరతీశ ◆ సాయకానుసారతం
గుమారి దైన్యవార్ధిముంచు ◆ కోపముంచు టారయన్.

ప్రాణమును నీవు ప్రాణిసం ◆ త్రాణకరణ, జీవనము నీవజీవన ◆ శ్రీకినధిక
పావనము నీవ యీజగ ◆ త్పంక్తి కాని, కారణము నీవ వివరింప ◆ గంధవాహ.
యీవు సారంగయానుండ ◆ వెంచిచూడ, రాజముఖియును మత్తసా ◆ రంగయాన
గంధవహ యిట్లుభేదంబు ◆ గలుగుచుండ, నీవు చలియింపఁ జలియించు ◆ నీరజాక్షి.

ఆ. వె. అనుచు వనితలెల్ల ◆ నబలామనోభవ
గ్లాని మానుకొనుటఁ ◆ బూనియిట్టుల
మదనసురభిచంద్ర ◆ మలయమారుతములఁ
జేరి ప్రార్థనంబు ◆ సేయుచుంత.

ఆనృపకన్యకమదిఁ గా, మానలమొకయింత శాంత ◆ మగునట్టు గనన్
మానవతులెల్ల నతిశయ, తానందము వొందుచుండి ◆ రాసహయసునన్.

. ఫాలాభీలవిలోచనాంతరశిఖ ◆ ప్రవ్యక్తకీలావళీ
హేలానిర్జితపంచసాయక సుతా ◆ ధీశాదిసంసేవితా
ప్రాలేయాద్రిసురాపయోధరతటీ ◆ పాటీరపంకాంకిత
శ్రీలాలిత్యమహాభుజాంతర ముని ◆ శ్రేణీమనోభావితా.

శరణాగతభరణ సుధా, శరణాంకిత దుర్జయోగ్ర ◆ సామజ దైత్య
స్మరణహర శూలసాధన, భరణా భుజగాధినాథ ◆ పాదాభరణా.

1 చందనాద్రిసదృశా.

స్రగ్విణి. దీనభక్తప్రజా ♦ ధీనిస్సంశయ
ధ్యానలీలానుషం ♦ ధానశస్త్రానిషం
తానసర్వోన్నత ♦ స్థానదానక్రియా
నూనకారుణ్యపు ♦ ణ్యోదయాభ్యున్నతా.

గద్య—ఇతి శ్రీశైల-నివాస భ్రమరాంబా సమేత మల్లేశ్వరస్వామి కృపాపాత్ర
భారద్వాజ గోత్ర పవిత్ర పెనుమళ్ల సోమమంత్రి పౌత్ర పెద
నీల ప్రధానపుత్ర సకల సుకవి స్తుత్య సోమనామాత్య
ప్రణీతంబైన సీమంతినీకళ్యాణం బనుమహా
ప్రబంధంబునందు ద్వితీయాశ్వాసము.
ఏతత్సర్వం శ్రీసదాశివబ్రహ్మార్పణమస్తు.

శుభమస్తు.

అవిఘ్నమస్తు.

శ్రీసదాశివాయనమః.

# సీమంతినీకల్యాణము.

## తృతీయాశ్వాసము.

శ్రీమానసప్రియోదిమ, హేమానితవైభవోద ♦ యశ్రీశైల
శ్రీమద్భ్రమరాంబాని, స్సీమప్రియతానివేశ ♦ శ్రీమల్లేశా.

వ. అవధరింపుము.

గీ. రజనికడచని వాసరా ♦ రంభమైనఁ, జిత్రవర్మావనీనాథ ♦ శేఖరుండు
కల్యకృత్యంబులెల్ల సా ♦ కల్యరీతిఁ, గడపి యేకాంతమున బంధు ♦ గణముఁ దాను.

వ. సుఖాసీనుండై తనతనయ వృత్తాంతంబు తదీయసఖీజనంబులవలన నాకర్ణించి వైవా
హికకార్యంబున సంతసించి యిట్లని యాలోచనంబుచేసె.

ఉ. మామకమానసంబు హిత ♦ మంత్రిజనంబు నుదాత్తచిత్తచ
ర్యామహిమంబు నేకవిధ ♦ మై కనుపట్టిన నంతెకాక యీ
తామరసాక్షి డెందమును ♦ దాదృశమాట గిరీంద్రకన్యకా
స్వామికటాక్షదృష్టికిని ♦ సాక్షిగదా వివరించిచూచినన్.

గీ. అటులఁగావున నింద్రసే ♦ నాత్మజునకుఁ, గుటిలకుంతలఁ బెండ్లిసే ♦ యుటశుభంబు
వారిచిత్తంబుఁ దెలియక ♦ వారిజాక్షి, నిత్తుమనరాదు కర్తవ్య ♦ మెద్దియింక.

ఉ. చారులచేత నమ్మనుజ ♦ చంద్రునిచిత్త మసంశయంబుగా
నారసికాని మానవతి ♦ నర్పణసేయుటఁ దెల్పరాదు పరి
జ్ఞారతిచేఁ బరేంగితము ♦ చందమెఱుంగఁగఁజాలు వారి నేఁ
డారసికాగ్రయాయి పురి ♦ కంపుట తెప్ప రహస్యవైఖరిన్.

వ. అని తాదృశ్విధయత్నంబునందు నత్యంతజాగరూకత్వంబు వహించి నంతకమున్న
యకడ.

గీ. నలతనూభవుఁ డింద్రసే ♦ నప్రభుండు, తనయుని వివాహకార్యయ ♦ త్నముఁ దలంచి
మంత్రియుతుఁడై విచారించి ♦ చిత్రవర్మ, నృపతనయ నర్హకన్యగా ♦ నిశ్చయించి.

మ. చతురపురోహితద్విజుల ♦ సమ్మతిసంయుతులైన మంత్రులన్
హితకరులైన బాంధవమ ♦ హీపతులం బిలిపించి వారితో
నతిశయకౌతుకామృతర ♦ సానుభవంబును జిత్తవృత్తియం
దనితిని వహింప నిట్లనియె ♦ నవ్యవికాసముఖారవిందుఁడై.

సీ. అఖిలదేశములనా ♦ ర్యావర్తదేశం బ, శేషకల్యాణల ♦ క్ష్మీప్రదంబు
రాజులం దెల్ల ని ♦ రాజగుణాఢ్యుఁడౌ, చిత్రవర్మనృపాల ♦ శేఖరుండు
దీపితదానప్ర ♦ తాపసాధుక్రియా, ర్జితమహోర్జితకీర్తి ♦ చేఁ జెలంగె
నామహీధవు పుత్రి ♦ సీమంతినీకన్య, ధన్యచారిత్ర సౌం ♦ దర్యధుర్య
అమ్మృగీశాబనయన చం ♦ ద్రాంగదునకుఁ, బరిణయంబొనర్చుటకు మనః ♦ పద్మసీమఁ
వలఁపు జనియించె నిదియె యు ♦ క్తంబుగాఁగ, నెంచి మతిమంతు లంగీక ♦ రించినారు

వ. అదిగావున.

క. ఆర్యావర్తమునకుఁ జని, కార్యవిదుం జిత్రవర్మఁ ♦ గనుఁగొని యేత
త్కార్యము ఘటియింపఁగఁదగు, నార్యులు మెచ్చఁగ ధీస ♦ మన్వితులగుచున్.

ఉ. అని పయనంబొనర్చి నృపుఁ ♦ డంపినవారును గార్యసిద్ధిసూ
చనశకునాధికంబులు ప్ర ♦ సన్నమతిం గనుఁగొంచు వేడ్కతోఁ
జనిచని కాంచిరగ్ర్యమణి ♦ సౌధమరీచివిచిత్రచిత్రభా
జనమగు చిత్రవర్మనృప ♦ చంద్రుని వాసపురాధిరాజమున్.

వ. ఇట్లు గాంచి తదీయసౌభాగ్యలక్ష్మీవిశేషంబులు వైచిత్రిఘటింపంజని రాజగృహ ద్వారంబు చెంతనిలిచి దౌవారికులచేతం దమరాక నెఱింగించిన నతండు నిబ్బరంపు టుబ్బుతంబుతో నుబ్బు మనంబునం బెనఁగొన వారిరావించి సత్కారపూర్వకంబుగా నుచితాసనంబుల నుండనియమించి యిట్లనియె.

గీ. ఇంద్రసేనుండు కుశలస ♦ మేతుఁడే త, దాత్మజుఁడు సౌఖ్యయుతుఁడె చం ♦ [ద్రాంగదుండు
వారివారికి శుభ మని ♦ వారితంబె, యతనిభూభాగమునకు ని ♦ రామయంబె.

వ. అనిన వారును సవికాసముఖారవిందులై మృదులవచనరచనాచాతుర్యంబుచేత నతని కిట్లనిరి.

క. శుభమహోన్నందతికిని, శుభయుతుఁడైనట్టి నిన్నుఁ ◆ జూచితిమిఁక నో
శుభగుణరత్నాలంకృత, శుభపారంపరలభించు ◆ సుస్థిరరీతిన్.

ఉ. నిచ్చలునుం దుషారధర ◆ ణీధరకన్యకచిత్తమంతయున్
మ్రుచ్చిలు వేల్పురాయని స ◆ మున్నతభక్తి భజించు నీసము
ద్యచ్చరితంబు మాటికి గృ ◆ హాగతకోటిప్రశంస సేయఁగా
మెచ్చినవాఁడు మానృపతి ◆ మేదురతావకభాగ్యలీలకున్.

చ. అవిరళకీర్తి నైషధనృ ◆ పాగ్రణి నీగుణరత్నజాలముల్
చెవులకుఁ జారుభూషణవి ◆ శేషములై ప్రమదంబొనర్పఁగా
భవదనవద్యమూర్తి యుత ◆ పంచశరప్రతిమానరూపవై,
భవరమచేతఁ గన్నులకుఁ ◆ బండువ సేయఁదలంచు నెప్పుడున్.

చ. అవనిపలోకశేఖర య ◆ నంతగుణత్వము నీకునద్ధరా
ధవునకునిక్కమై యచల ◆ ధర్మతయుం దగుమీరలిద్దఱున్
వివిధజగన్నికాయనుత ◆ విశ్రుతవైఖరి మీఱఁగూడినన్
శివకరలీల మిక్కిలివి ◆ శేషగతి న్విలసిల్లుచుండెడిన్.

గీ. నీకు యోగ్యంబు పాంచాల ◆ నృపతి చెలిమి, యతనికర్హంబు నీదుస ◆ ఖ్యంబు కలిమి
శబ్దమర్థసమేతమై ◆ చాలవెలయు, నర్థయోగంబుచే శబ్ద ◆ మలరుచుండు.

గీ. అతఁడు తనపుత్రుఁడైన చం ◆ ద్రాంగదునకు, నర్హకన్యను బెండ్లి సే ◆ యంగఁదలఁచు
చేసి మీతో విచారంబు ◆ సేయుమనుచుఁ, బనిచె నీసన్నిధికి నన్నుఁ ◆ బార్థివేంద్ర

గీ. అతఁడు నీయందు చెలికార ◆ మాదరించి, పంపె నీవును దన్మైత్రి ◆ వాటిలంగ
నార్యవర్ణితచరిత యా ◆ కార్యమునకు, విమలమతి నిర్ణయంబుఁగా ◆ వింపవలయు.

వ. అదియునుంగాక.

ఉ. అంగజవైరిపాదముల ◆ యందుఁ జలింపనియట్టి గట్టిప్రే
మం గలమీరలిద్దఱు స ◆ మానులుగావున నీకుమారిఁ జం
ద్రాంగదుతోడఁ గూర్చిన స ◆ మస్తగుణంబుల సానుకూల్యమా
సంగతిఁ జంద్రచంద్రికల ◆ సంగతితోఁ దులదూఁగఁజాలెడిన్.

క. రూపమున సద్గుణమున న, వోపగతవయోవిలాస ◆ యోగంబున మీ
పాపకును నింద్రసేనకు, భూపాలకుమారమణికి ◆ నీడగు ననఘా.

ఉ. చక్కని రూపమొక్కటి ప్ర ◆ సన్నగుణోన్నతిలీల యొన్నఁగా
నొక్కటి యౌవనోదయము ◆ నొక్కటి చంద్రికళాకిరీటిపై

మఱికృశసేయుటొక్కటి స ♦ మస్తవిధంబులఁ జూడనీడగున్
నిక్కము నీకుమారికకును ♦ నీతివిహారికి నైంద్రసేనికిన్.

క. అన నెమ్మనమునఁ బెనఁగెడు, ననుమోదాశ్చర్యభరము ♦ లాస్యకమలసం
జనితస్మితలీలావిక, చనమునఁ బ్రకటములు గాఁగ ♦ జనవరుఁడంతన్.

క. ఇదియత్యంతాశ్చర్యము, గద మహాకార్యంబయత్న ♦ ఘటితంబయ్యెన్
మదనారి యింతనాపై, సదయుఁడగునె యనుచుఁ బులక ♦ సంగతతనుఁడై.

గీ. ఇంద్రసేనవసుంధరా ♦ ధీశు కీర్తి, వినదుమెప్పుడు వీనుల ♦ విందుగాఁగ
నతనిమంత్రుల మిముఁగన్న ♦ నంతకన్న, నతిశయానంద భరమయ్యె ♦ నాత్మయందు.

క. నలరాజవంశకరుఁడగు, నలరాజుం సాటిగాక ♦ యానృపమణితో
నలఘుతరసద్గుణంబుల, నిలరాజులు సాటియగుదు ♦ రే వివరింపన్.

గీ. అతని మాయెడవింతయెం ♦ తైనవలువ, దట్టియిష్టంబు నిషధభూ ♦ మీశ్వరునకు
నదియ మాకును బ్రియతమం ♦ బగుచునుండ, మాటలిఁక వేయునేటికి ♦ మంత్రులార.

వ. అదియునుంగాక.

క. సీమంతినికర్హవరున్, మేము విచారించునపుడ ♦ మీవచ్చుటయు
న్నామశుభకారణంబని, నామది నిశ్చయముగ దో ♦ నయవిదులారా.

గీ. ఇంద్రసేనున కనురాగ ♦ మెచటఁగల్గె, మాకునచ్చోట మిత్రులఁ బ్రే ♦ మను జనించె
నీరజాతాక్షిసీమంతి ♦ నీవధూటి, నర్పణము సేయువాఁడఁ జం ♦ ద్రాంగదునకు.

చ. అని హితబంధురాజికిని ♦ నంతిపురంబుననున్న వారికిన్
దన తనయాలలామమును ♦ నైషధసూనునకిచ్చు కార్యవ
ర్తనమెఱుఁగంగఁ జేయ నుచి ♦ తంబు చితంబిది యంచుఁ బల్కి యా
యనుపమకార్యసంఘటన ♦ కందఱుఁ జెంది రతిప్రమోదమున్.

ఉ. లాలితభాగ్యయోగ్యశుభ ♦ లక్షణుఁ డానృపవర్యుఁడంతఁ దాం
చాలునిమంత్రివర్యులఁ బ్రి ♦ సన్నమతిం దగసత్కరించి తాం
బూలనవీనచేలమణి ♦ భూషణముఖ్యసమస్తవస్తులన్
జాల నొసంగి యిట్లనియె ♦ సమ్మదయుక్తి నిజాంతరంగుఁడై.

ఉ. సంతతసౌఖ్యదంబిది వ ♦ సంతము లెస్స వివాహదీక్షక,
త్యంతవిలంబ మేటికిఁక ♦ నర్హముహూర్తముఁ జూచి నిశ్చల
స్వాంతతఁ బెండ్లికింగదలి ♦ వచ్చుట యుక్తమటంచు మీధరా
కాంతునితో సవిస్తరము ♦ గా వివరింపుము కార్యమంత్రియున్.

క. అని వారిఁ బనిచి భూవిభుఁ, డనివారితహర్షమునఁ బు ♦ రాలంకారం
బొనరింప నాజ్ఞ లిడియెం, దనమంత్రుల కుచితకార్య ♦ తత్త్వజ్ఞుండై.

వ. అప్పుడు.

సీ. నగరోత్తమంబు నా ♦ లుగుదిక్కులందు రో, జనమాత్రదేశంబు ♦ సమముఁ జేసి
పన్నీరు చిలికించి ♦ ప్రత్యగ్రశుద్ధమౌ, క్రొత్తకచూర్ణరంగవ ♦ ల్లికలుఁ దీర్చి
ప్రతిహారములను రం ♦ భాస్తంభములు హేమ, మయసుఘాపూర్ణకుం ♦ భములు నిల్పి
కమనీయపట్టాంశు ♦ కవితానముల క్రింద, నవ్యవిద్రుమతోర ♦ ణములఁ గట్టి
లలితసౌవర్ణకీర్ణచే ♦ లములఁ గొప్ప, పడగ లెత్తించి నృపసభా ♦ భ్యంతరముల
కలికిజిగి హెచ్చ నచ్చప ♦ చ్చలయెరుగుల, కెంపుటొఱగులు సమకూర్చి ♦ సొంపుమీఱ.

గీ. పురముఁ గైసేసి రప్డు గో ♦ పురములీలఁ, గరము కల్యాణలక్ష్మికా ♦ కరము గాఁగ
రాజమంత్రిలయాజ్ఞవి ♦ రాజితప్ర, కారకలితంబుగాఁ జిత్రి ♦ కారజనులు.

మ. నగరాలంకృతిఁ గాంచి సంతసిలి భూ ♦ నాథుండు దానంతని
జ్జగతింగల్గు సమస్తబంధునృపులం ♦ సన్మానలీలాయుతం
బుగ రావించి ప్రదక్షిణంబు ప్రథమాం ♦ భోరాశిపూరంబు వా
సిగఁ బాంచాలుని రాకఁ గోరుచు వసిం ♦ చెన్నిశ్చలోత్సాహుఁడై.

ఉ. అంతట నింద్రసేనమను ♦ జాగ్రణి చెంతకుఁ జన్న మంత్రుల
త్యంతముదంబుతోడ వసు ♦ ధాధిపశేఖర చిత్రవర్మభూ
కాంతుఁడు నీకుమారునకుఁ ♦ గౌతుక మొప్పఁగ నాత్మపుత్రి సీ
మంతిని నిత్తునందు బహు ♦ మానయుతంబుగఁ బల్కి యంతటన్.

గీ. పతిన[1] యంపుశుభక్రియా ♦ చరణమునకు, నసదృశంబైన యావసం ♦ తాగమంబె
యర్హమటుఁ గానఁ దనయుక ♦ ల్యాణమునకుఁ, గదలి రమ్మన్న వాఁడు శీ ♦ ఘ్రమ్ము గాఁగ

ఉ. ఆనిరవద్యదేశమహి ♦ మాతిశయంబు విచిత్రకారణం
బానగరోత్తమంబు సిరి ♦ యంతయు నెన్న మహాద్భుతప్రదం,
బానృపలోకచంద్రుని గు ♦ ణావలియుం గడు నబ్బురంబు నీ
సూనుని భాగ్యలీల యిది ♦ సుమ్ము నిజమ్ము నృపాలశేఖరా.

గీ. వినయభర మెంత యుచితవి ♦ వేక మెంత, కార్యదక్షత యెంత గాం ♦ భీర్య మెంత
మృదువచన మెంత మతిసము ♦ న్మేష మెంత, చిత్రవర్మకు నధికమై ♦ చిత్రి గాదె.

---

1 యుద్ధి (మూలము)

క. దేవతలఁ గొలిచి ధాత్రీ, దేవతలకు నిష్టధనము ♦ ధీరత భక్తిన్
నీవియ్యం బూర్వంబున, నీవియ్యంబమరెఁ గాక ♦ యిదియల్పంబే.

క. వనితామణి తాఁ గృతి తే, వ నితాంతముఁ గన్న విన్న ♦ వారలవలనన్
ననవింటి విజయరమయా, ననవింటిని నిజముగాఁగ ♦ నవనీనాథా.

ఉ. అన్నివిధంబులన్ శుభస ♦ మగ్రిత సంశయమేల సద్గుణా
భ్యున్నతమైన యొక్క సుము ♦ హూర్తముఁ జూచి సమస్త మేదినీ
సన్నుతుఁడైన యానృపతి ♦ చంద్రునియింట నుదారకీర్తి సం
పన్నత మీఱి నీప్రియసు ♦ మారుని పెండ్లి యొనర్పు భూవరా.

క. అన విని నృపుఁ డానందముఁ, గనియెం దద్బంధుమిత్ర ♦ గణముఖ్యసభా
జనముం బ్రమదోదయశుభా, జనమైయుటయుక్తమని ప్ర ♦ శంసయొనర్చెన్.

వ. అప్పుడు.

క. పురమునకును గాంతాంతః, పురమునకును నింద్రసేన ♦ పుత్రసముద్య
త్పరిణయవార్త సుధారస, ఝరి వైఖరి సమ్మదాతి ♦ శయకరి యయ్యెన్.

ఉ. అంతట నింద్రసేనమను ♦ జాధిపుఁ డాప్తసమేతుఁడై సభా
భ్యంతరసీమ నుండి ప్రతి ♦ భాతిశయంబునఁ గీర్తిఁ గన్న కా
ర్తాంతికరాజిఁ బిల్చి తన ♦ యాత్మజరత్నము జన్మతార సీ
మంతిని జన్మతారయుఁ గ్ర ♦ మంబున వారి కెఱుంగఁ బల్కుచున్.

క. పరిణయమునకు ముహూర్తముఁ, బరికింపుమటన్న వారు ♦ ప్రజ్ఞాన్వితులై
గురుశుక్రాదిమయుతభా, స్వరలగ్నము నిశ్చయించి ♦ చాతుర్యమునన్.

క. వివరించి పలుక నపుడా, యవనీతలనేత వారి ♦ కతిహర్షముచే
ధవళాంబరమణికీలిత, వివిధాభరణములొసంగి వి ♦ కసితముఖుఁడై.

గీ. తగినవారలచేత ను ♦ ద్దామనీతి, శాలియగు చిత్రవర్మభూ ♦ పాలుకడకు
లగ్నపత్రికఁ బనిచి యి ♦ లాతలమునఁ, గలుగు నిఖిలాప్తబుధవర్గ ♦ ములకునెల్ల.

క. శుభలేఖలు వ్రాయించిన, నభినవసంభ్రమముతోడ ♦ నందఱును మహా
విభవంబు మీఱవచ్చినఁ, బ్రభువరుఁడును గదలిపోవఁ ♦ బరమోత్సుకుఁడై.

సీ. పుణ్యాహవాచన ♦ పూర్వకంబుగ విప్రు, లాశీర్వదింపఁ జం ♦ ద్రాంగదునకు
సముచితమంగళ ♦ స్నానంబు సేయించి, కోటీరమాణిక్య ♦ కుండలాది
వరభూషణంబులు ♦ ధరియింపఁ గాఁ జేసి, సకలమహావాద్య ♦ శబ్దములను
మాగధస్తుతివాక్య ♦ సుహితశబ్దంబులు, జలజేక్షణాగీత ♦ శబ్దములను

నేకఘోషంబుగా మ్రోయ ♦ నింద్రలీల, నతని నవరత్నఖచితమై ♦ నట్టి పసిఁడి
యరదమెక్కించి తానొక ♦ యరదమెక్కి, మహితజలపూర్ణహేమకుం ♦ భములుఁ
[గనుచు.

ఉత్సా. కరులనెక్కి హరులనెక్కి ♦ ఘనరథంబులెక్కి భూ
వరులనేకకోటిసంఖ్య ♦ వారువెంట నంటి రా
పురవధూకదంబకంబు ♦ పూలజల్లుఁ జల్లఁగాఁ
దరలెనవ్వివాహయాత్ర ♦ ధరణినేత యుత్తటిన్.

సీ. పట్టుఁడీ కొన్ని ♦ పాండురఛత్రముల్, కటిచీఁకటి నిండఁ ♦ గ్రమ్ముకొనియె
వీవుఁడీ కొన్ని ♦ వింజామరలు వాత్య, లడరి యాత్రకునంత ♦ రాయమయ్యె
మరలింపుఁడీ కొన్ని ♦ కరుల సాంద్రీకృతా, నేకదానఝరంబు ♦ లేఁతలయ్యె
మాటుసేయుఁడి కొన్ని ♦ మరకతాలంకృతుల్, తేరుతెల్లవనసం ♦ దేహమయ్యె
నంచుఁ గంచుకినిచయంబు ♦ లాడసాఁడ, గణనయిడరాని రాజన్య ♦ గణముగదలె
నింద్రసేనవసుంధరా ♦ధీశతనయ, పరిణయాలోకనైకత ♦ త్పరతఁ గాంచి.

సీ. బిరుదుటెక్కెములు గ్రి♦క్కిరిసి చుక్కలచాలు, రాలునో యంచు సం♦భ్రమముఁ గాంచి
పుణ్యాంగనాగీత ♦ ములచేత నిలమోయ, నుఱుచునో ఫణియంచు ♦ మదిఁ దలంచి
బహుభారమొకచోటఁ ♦ బరఁగభూతలమెల్ల, నొరగునో యని యాత్మ ♦ నూహసేసి
నమితవాద్యముల నా ♦ శాంతదంతిశ్రేణి, కలఁగునో యంచుఁద ♦ ర్కమువహించి
వందిబృందంబునుతివిరా ♦ వంబుచేత, నజ్జభవుచిత్త మదరునో ♦ యంచునెంచు
శ్రీకరచరిత్రుఁ డగునింద్ర ♦ సేనపుత్రు, పరిణయోత్సవమునకేఁగు ♦ బహుజనంబు.

సీ. ధరరజంబింతయే ♦ తెఱుదుఁజల్లెడిగంధ, వొడిచింది దిశలయం ♦ దడరెఁగాక
రవిదీప్తులిన్నియే ♦ రాజేంద్రకోటీర, 1 హీరప్రభావళుల్ ♦ మీఱెఁగాక
మలయానిలునకింత ♦ చలువయే చెలువల, వదనానిలంబులతోఁ ♦ గదిసెఁగాక
గగనమింత వినీల ♦ కాంతియే కరిగండ, చలదళిచ్ఛవులతోఁ ♦ గలసెఁగాక
యనుచు నన్యోన్యమును నాడు ♦ కొనుచు నగుచు, నచ్చెరవు తీవ లాత్మలో ♦ నుబ్బ చూప
రాజనందనుపరిణయా ♦ రంభమునకు, నడచె గణియింపరాని మా♦నవగణంబు.

వ. ఇట్లు పురందరుచందంబున నమందంబైన వైభవంబున నింద్రసేనుండును దానును జనిచని యార్యావర్తదేశంబు ప్రవేశించి తదీయరాజధానిసమీపంబునకు వచ్చిన న వ్వృత్తాంతంబు విని చిత్రవర్మ నిర్మర్యాదంబైన యామోదంబు వహించి తానును దన

1 హీరప్రభా (మూలము)

బంధువర్గంబును వృద్ధపుణ్యాంగనాజనంబునుగూడి యెదురుకొనియె నప్పుడు.

సీ. వారివారణబృంహి ♦ తారావముల మీఱె, వీరిగంధర్వహే ♦ షారవంబు
వీరిగంధర్వహే ♦ షారవంబులు మీఱె, వారివాద్యధ్వాన ♦ వైభవంబు
వారివాద్యధ్వాన ♦ వైభవంబును మీఱె, వీరివందిస్తోత్ర ♦ విభ్రమంబు
వీరివందిస్తోత్ర ♦ విభ్రమంబులు మీఱె, వారిగాయనగీతి ♦ కారుతంబు
వారికన్నను వీరును ♦ వీరికన్న, వారు నొకవన్నె మీఱుచు ♦ న్నారు గాని
తారతమ్యమెఱుంగ నే ♦ వ్వారుఁజాల, రనుచుఁ జూపఱు లాశ్చర్య ♦ మందిరపుడు.

సీ. దట్టగాఁజిలుకు చం ♦ దనపుగంధపురొంపి, కటిదఘ్న మిచ్చోటఁ ♦ గదలరాదు
పైఁజల్లుగాఁ జల్లు ♦ పన్నీటికాలువల్, సుడిగొన్న వీచెంత ♦ నడువరాదు
వ్రేయుపూదండల ♦ వెడలుతేనియ సోన, జీరువారఁగ నిందుఁ ♦ జేరరాదు
పెదవెట్టికపురంపు ♦ పదిదిక్కుల వెలుంగు, నదలించె నీఛాయ ♦ వెడలరాదు
కణఁది నెయ్యంపువియ్యముల్ ♦ గలయువేళ, పలుపునుపచారములు చాలుఁ ♦ జాలునింక
జెప్పరే సఖులార మా ♦ [1]చెలులకనుచుఁ, గదిసె నుభయచిరంటిని ♦ కాయమపుడు.

సీ. బిగిదండ గడియాల ♦ మగజాలు హత్తిన, క్రొత్తయొత్తులు మేనఁ ♦ గొన్నగలుగ
నెదకిసంకటముచే ♦ నెదహారమౌక్తిక, చ్ఛటలు చూర్ణీకృతిఁ ♦ జిటిలపోవఁ
బలుమొగంబులుఁ జల్లు ♦ పన్నీటిమాటమిఁ, గాంచిమోవుల యావ ♦ కములచెదరఁ
గరిఘటాళుత్రితిపుటో ♦ త్కటమారుతంబులు, గదిలింప వలుదప ♦ య్యెదలు జాఱ
లలితసుకతాంతభావంబు ♦ దలఁపుచేసి, వెలయవెలయాండ్రఁగనుఁగొన్న ♦ విటులవెంట
మఱుఁడు వేటాడఁగాఁ జొచ్చె ♦ మచ్చరంబు, గదురనిరువాగువారును ♦ గదియువేళ.

చ. ఒకకలకంఠి పెన్నడియు ♦ నొకకృతలోదరి రొమ్ముఁ దాఁకఁ ద
త్పృకటకుచద్వయద్వితయ ♦ పర్వతమధ్యమునందు నొకకుఁదూ
రక దళియింప నొక స ♦ రాకువహించెఁ దదీయువేవనా
వికలత [illegible] ♦ న్పృత్తిగొ యాటలితంపుపందడిన్.

చ. ఒకపి [illegible] వాణి [illegible] ♦ నొక్క-నికంఠము లగ్నమైనఁ ద
త్సుకర [illegible] ధన [illegible] ♦ జూచియు వీడకయుండి రిద్దఱున్
మకరవరేణ్యకేతను ♦ మాయవశ స్మృతివ్రేయు నెంతయు
న్వికలతఁజెందు డెందముల ♦ వీడమినప్డు ముహూర్తమాత్రమున్.

---

1 మాటి (మూలము)

సీ. అఖిలదిగంతేశ ♦ సాధకాధరకాంతి, జాతవిద్రుమలతా ♦ సమితి గాఁగ
భూమీశులకు వేఁచియు ♦ చామరంబులదంబు, లమితడిండీరకాం ♦ డములు గాఁగ
ఘోరప్రవీణగాం ♦ ధారగంధర్వముల్, నటదంబువీచికా ♦ చటులు గాఁగ
ఘృణిలీనజాలు భూ ♦ షణరత్నసంతతుల్, సహజమణీవిశే ♦ షములు గాఁగ
సమదకటచండశుండాల ♦ సముదయంబు, లతివిభీషణమకరసం ♦ తతులు గాఁగ
సంద్రములు రెండు గదిసినా ♦ సాంద్రరీతిఁ, గలసి రిరువాఁగువారు నం ♦ తక్కలికమునం.

సీ. తతవాద్యధరరాజిఁ ♦ దరలిపోవఁగనిండు, బహుచిరంటేకదం ♦ బకములార
ఘనచిరంటిశ్రేణిఁ ♦ గదియనిండ తిరయా, ద్దండపాండుఛత్రి ♦ ధారులార
భూరిపాండుఛత్రి ♦ ధారులఁ జననిండు, హరిదశ్వగజసమా ♦ రూఢులార
కరితురంగారూఢ ♦ గణము సేఁగఁగనిండు, జవనోత్తమశతాంగ ♦ చారులార
పట్టుచాలవు పురవీధు ♦ లెట్టివయినఁ, దత్తరంబేలయని వేత్రి ♦ ధరులు చేరి
మనవిగాఁ బల్కనత్యంత ♦ మందగతులఁ, బురిఁబ్రవేశించెఁ బాంచాల ♦ పరిజనంబు.

వ. అప్పుడు.

ఉ. ఎక్కడఁజూచినన్ గజము ♦ లెక్కడఁజూచిన ఘోటకవ్రజం
బెక్కడఁజూచినన్ రథము ♦ లెక్కడఁ జూచినఁ గామినీజనం
బెక్కడఁజూచినం గొడుగు ♦ లెక్కడఁజూచినఁ గేతనంబులై
క్రిక్కిరిసెన్ బురంబు నువు ♦ గింజకునొండెడలేక యుండఁగన్.

సీ. ఇచట వారణరాజి ♦ యెన్న శక్యంబుగా, దచటి మత్తగజంబు ♦ లంతకన్న
నిచటి ఘోటకముల ♦ నెన్న శక్యంబుగా, దచటి తేజీలచా ♦ లంతకన్న
నిచట శతాంగంబు ♦ లెన్న శక్యంబుగా, దచటి రథశ్రేణి ♦ యంతకన్న
నిచటి వేశ్యాశ్రేణి ♦ యెన్న శక్యంబుగా, దచటి పుణ్యాంగన ♦ లంతకన్న
నేలయీలీల నీనెనో ♦ నింగిగనెనొ, దిక్కులనుప్పతిల్లెనో ♦ తెలియఁగూడ
దనుచుఁ జూపఱులద్భుతం ♦ బందుచుండి, రమితతత్పరివారవ ♦ ర్గములఁ జూచి.

ఉ. బంగరుమేడ లందతికిఁ ♦ బవ్యపరిచ్ఛదహంసతూలికా
సంగతశయ్య లందతికిఁ ♦ జందనయుక్తకురంగనాభిసా
రంగవిలేపనోత్తమము ♦ లందతికిన్ గలిగించి రగ్రిల
త్సంగల చిత్రవర్మనృప ♦ శేఖరు మంత్రులు కార్యదక్షులై.

గీ. పుత్రయుతుఁడైన పాంచాల ♦ భూమివిభుని, నైంద్రభవనప్రకాశకం ♦ బైనయట్టి
యొక్క యుపకారికామంది ♦ రోత్తమమున, నిలిపి యా చిత్రవర్మ భూ ♦ తలమునందు.

ఆ.వె. విడిదియిండ్లు కరుగ ♦ వేడ్క నెయ్యంబు, దొరల ననిపి వారి ♦ దొరల నెల్ల
సత్కరించి యధిక ♦ సమ్మదమాత్మను, పొంగ నిజనివాస ♦ మునకు వచ్చి.

వ. అభ్యంతరాస్థానాసనాసీనుండై నిజపురోహితులం బిలిపించి యిట్లనియె.

ఉ. ఎంతవిలంబమున్న దిఁక ♦ నిశ్చితమైన ముహూర్తవేళ మీ
రెంతయు జాగరూకత వ ♦ హించి శుభోచితకృత్యమెల్ల ని
శ్చింతముగా నొనర్పుటకు ♦ శీఘ్రమె మీ యనతియిందు శేముషీ
మంతులు నిచ్చినారుగద ♦ మంత్రులు మీకడ నెందటేనియున్.

గీ. అనవుఁడాలస్యమిఁక లే ♦ దవనినాథ, యబ్జముఖి మంగళస్నాన ♦ మాచరించు
నంత నేఁడాయె శుభముహూ ♦ ర్తావసరము, నెల్ల పనులును మున్నె యా ♦ యితములయ్యె.

గీ. అనుచు నృపుఁడుం దాన ♦ యంతఃపురమునకుఁ, జని ప్రమోదవతుల ♦ సతులఁ గాంచి
బాలికి మంగళాభి ♦ షేకంబుఁ గావింప, నాజ్ఞయిడిన సంభ్ర ♦ మాఢ్యలగుచు.

మ. జననాథాగ్రణి యింతులందఱు మహో ♦ త్సాహంబు మీఱంగ న
వ్వనితారత్నముఁ గాంచి రత్నయుతసౌ ♦ వర్ణాగ్య్రపీఠోత్తమం
బునకుం దెచ్చిన నానచే వినతయై ♦ పూబోఁడి గూర్చుండెఁ గాం
చనశైలోపరిభాగకీలితలతా ♦ సామ్యంబు రమ్యంబుగన్.

ఉ. ఆమనియార్పు లుప్పతిల ♦ నల్లపుఁగౌను గదమన్ వడంక నె
మ్మోము చెమర్ప మోముపయి ♦ ముక్కెరముత్తెము చిందుద్రొక్క మం
త్రామణిహారవల్లికనె ♦ దన్ గుదిఁగొంచుఁ బెనంగులాడఁగాఁ
గామిని యోర్తు సేరపుఁ ♦ గన్నియకుం దలయంటె నత్తఱిన్.

చ. విడివడి బాహుమూలరుచి ♦ విభ్రమముల్ నునుదళ్కులీనఁగా
నుడుగక రత్నకంకణగ ♦ ణోజ్జ్వలభావము తేవమీఱఁగాఁ
బడఁతుకయోర్తు సౌరభవి ♦ భాసురనిర్మలనీరధారచేఁ
గడు నిపుణత్వమొప్ప జల ♦ కంబొనరించెను జంచలాక్షికిన్.

గీ. సన్నవలిపంబుచే నొక్క ♦ సకియ చాన, మేనితడియొత్తుటకు నుప ♦ మానమేమి
మినిమి వెన్నెలక్రొక్కారు ♦ మెఱుపుఁ జేరి, లీల నొకనాఁడు జేయుఁడా ♦ లింగనంబు.

చ. తరుణి యొకర్తు కొత్తజిగి ♦ ధాగధగద్ధగఁ బాలసంద్రపుం
దరఁగల నవ్వు నవ్వలువఁ ♦ దాల్పఁగ నిచ్చె మృగాయతాక్షికిన్
సిరి యమృతంపుజిడ్డుపయిఁ ♦ జెన్నలరం జనియించినప్పుడే
సిరిధరియించెఁ దానదియె ♦ చేకొనియెన్ గలకంఠియత్తఱిన్.

గీ. పడఁతియొక్కర్తె దగ ♦ వగపట్టుచీరె, యిచ్చిన ధరించియలరెఁ బూ♦ర్ణేందువదన
ఫాలసందర్భు మీఁగడపైధరించి, జననమందిననికితోటి ♦ సాటియనఁగ.

గీ. కురులు తడియార్చి గొప్పఁగాఁ♦గొప్పముడిచి, కలికిజిగినింపుగల చంప♦కములదండఁ
జుట్టెనొకయింతిమొగులపైఁ ♦ జుట్టికొన్న, చంచలావల్లి నదియుల్ల ♦ సాబులాడ.

ఉ. తీరమరంగముద్దియకు ♦ దిద్దినపాపటక్రొత్తముత్తెపుం
జేరొక యింతికూర్చెఁదనుఁ ♦ జెంతలఁజేరఁగనీనిరాజు నే
చేరిఁవారు మీరనుచుఁ ♦ జీఁకటిపైకొని మ్రింగునట్టి యా
తారలచాలుడాలు షము ♦ దారతఁజేకొనఁదాల్చె నత్తఱిన్.

గీ. బాలశశిలీలఁగను చాల ♦ ఫాలసీమఁ, జేరుచుక్కఘటించెఁజె ♦ వ్వారి యొకతె
వదనశశి సహచర్యంబు ♦ వదలలేక, చేరుచుక్కయ యది యన్య ♦ చింతయేల.

ఉ. పంకజపత్రనేత్రకును ♦ బైదలియొర్తు వినూత్నరత్నతా
టంకయుగంబుఁ గూర్చెను హ ♦ టాహటిచేసెను ముజ్జగంబు ని
శ్శంకతఁగెల్వఁబోవు శుక ♦ సాదికినిట్టిరథాంగయుగ్మమే
కొంకక కూర్చికొమ్మనుచుఁ ♦ గూరిమితో మతిఁదెల్పువైఖరిన్.

గీ. మంజువాజీవిలోచన ♦ ఖంజనముల, నంజనముదీర్చె నొకదళ ♦ తక్కంజనయన
తరుణజనధైర్యనిధులెల్లఁ ♦ ద్రవ్వ మదను, పదియ నీరాజనంబుగా ♦ నవధరించె.

ఉ. చిత్రికావిమోవి నొక ♦ బింబఫలాధర యాదరంబుతో
లత్తుక హత్తుకొల్పి మిన్ను ♦ లన్నదిలోపలఁ జిన్నవోయె న
త్యుత్తమపద్మరాగరుచి ♦ తోఁ గలహింపఁగఁజాలు పూర్వపుం
వృత్తికి మాటుచేసి తను ♦ వెంగలినైతి నటంచు నెంచునన్.

చ. ముదితకుఁ జక్కనొక్క చెలి ♦ ముక్కరముత్తెముఁగూర్చి మాటికిం
పిడియని మాని వేఱొకటి ♦ యింపుదయింపఁగఁగూర్చి యట్లకా
వదియొఁదలంచి చిక్కవడ ♦ నంతటిలో రదినవ్వుబాలకుం
బెదవిచలించి సంశయవి ♦ భేదమొనర్చెనఁ గూర్చెఁజక్కగన్.

గీ. కాంతయొకయింతికూర్చెను♦కంఠసరము, ముత్తియములెంతయుంమనోజ్ఞ♦వృత్తిఁగాంచె
కంఠకంబవు కమనీయ ♦ గర్భసీమ, నప్పుడుదయించి కనుపట్టి ♦ నట్టిరీతి.

చ. ప్రియ నభితారహారములు ♦ బింబఫలాధరకుం బయోధర
ద్వయమున సంఘటింప నవి ♦ తద్దయుమీఱె సుమేరుకూటసం

శ్రయసురవాహినీసలిల ♦ సారథ్యక్షితివాసిభాసుతా
త్మయరుచిరామణీయకము ♦ పయ్యెనఁ గాంచి యుదంచితాకృతిన్.

గీ. అబలనీప్రాణభర్త చం ♦ ద్రాంగదాఖ్యుఁ, డయ్యెఁ జంద్రాంగదవు నీవు ♦ నైతివేని
సత్త్వదాంపత్యమగునందు ♦ నతివయొకతె, యామ్యగాక్షికినిడియెఁ జం ♦ ద్రాంగ
[దములు.

గీ. పంకజదళాక్షి మృదుపాణి ♦ పల్లవములఁ, గంకణంబులు గీలించి ♦ కాంతయొకతె
యకట తెలియంగఁ జాలదా ♦ క్రిమికలచాయఁ, దనరవే కంకణంబులు ♦ దమకుఁ దామ.

గీ. చంచలాక్షికి నొకపూర్ణ ♦ చంద్రవదన, కాంచియర్పించె రత్నరే ♦ ఖాంచితముగఁ
దరుణికవిభూమిలావణ్య ♦ ఘనసిరుట్లు, గట్టువైఖరి మిన్నులఁగ ♦ న్పట్టె నదియు.

గీ. అబలపాదంబు లబ్జంబు ♦ లవునొకావొ, యన్న సందేహమంతయు ♦ నపహరించె
సాంద్రశరమాధురీణంబు ♦ 1లైవిళానమండఁగాఁ జేసె నొక్క పూ ♦ ర్ణేందువదన.

వ. ఈకరణి మణిమయంబు దగిన యలంకారంబులు ధరియించి యాచంచరీకచికుర స
మ్మోహనమంత్రాభిమంత్రితంబైన పంచశరువిరిదూపుతీల విలసిల్లుచుండె నట్టియెడ.

సీ. యంగమంబై చనిపెద్ద ♦ లగు వారి(నెల్లరఁ), బ్రియవాక్యరచనచేఁ ♦ బిలుచువారు
హేమక్రియాసాధ ♦ నోచితద్రవ్యసం, పాదనవ్యగ్రతఁ ♦ బరఁగువారు
సమ్మానసముపల్ల ♦ వాదితోరణములు, శీఘ్రనెల్లెడలఁ గ ♦ ట్టించువ
కన్యామణికి నలం ♦ కారంబునకు నెంత, యాలస్య మగునంచు ♦ నడుగువారు
నింక నెడ లేదు సుముహూర్త ♦ మింద్రసేన, తనయుఁ బిలిపింపుఁ డనిధరా ♦ ధవునితోడఁ
జతురత వచించువారునై ♦ సందడిలిరి, కులరాజపురోహిత ♦ క్షోణిసురులు.

సీ. రత్నోపకల్పితసీ ♦ రాజనపాత్రంబు, లాయితంబులు గాఁగఁ ♦ జేయువారు
కల్యాణవేదిపై ♦ ఘనవృత్తిఁ గ్రొత్తము, త్తైపురంగవల్లికల్ ♦ దీర్చువారు
సరసమంగళగీత ♦ చాతురిఁ బ్రకటింపఁ, దలఁచి యన్యోన్యంబుఁ ♦ బిలుచువారు
రత్నభూషితలైన ♦ రాజేంద్రకన్యకఁ, గాంచి దీవనలఁ గా ♦ వించువారు
మంగళద్రవ్యపాణులై ♦ మసలువారు, పూర్ణకుంభంబులు ధరించి ♦ పోలుచువారు
నగుచు పెల్లితవిద్యుల్ల ♦ తాంకురములఁ, జెలువుఁబూని సువాసినుల్ ♦ మెలఁగిరపుడు.

సీ. మరకతస్తంభ 2భా ♦ స్వరవిభానికరంబు, కపటదూర్వాంకూర ♦ ఘటనసేయ
గారుత్మతమణివే ♦ దిరుచిప్రచయంబు, దంభహరిద్రాంకు ♦ తంబులీనఁ
దెలిమేలుకట్లము ♦ తైనుల యుత్తమకాంతి, కృతకలాజశ్రేణి ♦ గీలుకొలుపఁ

1 యథామూలము. 2 త్ప్రి ♦ భా (మూలము)

గుణవిందవిద్రుమా ♦ త్కరతోరణచ్ఛాయ, కైతవకుంకుమా ♦ కాంతి నెఱప
నవ్యశుచిమౌక్తిక మంగళ ♦ ద్రవ్యములకు, సంతతఘటింపఁ జాలు క ♦ ల్యాణమంట
పాగ్రమున వైదికక్రియా ♦ జాగ్రతులు, మతులవిలసిల్లునృపపురో ♦ హితులునిలిచి.

క. అయితమయ్యె నశేషము, నీయెడ శుభలగ్నమునకు ♦ నెడ లేదిదె భూ
నాయక కన్యావరునిశు, బాయతి వెలయంగఁ బిల్వ ♦ సంప్రమటన్నన్.

వ. చిత్రవర్మ నిర్మలానందంబునం బొదలు డెందంబున సంద్రసేనునినూనునిఁ బిల్చుటకు నుచితమంత్రిలం బనిచిన నంతమున్న కృతమంగళ స్నానుండును ధృతసాసాలంకారుండును నైనచంద్రాంగదుం డప్పుడు.

క. జనకుఁడొకతేరు తానొక, కనకరథాంగంబు నెక్కి ♦ ఘనతరవాద్య
ధ్వనులున్ వందిజనస్తుతి, నినదంబులు సకలదిశలు ♦ నిండుచుఁబర్వన్.

క. పురవీథివచ్చి సౌధో, పరికాంతానికరహృదయ ♦ పద్మము లెల్లన్
మరుని యనివార్యకార్ముక, శరధారారూపవర్ష ♦ సంగతి వెలయన్.

సీ. సురటిపూనినయట్టి ♦ సుదతిపైఁగన్నెత్తిఁ, గావించి పులకముల్ ♦ గప్పెనొకతె
యగరుధూపమమర్చు ♦ మగువపై నలిగిప్రి, స్వేద(దాహామ)పహ్న[1] ♦ వించెనొకతె
తాంబూలకటురసో ♦ దయమీాపడించి యా, శ్చర్యమాచ్ఛాదింపఁ ♦ జాలెనొకతె
పవజాంకురంబుల ♦ వైనీర్ష్య నెరయించి, తనయంగచలనంబు ♦ దాఁచెనొకతె
మరుఁడు నాయాయిచెయ్వులు ♦ మరఁదుసేయు, వికృతులకునెల్లమాటుగా ♦ వించిరప్రుడు
నలునిపౌత్రుగాత్రసౌం ♦ దర్యలీలఁ, గాంచిప్రాసాదములనున్న ♦ కంజముఖులు.

సీ. పలుతోరణంపుకెం ♦ పుల పరంపరగల్గు, సొంపుచేఁగెమ్మోవి ♦ కెంపుదెల్పి
బహుశాతకుంభకుం ♦ భముల జృంభణముచేఁ, గుచకుంభయుగళంబు ♦ కొమరుదెల్పి
నీలంపుటరుగుల ♦ నిమదచాయలచేతఁ, గచభారచాకచ ♦ క్యంబుదెల్పి
మేలిమిబంగారు ♦ మేడలబెళుకుచే, మెఱుఁగులీనెడుమేని ♦ మిసిమిదెలిపి
యపుడు ప్రియదూతిరీతిన ♦ య్యవనినాథ, తనయు సౌందర్యరేఖయం ♦ తయును దెలిపి
నగరి నగరిపువైభవా ♦ న్నత్యలీలఁ, గన్న నృపసూతి డెందంబు ♦ గరఁగఁజేసె.

సీ. పుణ్యాంగనాతత్తి ♦ భూరినీరాజన, ప్రభలుఁ గుండలమణి ♦ ప్రభలుగలయ
సౌధాంగనాజనాం ♦ జలికీర్ణసుమరాజి, హారముక్తికరాజి ♦ నలముకొనఁగ
గాయనజనగీతి ♦ కాయతవాదంబు, చక్రినాదంబును ♦ సంఘటింప
సుర్వీసురోదితా ♦ శీర్వాదనాదంబు, హేషితరావంబు ♦ నెనయుచుండఁ

---

1 (స్వేదహామపహ్న) మూలము.

బుష్పితోద్యానవనవీథిఁ ♦ బోలునవ్వ, సంతుఁడునుబోలె ధారుణీ ♦ కాంతతనయుఁ
డప్పుడు పురరాజవీథియం దరిగియరిగి, జనవరేణ్యుని మొగసాల ♦ చక్కనునిచి.

క. తేరుడిగి యుచితమగు పరి, వారముతోఁ గూడి బంధు ♦ వర్గసహితుఁడై
యారాజగృహము నేక, ద్వారంబులఁ గడచిచని యు ♦ దారతనంతన్.

గీ. ప్రభలఁగనుపట్టి ప్రత్యూష ♦ భాస్కరుండు, పూర్వగిరిదంతమును బోలె ♦ బుధజనాళి
నాంబుజము లుల్లసిల్లఁగ ♦ కళ్యాణమంట, పముఁ బ్రవేశించె నద్ధరా ♦ పాలసుతుఁడు

గీ. వచ్చినఁగాంచి వసుంధరా ♦ వరపురోహి, తాగ్రగణ్యుఁడు మణికీలి ♦ తార్హపీఠి
యందుఁ గూర్చుండ నియమించి ♦ యంత నృపతి, కన్యఁ దోడ్తేరఁ బంపెను ♦ గౌతుకమున

ఉ. అంతట వృద్ధపుణ్యవని ♦ తావళి పల్లవపూర్ణకుంభముల్
సంతసమొప్పఁబూని వర ♦ సంబగుమంగళగీతలీల ది
క్కాంతములందుఁ బర్వ ♦ వనజాయతలోచనఁ దోడితెచ్చి ర
త్యంతనవీకృతోత్సవవ ♦ మూశ్రయమైన వివాహవేదికిన్.

గీ. కుముదమిత్రుండు తారకయుఁ ♦ గూడినట్లు, చెలువు వహియించునంబర ♦ తలముపోలె
వరవధూరత్నములఁ గూడ ♦ వరవిలాస, మంజిమము పూనెఁ గల్యాణ ♦ మంటపంబు.

గీ. అమృతకరబింబ ముదయశై ♦ లాగ్రసీమ, రోహిణీసంయుతముగ ♦ నారోహణంబు
సేయుగతి రాజసూతినె ♦ చ్చెలియుఁ దాను, సర్వరత్నాసనాధ్యాసి ♦ యైనయంత.

క. భూదేవాగ్రిణి యచ్చట, వేదోదితరీతి జాత ♦ వేదునిలిపి హ
వ్యాదికములఁ దనివందిన, యాదేవుఁడు సాక్షిగాఁగ ♦ సర్వసరణిచేన్.

వ. వైవాహికతంత్రంబు నడుపనుపక్రమించె నప్పుడు.

శా. ధన్యోత్తంసము చిత్రవర్మమనుజా ♦ ధ్యక్షుండు శైలాధిరా
ట్కన్యానాయకపూజనాధికసుధీ ♦ గణ్యుండు సౌశీల్యసౌ
జన్యోదంచితకీర్తిశాలియగు పాం ♦ చాలాధిరాట్పుత్రికిన్
గన్యాదానముఁ జేసె నంచితమనః ♦ కౌతూహలంబొప్పఁగన్.

గీ. అవనిసురసాక్షిఁబూని చం ♦ ద్రాంగదుండు, నృపకుమారికసీమంతి ♦ నీవధూటి
కరముఁ గ్రహియించెనపుడు శ్రీ ♦ కరముగాఁగఁ, గరముఁ గ్రహియించె మరుఁడాత్మ
[కార్ముకము

చ. కిసలయహేతిచేతి యుతి ♦ ఖిన్నత నెన్నె నెల్లవైఖరిన్
గిసలయకల్పమైన చెలి ♦ కేలుఁ గ్రహించె నృపాలసూతి యా

భ్రాజితగల్లపాళికలఁ ♦ బైకొను ఘర్మజలంబు 1 దభ్రవా
రాజితభూషణాగ్రిమణి ♦ రాజులుగీతిఁ గరంగకుండినన్.

వ. ఈకరణింగరణీయంబులైన వైవాహికాచారవిశేషంబులుగా వైదికక్రియాసమాహితు
లైన పురోహితులు జరిగింపనవ్వధూవరులు వృద్ధపుణ్యాంగనానికరంబులకు నాచా
ర్యప్రముఖమహీసురవర్గంబులకు మ్రొక్కి సుఖంబుండిరంత.

గీ. ఇంద్రసేనవసుంధరా ♦ ధీశ్వరుండుఁ, జిత్రవర్మక్షమానాథ ♦ శేఖరుండు
గోత్రనగోలందులకుమీఱు ♦ భూరిధనము, లర్థులకు నిచ్చిరమితయ ♦ శోర్థులగుచు.

ఉ. వియ్యములిద్దఱుం గలసి ♦ విస్ఫుటకాంచనరాశులెంతయున్
నెయ్యమునీఱ నియ్యఁగన ♦ నీపకకోటికి మేరుభూధరం
బెయ్యెడనిచ్చునో యనుచు ♦ నేప్పడు నిద్దుగపూనకుండఁగా
నయ్యమరాళికెల్ల నది ♦ యాశ్చర్యమయ్యెను నాఁటినుండియున్.

సీ. బలిదానవిఖ్యాతి ♦ క్షాంతకంబుగఁజేసి, కవియొక్కఁడుండర్థి ♦ గాకమానె
నప్రకాశుండన్న ♦ యతిలజ్జచేనొక్కఁ, బుధుఁడు యాచనవృత్తిఁ ♦ బూనఁడయ్యె
దనకళంకపుశంక ♦ జనియించియొకకళా, ధరుఁడు వెంపఁగనన్నా ♦ దరముచే
బకుపాతిసటంచు ♦ భావించియొకమహా, ద్విజవర్యుఁడుమునుగంగ ♦ దిప్పుఁడయ్యెఁ
గాకవివరించిచూడ నీ ♦ లోకసమితిఁ, దనయకన్యావివాహసం ♦ జనితవ్యవహా
కౌతుకమునఁ గన్న వియ్యముల్ ♦ గలసియిచ్చు, భూరిధనరాశులందని ♦ వారు గలరె

ఉ. అనవద్యోన్నతిఁ జిత్రవర్మపునుజేం ♦ ద్రాగ్రేసరుం డంతటన్
వినయోదంచితవర్తనుండను మహా ♦ విఖ్యాతి దిక్ప్రాంతగా
మినియై పర్వ సుపర్వరాడ్విభవుఁడై ♦ మృష్టాన్నపానాదులన్
దనియం జేసె నశేషబంధుజనసా ♦ మానవశ్రేణులన్.

ఉ. వేడుక నింద్రసేనపృథి ♦ వీపతి యమ్మఱునాఁడు నెయ్యపున్
2 గోడలినిన్ గుమారమణిఁ ♦ గూరిమిఁదోడ్కొని పోఁగణంగవి
భ్రాడుపమానరూపసుమ ♦ భల్లుని నల్లునిఁ గన్యకామణిన్
వీడఁగలేకయుయ్యఁదన ♦ వియ్యముతో వినయావనమ్రుఁడై

గీ. చేరి మనవిగఁ బలికె యా ♦ చిత్రవర్మ, వరలుచసయింటనవ్వధూ ♦ వరులనిలిపి
యింద్రసేనవసుంధరా ♦ ధీశచంద్రుఁ, డాత్మపురమున కరుగంగ ♦ ననుమతించె

---

1 యథామూలము. 2 గోనింగుమార (మూలము)

రొకచాయఁ గృత¹చాయ ♦ ముచితాంచితసాన, యతిజాతిఁ బాయ ♦ వితతి గూడి
రొకకేళివనభిసారి ♦ కోదారశృంగార, కాశ్మీరసారంబుఁ ♦ గౌఁగిలించి
రొకఁడెరొయిడ విపణిమణి ♦ రుకటలాప, దీపికారూపములలోన ♦ నేఁపుమాసి
యఖిలదిగ్భాగములు దాన ♦ యాక్రమించె, సాంధ్యరాగంబు నిస్తంద్ర ♦ సాంద్రరీతి.

సీ. ఒకపుష్కరముకాంతి ♦ వికలనూటయ కాక, మఱియొకట్టి యునట్టి ♦ మహిమ దాల్చె
నొకపతంగవిహార ♦ మూడిపోవుటయె కాక, వేఱొకట్టి యి నట్టి ♦ విధమెపూను
నొకశార్వరవికార ♦ ముద్గమించుటె కాక, యితరంబు నేత దా ♦ కృతియుఁ దాల్చె
నొకవిషమాంబకుం ♦ డొగి నటించుటె కాక, యన్యవృత్తియు నట్టి ♦ దై చెలంగె
నిటు పహోయంబు లన్నియు ♦ నేకకార్య, కారులైయుండ నాశ్చర్య ♦ కరముగా జ
ర్చ సేయు సమానాఖ్య ♦ సతులమతులఁ, గలఁక పుట్టించు రజనీము ♦ ఖంబునందు.

శా. సంతోషం బభిసారికావితతికిం ♦ జారప్రియానేకదు
శ్చింతానోదకరంబు చోరనికర ♦ శ్రేయంబు ఘూకావళీ
స్వాంతాత్యంతవిలాసకారి నిఖిలా ♦ శాభేదనిర్భేదనం
బంతం సంతమసంబు మీఱె జనలో ♦ కాలోకభీమాకృతిన్.

సీ. చిరజీవులయ్యెఁ ²బ ♦ క్షికులంబులెల్ల శ్రీ, కాంతతనువులైరి ♦ కాంతలెల్ల
బహుళరత్నములెల్ల ♦ మహిమసారములయ్యె, నద్రులన్నియును నీ ♦ లాద్రులయ్యె
గుదభద్రకరులయ్యె ♦ గోవులెల్లను గ్రహో, తరురములెల్లను దార ♦ తమములయ్యె

× × × ×

జగతిజనులూహ సేయంగ ♦ సకలవస్తు, సమితికొకట-క వింత మేల్ ♦ సంగ్రహించె
జారచోరాభిసారికా ♦ సౌఖ్యకరమె, కాకతిమిరంబు సకలోప ♦ కారకంబు.

సీ. చంద్రికల్ సచరించు ♦ చందమామకె కాని, మామకేభయమంద ♦ మందయాన
హరిదిశల్ తెలిగించు ♦ హరిమణిదికె కాని, మణిదికేశంకించ ♦ మంజువాణి
సిరి చిన్నె గైకొన్న ♦ సిరియన్నకే కాని, యన్నకేనలుకనో ♦ సన్నుతాంగి
నిజరుమల్ గల యామి ♦ నీభర్తకే కాని, భర్తకేనలుకనో ♦ పద్మగంధి
యనుచుఁ బ్రియమాతికలతోడ ♦ నాడుకొనుచు, ననుచితంబైన పనులుఁ గై ♦ కొనుచు ధరణిఁ
దరళితములైనమతులతోఁ ♦ దరుణజార, సతులు దేలిరివివిధోప ♦ పతులరతుల.

---

1 యథామూలము. 2 ప్రక్షిప్తము.

ఉ. అంతకమున్న పుణ్యవతు ♦ లర్హముహూర్తము నిశ్చయించి సీ
మంతిని నైషధాన్వయుడు ♦ మారశిఖామణిశయ్య నొయ్యనం
గంతుని కేళిఁ గూర్పుటకుఁ ♦ గౌతుకమొంది యలంకరించి ర
త్యంతము వింతరీతి మృదు ♦ లాంబరమాల్యవిభూషణంబులన్.

క. కొందఱు బుద్ధులమాటలు, గొందఱు పరిహాసగర్భ ♦ కోమలసూక్తుల్
గొందఱు దీవనపలుకులు, సుందరితోఁ బలికి రపుడు ♦ సుదతీజనముల్.

ఉ. ఆరమణీమణుల్ మివుల ♦ నాదరణంబున వింతవింతశృం
గారముఁ గూర్ప వారలప్ర ♦ కారమెఱింగి యుత్తతిన్
మారునికేళికిన్ నృపకు ♦ మారునితోడను గూర్తురన్న యా
దారి యెఱింగి లజ్జఁ గడుఁ ♦ దారసిలన్ దరలాంతరంగయై.

సీ. పిలువఁబనియున్నఁ గన్నులఁ ♦ బిలువదయ్యెఁ, జెలులతోఁ బ్రతివాక్యముల్ ♦ పలుక [దయ్యె
ప్రోడలగుచేడియలఁ దేఁటి ♦ చూడదయ్యె, నెలఁతలనుగూడి మెలఁగంగ ♦ నేరదయ్యె.

క. ఈకరణిని భయలజ్జా, వ్యాకులితాదళితచిత్త ♦ యై యుండంగా
నాకాంత నొకర్తె చెచ్చెర, నేకాంతంబునకుఁ బిలిచి ♦ యిట్లని పలికెన్.

తే. నేఁడు సుముహూర్తమైనది ♦ నిశ్చయంబు, కలికి నీభర్తకును నీవుఁ ♦ గౌతుకంబు
మీఱ నొక్కటిసేయుచు ♦ న్నారమిపుడు, బుద్ధి నీకొక్కటే తెలిగింతు ♦ ముద్దరాల

ఆ.వె. జలజసంభవుండు ♦ పతులంచుఁ బతులంచుఁ, జేసినప్పుడే లంకె ♦ జేసినాఁడు
నీకె యద్దిగాదు ♦ నైకొన్నశంకనీ, కంద నేలలజ్జఁ ♦ గడద నేల.

వ. అయిన నింకొకరహస్యంబుఁ జెప్పెద నాకర్ణింపుము.

సీ. మనసు చూచినయట్ల ♦ మగనిరాగధరంబు, మొనసి చూడక చూపు ♦ మొనల నీవు
మనసు పలికినయట్ల ♦ మగనితోఁ బలుమాఱుఁ, బలుకకే నెయ్యపు ♦ పలుకు నీవు
మనసు చేరినయట్ల ♦ మగఁడు పిల్వక మున్న, చేరకే యతనిపూ ♦ సెజ్జ నీవు
మనసు జేసినయట్ల ♦ మగఁడు జేసినఁగాని, సేయకే పలరాచ ♦ చెయ్యి నీవు
మనసు వేవేలకోర్కెల ♦ మలయుచున్న, నాన వెలిగానఁ గాఁ జేసి ♦ మానవతులు
పతుల వలపింపకున్న నో ♦ పద్మగంధి, పంచశరుతూపు తెంపొదాఁక ♦ బలము చూపు.

గీ. అంతరంగంబు లొకటియై ♦ నంత దాఁక, నంగనకు లజ్జ భూషణం ♦ బగుచునుండు
నంతరంగంబు లొకటియై ♦ నంతమీఁద, మిగులబాధించు భూషణం ♦ బగుచునుండు.

ఉ. ఆదరణంబుచేఁ బిలిచి ♦ నప్పుడె శయ్యకు నొయ్యఁ జేరి నీ
పాదములొత్తుమీ రతులఁ ♦ బైకొనుచో విభుఁడేమి చేసినం
గాదనఁ బోకుమీ మిపుల ♦ గద్దరియావల రాచయొజ్జ యే
వైదములైన దిద్దుకొనఁ ♦ జాలెదు నింతవిచార మేటికిన్.

గీ. అని యనేకముఖంబుల ♦ నబ్జముఖికిఁ, బ్రియమునుగఱపు చెయ్యుల ♦ వ్వాణితి చెలువ
మిపుల నానతవదనయై ♦ మౌనవయిన, వింతనాగోయుపనులంభో ♦ వింటుచుండె.

క. ఆసమయంబునఁ జితిప్రి, కాసమయంబైనకేళి ♦ కాభవనముఁ గాం
రాసుతుఁడు మదనవిశిఖా, యాసితుఁడై మృదులశయ్య ♦ నధ్యాసితుఁడై.

సీ. కెలనఁబంజరపుచి ♦ లుకలపలుకులన్నియుఁ, గలకంఠి మృదులవా ♦ క్యములె గాఁగ
నీలంపుటిన్నెల ♦ నెలకొన్న జిగియెల్ల, సకియకుంతలచాక ♦ చక్యగాఁగ
నెలతాలనేలపె ♦ న్నెల చిన్నెలన్నియు, మగువనెమ్మొగముపై ♦ నగవుగాఁగ
బొండిదిగాంచినయంచ ♦ బోదలనడలెల్లఁ, దరుణి యానవిలాస ♦ సరణిగాఁగఁ
జాల నూహించిచింతించి ♦ సంశయించి, నిజముగదలంచి యాదలంచి ♦ నిర్దయుఁడగు
కాయభవునాజ్ఞ యిసుమంత ♦ గడియ లేక, గడియలబ్దంబులై యుండఁ ♦ గడుపుచుండె.

సీ. నృపనందనీధ్యాన ♦ నిపుణత్వ మాత్మలోఁ, గీలుకొన్నఁ గొన్ని వ ♦ త్తృతములయ్యెఁ
నపమూర్తిఁ దలయింప ♦ ననలంపు పోల్పులై, దీపించి యొకకొన్ని ♦ ప్రేతలయ్యెఁ
బడకజానఁ రాక ♦ శంకింప నొకకొన్ని, రచితాదికద్వాప ♦ రమ్ములయ్యెఁ
దరుణీమణీత్రపా ♦ పరిహారసంకల్ప, కలితత్వమునఁ గొన్ని ♦ గానవయ్యె
మగువయును దాను నృపసూతి ♦ యుంగము గాని
వేళఁ దామెట్లు యుగములై ♦ వెలయుచుండె
యతనిఁ గలఁగించు విమతంబు ♦ లైనయట్లు -
గడియలైదాఱు కేలికా ♦ గారసీమ.

వ. అయ్యవసరంబున.

ఒకమాట చెప్పి వే ♦ ఱొకపరాకు ఘటించి, యొకచందిరిసాలచే ♦ రికకుఁ జార్చి
యొకచిత్తరువుమీఁద ♦ నుత్సాహ మొదవించి, యొకయంచనడఁ జూపు ♦ టకుఁ దెరల్చి
యొకపద్యమున కర్థ ♦ మూహించు మనిపల్కి, యొకముద్దుజిలుకఁ జెం ♦ తకును దెచ్చి
యొకమంత్రనముఁ జెప్ప ♦ నోజనన్నె యొనర్చి, యొకవిరిగుత్తియందు ♦ కొనఁ గలించి
మాటిమాటికి నాయాయి ♦ మాయపన్ని, కన్నియఁ భ్రమింపించి ప్రౌఢలో ♦ కంజముఖులు
జనపకుమారకేళికా ♦ చందిరాల, సన్నిధికిఁ జేరఁ గంటనా ♦ సన్నదొలఁగి.

జంతూప్రగమి యేఁపు ◆ లనఁగంబు తరుణి మా, పులపాఁపునను గొంత ◆ బలువు సెఱపఁ
దనర్చాలు పెనుడాలు ◆ వనితాకపోలప, త్రికల మిత్రతఁ గొంత ◆ దిట్టగాఁగ
దనవిజయలక్ష్మి సకియ సౌ ◆ దర్యలక్ష్మి, పొందు నహియించి మిక్కిలి ◆ ప్రోడగాఁగ
నంత మహికాంతసూనుని ◆ వింతవింత, గతుల నడలించె మదనుఁడే ◆ కాంతసీమ.

క. ఈకరణి మదనుఁ డెంచఁగ, నాకరిణీయానచింత ◆ నధిపతి తాళం
లేక మనోధైర్యంబు, వ్యాకులతం జెంద నిట్టు ◆ లను నెచ్చెలితోన్.

క. చాలా సిగ్గుకుఁ జేరక, యేలా తడసెదవు మదనుఁ ◆ డేచిరించిన చో
వాలుందూపులవానం, జాలన్ దడిసితివి మున్నుఁ ◆ జంచలనయనా.

గీ. కాంత యేకాంతమునఁ గాంతుఁ ◆ గదియు వేళ, వ్రీడఁ జెందుట గగనార ◆ విందయుక్తి
సెలఁత నీకేలలోదరి ◆ నేర్పు మీఱ, నప్పసము జేసె నిటువంటి ◆ యబ్బురంబు.

ఉ. నిన్ను సృజించు వేళ తొక వి ◆ నీలకచన్ రచియించునంచు న
భ్యున్నతయుక్తిఁ గాంచు కమ ◆ లోద్భవు చెంతకుఁ గొంతఁ జేరినా
యున్నది నిన్ను నెంచి మతి ◆ యొక్కతె లోదరి నెందు జాణతో
నన్నులఁ జేరె లజ్జ యిటు ◆ లారయ నెక్కడవచ్చె నెచ్చెలీ.

గీ. నామనసు మున్ను హరియించి ◆ నావు నీవు, నీమనసు నాకు నీకున్న ◆ నీతిగాదు
మనలయిద్దఱి నడుమ ధ ◆ ర్మంబు నెఱపఁ, బంచశరుఁ డున్నవాఁడు గా ◆ పద్మగంధి.

క. వినుమా నాపలుకులుఁ గై, కొనుమా రతికేళి వాలు ◆ గొనఁజూపులనన్
గనుమా నామది నీదే, యనుమా యనుమాన మేల ◆ యంభోజముఖీ.

వ. అనిమతియుఁ జాటువచనంబులు నెఱపి తెరపిలేని మరునిశరపరంపరచేఁ గంపితం బైన హృదయంబులో నయ్యంబుజముఖి కరంబు కరంబునం బట్టి యారాజతనయుం డు వినూత్నంబైన ప్రయత్నంబున సిగ్గుపై నాసీనం జేసి.

ఉ. పయ్యెద జాఱఁ జేయఁ గర ◆ పల్లవముల్ గదియించు నప్పటన్
దియ్యనిమోవి యానఁ గొని ◆ దిగ్గన మోమటు సేయు శయ్యపై
చయ్యనఁ బవ్వళింపుమనఁ ◆ బంచలనవ్వల రాచకయ్యపుం
నెయ్యమొకింతయున్ నెఱప ◆ నేరక యత్తరలాక్షి యత్తఱిన్.

సీ. ఒక నెపంబు వహించి ◆ యావిద పాపట చెంతఁ, గరపంకజాతంబు ◆ గదియఁ జేసి
యొక కైతవము పూని ◆ యుడురాజముఖి కావి, మోవిపైఁ బలుదాలు ◆ మోవఁ జేసి
యొకమాయ ప్రకటించి ◆ సకియ చక్కని చెక్కు, టద్దంబులను మోవి ◆ యుంటఁ జేసి
యొకదంభము వహించి ◆ యావతి పాలిండ్లపైఁ, జెలువంపుఁ గొనగోరు ◆ జేరఁ జేసి

మతి ననుమ్యాయాయకపటంపు ♦ మతము పూని, నానయొక కొంత పడలించి ♦ నరవరుండు
కంజముఖి చిత్తమొక కొంతఁ ♦ గరఁగఁ జేసి, నవమబాణుండు సాహాయ్య ♦ మాచరింప

వ. అంత.

సీ. అధరపానంగఁబూని ♦ యదిమాని సికవాణి, గల్లచుంబనలీల ♦ నుల్లసిల్లుఁ
జనుదోయి గోరులం ♦ జెఁగఁ గోరి యదిమీఱి, భుజమూలములయందుఁ ♦ బొందుపఱచు
ముమ్మతఁ బోకిళ్లలియందు ♦ మతిఁ గూడి యదివీడి, సతినీవి సడలించు ♦ మతివనుఁ గాంచుఁ
గలికిపలుకులు పల్కఁ ♦ గాంక్షించి యదిమించి, యతివకుమణితంపు ♦ రుతముఁ దెల్పు
నొకటి సేయంగఁదలఁచి వే ♦ ఱొకటి సేయుఁ, దగనహంపూర్వికాపూర్వ ♦ ముగ జనించి
జరుగు నభిలాషసంతతుల్ ♦ సందడింపఁగ, బారవశ్యంబునెంది యప్పార్థివుండు.

సీ. మణితంపురణితంపు ♦ మాధురీమధురముద్దు, గులుకుకోయిలపలుకు ♦ కులుకుమాపి
తఱుమగా జనియించు ♦ తావియూర్పులచే, మలయానిలుని గర్వ ♦ కళవారించి
మొలకచన్నులఁ బాదు ♦ కొలుపుక్రొన్నెలలచేఁ, గమ1లినీకళల గ♦ర్వముఁ దెరల్చి
రమణీయబింబాధ ♦ రము వింతచవులాని, చెఱకువింటిబలంబు ♦ చిన్నఁబుచ్చి
మొదలఁదనతోడ నెదిరించి ♦ మదనుబలముఁ. జాలకఁ గాఁ జూచె నారాజ ♦ సుతవరుఁడు
రమణి రతిసౌఖ్యమనుమహా ♦ రాజ్యపదము, నందు నిశ్శంకలీలచే ♦ నధివహించి.

క. నరవరదంపతు లీగతి, సురతానందానుభవము ♦ చూరఁగొనంగా
నరుదుగ నొక్కని మేషము, కరణిన్ నిశగడచి ♦ కల్యకాలం బైనన్.

గీ. చక్రిదంపతి సుకృతభూ ♦ జంబునొక్క, జారకాంతలమతులందుఁ ♦ జేరుఁ జిక్క
సిరిఁదనరు పూర్వదిక్కాంత ♦ చేరుమొక్క, విమలగతినంతఁ గనవయ్యెఁ ♦ వేగుఁజుక్క

సీ. అంతరంగములందు ♦ నభిలాషశేషంబు, కొనఁ దీర్చుకొనునెడఁ ♦ గొందఱకును
పాలయులకల్లద ♦ ప్పులనుంచి ప్రియులతోఁ, బొందుసేయుఁ డటంచుఁ ♦ గొందఱకును
సంకేతములనుంట ♦ చాలించి చనుఁడు మీ, మందిరంబులకంచుఁ ♦ గొందఱకును
విటులాత్మపుఱచిక ♦ వింటి నమదనాంక, కోటిఁగప్పఁడటంచుఁ ♦ గొందఱకును
చాటుమదనుని యధికవా ♦ చాటులైన, చారులనఁగ రతిప్రపం ♦ చారులగుచు
సారెసారెకుమీఱును ♦ ఖైస్వనముల, 2 (సమయమనుశిల్పి) గల్పింపఁ ♦ జాలినాఁడొ,

చ. కుముదము తెల్విఁగాంచుతఱిఁ ♦ గోరికనిద్దురఁజెంది పద్మము,
ఱ్ఱముదము కన్నుమూయఁగని ♦ గొబ్బుననప్పుడ మేలుకాంచె నీ

---

1 కమలికళల (మూలము) 2 నుశిల్పిగల్పింప (మూలము)

క్రమమురయం బనోభవుఁడు ♦ కౌతుకరాగనిబద్ధపాంథవ
ర్గముపయి నొయ్యనయ్యగముఁ ♦ గాఁపుగ నుంచినచందమయ్యెడిన్.

గీ. విరహిజనములపై దండు ♦ వెడలినట్టి; చిత్తభవుని ప్రతాపాగ్ని ♦ శిఖలునిట్లు
దేజమువొలంగునని తెల్పు ♦ నోజఁ దనరఁ, దీపనికరంబు లంతటఁ ♦ దెల్లనయ్యె.

ఉ. నిక్కముసెల్లఁజేరెఁబలు ♦ నిద్దురలెల్లను గైరవంబులం
జక్కవలందచేరె నవ ♦ సౌరతకేళిసుఖంబులెల్ల నే
డక్కనలేక ఘూకముల ♦ దృక్కులఁజేరి తమంబులెల్లఁ బెం
పెక్కనిశాంతలక్షణము ♦ లెల్ల ననేకవిచిత్రహేతువుల్.

సీ. ఆకాశపుణ్యతీ ♦ ర్థావకాశంబులు, బహులద్విజాక్రాంతఁ ♦ బరిఢవిల్లె
సాసీరుహానేక ♦ చక్రవాకంబులు, ప్రకటీకృతానేక ♦ భరముపూనె
వారుణాశామంద ♦ జారబృందంబులు, విధ్వస్తసంయోగ ♦ విహ్వలతఁ గాంచె
భీతకౌశికవ్రాత ♦ పోతజాతంబులు, సంచారములయందు ♦ జడములయ్యె
సకలదిక్పటలోదయా ♦ చలతలములు, భాస్వరాకృతియోగసం ♦ పద వహించె
మేదినీభువనామితా ♦ మోదజనక, లీలఁ గనుపట్టు ప్రత్యూష ♦ వేళయందు.

చ. తరణివచ్చునటంచు ♦ గురుతమోవారాశి, మగ్నులందఱును స ♦ మ్మదముపూన
హంససమాగమం ♦ బయ్యెనంచుఁ బ్రబోధ, కాములెంతయుఁ గౌతు ♦ కము వహింప
మిత్రసంగతిసైన ♦ మేలు గల్గెనటంచు, నతిబాధఁగనువార ♦ లాదరింప
నిమఁశు గల్గెనటంచు ♦ ఘనతస్కరాధిక, భీతిఁజెందినవారు ♦ ప్రేమపూన
గగనమణి యబ్బెననుచు శ్రీ ♦ కాంతుఁ గన్న, మనుజులందఱు నానంద ♦ మనుభవింప
నిఖిలభువనప్రకాశకో ♦ న్నిద్రలీల, భానుఁడుదయించె నాతామ్ర ♦ భానుఁడగుచు.

గీ. అరుణపత్రవిచిత్రవి ♦ స్ఫురణఁ గాంచి, సౌరభాయాసిచేఁ బ్రోది ♦ సంగ్రహించి
ఘనపతంగళతాంగసం ♦ గతిఁ దనర్చు, గగనతలమంత వాసంత ♦ నగమువోలె.

సీ. వ్యాకోచవీచిక ♦ వారిజాతము గంధ, సలిలాభిషేకంబు ♦ సంగ్రహించి
యతిరాగకలితదం ♦ పతిమనోంబుజనవ్య, హవ్యముల్ మదనాగ్ని ♦ యందుఁ దెల్పి
చక్రద్విజానేక ♦ సముదయప్రమదసం, భ్రమదకన్యాప్రదా ♦ నము లొనర్చి
పద్మకోరకబృంద ♦ బంధీకృతమిళింద, సందోహముల వి ♦ మోచనముచేసి
పద్మగర్భాండమను మహా ♦ భవనసీమ, సమయభూజాని ప్రొద్దికా ♦ రమణియందు
సతులరుచిబాలమార్తాండ ♦ సుతునిఁ గాంచి, యుచితగతిమీఱఁ జేసెఁబు ♦ త్రోత్సవంబు

గీ. ఈకరణి వాసరారంభ ♦ వేళఁ బాలఁ, దనర నామున్న చంద్రాంగ ♦ దునివధూటి
వందిసుతరావమేదురా ♦ వార్యతూర్య, మృదులసన్నాదములచేత ♦ మేలుకాంచి.

గీ. గళితభూషణములు గొన్ని ♦ గదియఁ జేసి, జాఱుబయ్యెద నొకకేల ♦ సంగ్రహించి
విరియు నెఱిగొప్పుపై నొకట ♦ కరముఁ జేర్చి, విభునికేళీనివేశంబు ♦ వెడలి చనియె.

ఉ. అంబుజపత్రనేత్రయును ♦ నయ్యవనీశుఁడు దివ్యతల్పక
యాంబున మున్న వీడ్వడిన ♦ వన్నెయు విన్నను వొప్పఁ దోఁటిచం
దంబునఁ గూర్చుచో మఱచి ♦ నారొ నతోత్తము మానసంబు ప్రే
మంబునఁ జొచ్చి కాంత తన ♦ మానసమూతనియొద్ద నుండఁగన్.

వ. అంత.

క. ఆకాంత కంతుకేళిక, థాకర్ణజపమనోజ్ఞ ♦ తనువల్లిక నా
లోకించి హాస్యరసవా, చాకుశలత నిట్టులనిరి ♦ సహచరకాంతల్.

ఉ. పంకజపత్రనేత్రి నర ♦ పాలతనూభవ నెవ్వరేని హా
స్యాంకురసంకులోదితము ♦ లాడితిరో చెలులార యూరకే
శంకజనించనే రమణి ♦ కిన్ శతకంజప్రసూనజీమంబుని
శ్శంకతఁ గన్న కన్నుగవ ♦ సన్నపుబూదిఁ గసంగ నయ్యెడిన్.

ఉ. ఓరమలనాగ యీమగువ ♦ నొక్కటి బల్కిన వారలేరనీ
చేయొలఁగంగఁ జాలదర ♦ విందవిలోచన చిత్తమువ్వసున్
కేయిఁగఁ జేయుకేల రొమ ♦ రించెఁ బ్రభాతమటంచు భారతీ
నాయకుమీఁద నీ తనమ ♦ నంబున నల్కవహించె నెచ్చెలీ:

ఉ. నీవు నెఱుంగు దేసకియ ♦ నిక్కము గా నిట నేఁటనుండియుం
దీవరనేత్రి యంచమితి ♦ నుంపక పంకజనేత్రియంచు నే
లా వచియించెనంచు మిము ♦ లన్నదిఁ గినుక వహించెనమ్మ యీ
భావము నేనకాంచితిని ♦ భావజుఁ డిందుకు సాక్షియయ్యెడిన్.

ఉ. కెంపునఁ బెంపుమీఱు నొక ♦ కెంపుజనించినయంతె గాక ప
లెక్కెంపులువానిమీఁదఁబరి ♦ కింపజనించిన నెంతవిల్వ యూ
హింపఁగలాదె కాంత ధర ♦ ణీశలసద్ద్విజరాజితాంక చిం
తింపఁగ నెవ్వరోప్రసుధ ♦ దీనివిశేషము నిర్ణయింపఁగన్.

గీ. గురుతరంబైన మనబాల ♦ కుచయుగంబు, గిరియుగంబంచు మున్నయం ♦ గీకృతంబె
వింతవేఁ లిందుఁ జెలువొందు ♦ విధముఁ జూచి, తగ గిరీశయుగంబన్నఁ ♦ దగును గాదె.

వ. అనుచు నాబాలికయాలకించుచుండఁ బ్రచండలైన వేదండగమనలు భావగర్భంబు గాఁ దమలోఁ బలికెడు పలుకులు విని యగ్గలించిన సిగ్గుగదుర నిలువంజాలక యానీలాలక మొగులుచాటునకుఁ జను మెఱుపునో యనువున యవనికమఱుఁగునకుంజనియె నివ్విధంబున.

శా. శేషాభూషితవామదేహా నిజ ♦ సేవోద్యుక్త నానాజన
ద్దోషధ్వాంతపతంగ ఖండితమహా ♦ దోషాచరవ్రాత స
త్తోషా కామనికామ భక్తికలనా ♦ సువ్యక్తవిద్వన్మహా
భాషావర్ణ్యనిజప్రభావ వినమ ♦ ద్భామామనోనాయకా.

క. పరమతపోనియమాన్విత, ధరతనయావిపులహృదయ ♦ ధైర్యవదీక్షా
కరణైకనిపుణతరసుగ, దరపటువేషాభిరామ ♦ దానవభీమా.

మాలిని. మకుటనిహితసోమా ♦ మంజుతేజోభిరామా
దళితభరణదీక్షా ♦ సాధుసంతానరక్షా
ప్రకటగుణనికాయా ♦ భాసురామ్నాయగేయా
సకలశుభనిధానా ♦ శాంతిలీలప్రధానా.

గద్య— ఇతి శ్రీశైల నివాస భ్రమరాంబా సమేత మల్లేశ్వరస్వామి కృపాపాత్ర
భారద్వాజ గోత్ర పవిత్ర పెనుమళ్ల సోమమంత్రి పౌత్ర పెద
నీల ప్రధానపుత్ర సకల సుకవి స్తుత్య సోమనామాత్య
ప్రణీతంబైన సీమంతినీకల్యాణం బనుమహా
ప్రబంధంబునందుఁ దృతీయాశ్వాసము.
ఏతత్సర్వం శ్రీసదాశివబ్రహ్మార్పణమస్తు.



శుభమస్తు.

అవిఘ్నమస్తు.

శ్రీసదాశివాయనమః.

# సీమంతినీకల్యాణము.

## చతుర్థాశ్వాసము.

శ్రీమద్భ్రమరాంబాముఖ, తామరసోపరివిహార ♦ తరలాలోక
స్తోమ శుభనామ నిర్మద, యామునయ శ్రీశైలమల్లి ♦ కార్జునదేవా.

వ. అవధరింపుము.

గీ. దినమునొకవింతనెయ్యంపుఁ ♦ దియ్యదనము, దినమునొకక్రొత్తరతికళా ♦ వినియమంబు
దినమునొకవన్నెయుత్సాహ ♦ మునుజనింపఁ, జనియె నాదంపతులమిథ ♦ స్సంగమంబు

చ. మనసున మున్నుఁగోరునది ♦ మురువచూపులఁ గోరునంతటన్
మనసిజుఁడిచ్చు మెచ్చునగు ♦ మచ్చికచెయ్వులఁ గోరునంతటన్
మొనసిన నెయ్యపుంగలిమి ♦ ముద్దులమాటలఁ గోరునంతటన్
దినమొకవింత గాఁగ నిట ♦ దేఱె వధూమణి కేళిచాతురిన్.

సీ. కర్ణావతంసమా ♦ కలువ చెక్కుటచాయ, గడపునాలస్యంబు ♦ కలఁకఁ జేసె
మోవిపైనంటిన ♦ ముక్కెరముత్యంబు, కడవ నెత్తెడుజాగు ♦ కాఁకఁ జేసె
నెనఁజేరియున్న ప ♦ య్యెదజాఱఁగాఁ జేయు, సమయదాఁతనకొంత ♦ సహ్యమయ్యె
మునుమున్న పగముజా ♦ తినసీలినడరించు, తడవు ధైర్యముమీఁద ♦ దాడివెట్టె
రమణుఁగూటములందు నా ♦ రాజముఖికిఁ, దొంటివిరహంపు దినములే ♦ తోఁచఁగడచె
నౌర చిగురాకు టడిదంబు ♦ హంతకారి, నిజముఁ దెలియంగనవ్వారు ♦ నేర్చువారు.

వ. ఈకరణి నాతరుణదంపతులకతులమనోరాగంబు గల యోగంబు జరుగుచుండఁ
గొన్నిదినంబులు జనియె నంతనొక్కనాఁడు.

చ. అనుపమతారకాగణస ♦ మావృతయై శశిరేఖ వైఖరిన్
దళచెలికత్తె మొత్తములు ♦ దాను బ్రియాంగన వెంటనంటి రా
జనవరనందనుం డరిగె ♦ సాంద్రమరందఝరీ దరీ వినూ
తనలతికానికేతనవి ♦ తానపురోపవనాళిఁ జూడఁగన్.

ఉ. కాంచె నృపాలనందనుఁడు ♦ కౌతుకభావము మీఱ నంతటం
గాంచనకర్ణికార పనస ♦ కారకురంటక జాతి కేతకా
ద్యంచిత సౌరభోద్గమన ♦ మాశ్రియమంద సమీరఖేలనా
చంచల చంచరీకకుల ♦ సంకులకేళివనాధిరాజమున్.

క. తనపరిజనముల నందఱ, వనబాహ్యమునంద యునిచి ♦ వనితాశతమున్
వెనువెంటనంటి రా నా, ఘనుఁడు ప్రవేశించెఁ గేళి ♦ కావనవీథిన్.

సీ. ఇదిగదా మదలీల మెదలఁడు ♦ మ్మొదలచే, గిరిగొన్న సురపొన్న ♦ [illegible]
యిదిగదా విరితేనె ♦ వెదచిందు పందుఁజెం, దిన చోట్లఁ గలిగొట్ల ♦ నీడజాడ
యిదిగదా విరహిపై ♦ నెదురెక్కు గురువింద, బలుచాలు వలరాద ♦ వారిదారి
యిదిగదా పలుతావు ♦ లుదయించు విరులచేఁ, బరువైన సహకార ♦ తరువు తెరువు
సామి యిదిగదె నవవిలా ♦ సామితప్ర, ఫుల్లసుమవల్లి శాసేక ♦ మల్లి కామ
తల్లి కావల్లి కాకీర్ణ ♦ ధరణిసరణి, యనుచు వనపాలకులు దెల్ప ♦ నరిగె విభుఁడు.

గీ. ఊడిగపుచేడియలు గొంద ♦ ఱొదిగిచేరి, దండవినయంపు దారిఁ గై ♦ దండలియ్య
నయ్యవనిపాలకన్యక ♦ న్యాసహస్ర, కలితయై యేగె నక్కేళి ♦ కావనంబు.

సీ. ఇవి యాలకులతీవ ♦ లీవలఁ జనరాదు, పెల్లుమల్లియఁ బల్లి ♦ బిల్లిఁగూడె
నివి కన్నె సురపొన్న ♦ లింపుఁ జెందఁగరాదు, గొప్పపుప్పొడి లిప్ప ♦ లుప్పతిల్లె
నివి చాలు పొగడలీ ♦ యిక్కఁ ద్రొక్కఁగరాదు, విరిఁదేనె కాలువల్ ♦ దరులు మీఱె
నివి గున్న లేమావు ♦ లీదారిఁ బోరాదు, తలిరుమెకో యిలమూఁక ♦ దారిగట్టె
ననుచుఁ దనచుట్టుఁ గనుపట్టు ♦ వనితలిట్లు, వనముసిరిఁ దెల్పి చూడ నా ♦ మ్రనమునందు
సమునితానందమందియా ♦ సకియ దనియె, విమలరుచిఁ జెంది సుద్యాన ♦ వీథియందు.

సీ. చూతమా యిది చేరి ♦ చూతమా శుకపోత, జాతమా నిరీతి ♦ చేతనమరు
వకులమా వినుతదే ♦ వకులమా యిదినవ్య, ముకుళమాలికల చే ♦ ముద్దుగులుకు
కుందమా యిది దాయ ♦ కుందమా మధుబిందు, బృందమా నెను తేఁటి ♦ జెదరిపోవు
తిలకమా వరమా ♦ తిలకమా యిది మాప, జలకమానుష మోద ♦ కళఘటించు

నను మనాయూయుత నళినీ ♦ నాదరించి, చంచరీకనిభాలకల్ ♦ సంచరింపఁ
గాంచి యాఘరణీనాథ ♦ కన్యయంత, నంతరంగప్రమోదసం ♦ క్రాంతినలరె.

తగడ. కలియఁగోకనుమా ♦ సిరిగలతావులు, చలువలతో నెద ♦ చల్లెడుతావులు
జిగిగలయీడిరిసిప్ర ♦ విరి కేసరి, తగనీమెత్తని ♦ తనువునకేసరి
చేరెనరందముఁ ♦ జెలులీపాగడకు, నూరకయుండఁగ ♦ నుచితమె పొగడక
కనమునసయ్యెడిఁ ♦ గద యీపాటల, తనరెడితేఁటుల ♦ దట్టనిపాటల
విరహులప్రైఁదగు ♦ వేఁటులకోయల, మఱువకకూయుచు ♦ మసలెడికోయిల
గురుతగునీవిరి ♦ గుత్తుల చందము, గరిమెతో నీద ♦ న్గవ సరియుందము
మఱియీచిప్రురులె ♦ మరునికటారులు, యెంతయుమృదులత ♦ యీగోరంటను
కొంతైనానీ ♦ కొనగోరంటకు, పుష్పాడి తొగసెం ♦ బొడవుగవింటికి
గొప్పవితానము ♦ కొన్నినవింటికి, నవవనరమనా ♦ నారంగంబులు
నవనీయుములీ ♦ నారంగంబులు, వనితామణికన ♦ వలదా నిమ్మలు
వనభువిగలవా ♦ వలదానిమ్మలు, కాంతకోయీనుమ ♦ ఖచితవధూకము
కోకనీపుప్రు ♦ గొమ్మలువంతము, సారెకునామది ♦ సమ్మదవంతము
ననిచినయీపా ♦ న్నలనవకలికలు, గనుఁగొనఁగామదిఁ ♦ గలవుశుకాలికలు
చెలియాగేదఁగి ♦ చిత్తజుకుంతము, చెలువగునీజడఁ ♦ జేస్పటకుంతము
పరసిజముఖియీ ♦ చంపకజాలము, సిరియంతయు నుతి ♦ సేయఁగఁజాలము
చిప్రురులతో విల ♦ సిల్లురసాలము, నవ్వఁగదవే యు ♦ న్నతసురసాలము
సెనయకకూడగలఁ ♦ దికకూంగేలికిఁ, గనుఁగొనఁదగుని ♦ కకూడవనకేలికి
తరతెనునివె చం ♦ దనమారుతములు, పరిచితకోకిల ♦ భామాతతములు
మానినియిందిగో ♦ మధురసపారము, గానఁగనయ్యెడి ♦ గలితాసారము
మకురూవఁదెల్పెడు ♦ మనకీరమ్ములు, వాకురూలికమ్ములు ♦ వనకీరమ్ములు
వావిరిపువ్వులు ♦ వరుసలు వింతలు, గావేయువియె ♦ కకూడఁగలవింతలు
మగువరోయీవిరి ♦ మల్లెలగంధము, గగనముముట్టెనుఁ ♦ గడువెరగందము
వెఱువకు మంకెన ♦ విరిజగడంబులు, దొరకొనువేపుల ♦ తో జగడంబులు
చూపవె యీలత ♦ చోనోకరాగము, చూపెడునదినీ ♦ చోనసురాగము
యెలనాగరో విను ♦ మీనవమాలిక, గలుఁగఁగనోప్పెడు ♦ గదవనమాలిక
వలనుగయీగోరు ♦ వంకలపాదలును, దలఁచుచునున్నవి ♦ దట్టనిపాదలను
నరుగదువనరమ ♦ యనికొనియాడుచు, సంతసమందఁగ ♦ సరసములాడుచు
వెలఁదులుదిరిగిరి ♦ విమలామోదము, వెలయఁగమెచ్చుచు ♦ విమలామోదము.

చ. ఒకచెలి పొన్నగున్నకడ ♦ నొయ్యన ముద్దుటలాఁతి మున్నెఁ ద
త్స్ఫుటితదంతపంక్తిరుచి ♦ పర్వ నఖర్వసుమంబులం జూ నే
తోకసతి కేలుఁదాప విక ♦ టోత్పలలోచనలెల్ల నవ్వఁగా
వికచసుమోత్కరంబు ప్రభ ♦ మించెను దానిఁ బరిస్ఫుటంబుగన్.

గీ. మగువయొక్క తె గోరంట ♦ మాటునందు, దాఁగియుండఁగఁ గనియోర్తు ♦ గౌఁగిలింపఁ
బోయి రయమున నామానిఁ ♦ బొదవుకొన్నఁ, గ్రొన్ననలు దానిఁ జనియించె ♦
[సన్నుతముగ.

చ. ననలు జనించె నిందులకు ♦ నంబుగఁ గామిను లెవ్వరేనియున్
గనఁగలరే యటంచు నొక ♦ కంజవిలోచన నవ్వు తాలకై
యనఁగ విశాలనేత్రలగు ♦ నందఱు సుందరు లబ్బురంబుతోఁ
గనుఁగొన నుప్పతిల్లెఁ దిల ♦ కంబునకుం వివిధప్రసూనముల్.

చ. గురుకుచయోర్తు కేళిడు ముఁ ♦ గోయఁ దలంచినయట్టి నిద్దపున్
విరిగొన నొక్క యింతి పరు ♦ వేచనఁ గాఁగని దానిఁ బెంబడిన్
బరువడి కూడ కామధుర ♦ భాషిణి వారి సీడ నిల్చి యూ
స్సురనిన నిస్సరన్మృతుల ♦ సూదరమైయుడియొప్పె సెంతయున్.

ఉ. నెనరువహించి ప్రేంకణపు ♦ నీడఁ బ్రియాఁ గన మంతనంబుఁ జెం
తనరొక యింటు బింబముఖి ♦ నీవనురాగము చేయు నామనం
బునకుఁ గడుం బ్రమోదమని ♦ ముచ్చట చెప్పఁగ నప్పుడంతి దా
నినిరొక పాటవాడఁ బ్రిథ ♦ వించెను దానికిఁ గోరకావళుల్.

ఉ. క్రొన్ననదండదండ నొక ♦ కోమలి గూర్చుకొనంగ వంచన
న్నన్నియయోర్తు గైకొని య ♦ ఖండరయంబున నేఁగి యొక్క యా
ఘ్యున్నతమైన కాంచనపు ♦ భూరుహమెక్కఁ గూడ నేఁగియం
తన్నలినాక్షి నాచెలిన ♦ దల్పననల్ జనియించె దానికిన్.

గీ. ముచ్చటలు చెప్పుకొంచును ♦ ముదితలెల్ల, వచ్చి యచ్చేరువను నిల్వ ♦ హెచ్చుదనరి
వచ్చిజగిడికన నటించ ♦ విచ్చలవిడి, గ్రుచ్చినట్లుగ విరులాసెఁ ♦ గొండగోఁగు.

ఉ. అంగనయోర్తు పానరతి ♦ యానఁగ మన్మథపాత్రి మూది త
న్వంగి యొకర్తు కొంత మధు ♦ వాదటఁ బుక్కిటఁ బూన నంతలో
భ్రింగకయుండ నొట్టిడ స ♦ మీపము కేసరభూరుహంబు మీఁ
దంగడు నలర్తో నుమియ ♦ దానికిఁ గల్గె నవప్రసూనముల్.

ఉ. బాలలు చెంతలన్నిలిచి ♦ పల్కఁగ మోవులనుప్పతిల్లుచెం
డాలుసుమాళి గాఁదలఁచి ♦ దగ్గఱ యొక్క తెసిగ్గుఁబూనికం
కేలిమహీరుహంబుఁగను ♦ గిన్కఁబదంబునఁదన్ని నంతలో
నాలసమానకాంతి వెల ♦ యం జనియించె నవప్రసూనముల్.

ఉ. పల్లవజాతి కెంజడల ♦ భాతిఁ జెలంగఁగ నతిప్రియామనో
వల్లభులీలఁ గాంచె నిది ♦ వారకదీనికిఁ జంద్రరేఖ సం
ధిల్లిన లెస్సయంచు నొక ♦ నీరజలోచన గోరి గోరుచే
గిల్లినయంత మామిడికిఁ ♦ గీల్కొనియెన్ ముకుళప్రకాండముల్.

గీ. కలఁదు లీరీతి నుద్యాన ♦ వీధులందు, నెమ్మిఁ గావించు విహృతుల ♦ న్నియు నయత్న
దోహదములు విలాసనం ♦ దోహములుగ, నగుచు నద్ధరణీనేత ♦ నలరఁ జేసె.

చ. మరునికి దూతలై నతుల ♦ మానసము మానుపునన్న శంకనో
తరుణాలయంగకోమలత ♦ దార్కొనఁ గోరునఁటన్న గిన్కనో
సిరిగలయావనస్పతులఁ ♦ జేరవఁటన్న యమర్షయుక్తినో
యొఱవడిఁ గాంతలెల్లఁ జల ♦ మొప్పఁగఁ గోసిరి పువ్వులన్నియున్.

. అంచితోద్యానవీధిని ♦ వారకలన, నలసి యాశీతభానుబిం ♦ బాస్యలెల్ల
నంబుజకదంబభూషితం ♦ బైన సరసి, డాసిరంతం జలక్రీడ ♦ యాసఁదగిలి.

. తటభూరుహాంచలో ♦ త్కటకీరశారికా, కులసమాకులరవ ♦ చ్ఛలము చేతఁ
బులినస్థలానంద ♦ కలనాంచితరథాంగ, మిథునవాక్చాతుర్య ♦ మిషము చేతఁ
గమలనాళాశన ♦ క్రమలాలసాలస, త్కలహంసనాదకై ♦ తవము చేత
మకరందపానాతి ♦ మదశదాలోలరో, లంబగీతాపదే ♦ శంబు చేత
విలువవలువకు గణియింప ♦ నలవిగాని, పరిమళవిభ్రమ మమరనా ♦ పరిమదల్లి
సారసారససౌరభో ♦ ద్గారజనవ, శీకరము గాంచి రొక్కప ♦ ద్మాకరంబు.
[ప్ర]రంభణముఁ జేసెఁ ♦ బద్మ పద్మవిహారి, హరి మందానిలాం ♦ కూరరాజి
నుచితాసనము లిచ్చె ♦ రచితరూపవిలాస, వాసైక సైకత ♦ వ్రాతజగతి
స్వాగతంబులు వలెకఁ ♦ సంచలత్క్రౌంచలా, లితకేళిరతమరా ♦ ళీవరాళి
పాద్యంబులొసఁగె నం ♦ భంగభంగతటాగ్ర, పృథువనాఘువినోద ♦ బిందుసమితి
యువిరతోద్యానవనవిహా ♦ రాధిగతని, తాంతతనువల్లికాక్రాంతి ♦ శాంతిసేయ
సరసి డాయంగఁ జేరిన ♦ సఖులకెల్ల, బాంధవగృహోపచారసం ♦ ప్రాప్తియయ్యె.

ఉ. బింబఫలాధరాళి ప్రతి ♦ బింబమిషంబునఁ జేరవచ్చు నా
గ్యాంబుజపత్త్రలోచనల ♦ నాదరణంబునఁ గౌఁగిలించుచు
త్సంబుఁ దలంచె నాఁగఁ బ్రియ ♦ దంబమరంగఁ బ్రవేశమయ్యె రో
లంబకదంబగీతపరి ♦ లాలితకేళిసరోంబుపూరమున్.

గీ. చలితకమఠంబు కుంఠిత ♦ చక్రకులము, మగ్నమీనంబు సంభ్రమ ♦ న్మధుకరంబు
జనితభంగంబు కంపిత ♦ సారసంబు, నగుచుఁ గాసారమొకవింత ♦ జిగివహించె.

ఉ. సారసపంక్తు లత్తఱిని ♦ సారెఁ జలించుటయెల్లఁ దన్ముఖా
కారము లేచి చిత్రమునఁ ♦ గంపితశీర్షములైన తీరుగా
నారయ చేల వీచికెన ♦ యొకనైనకురంగనేత్రలే
యూరను లేరటంచుఁ దల ♦ యూఁచినయట్టిపరికాశమయ్యెడిన్.

సీ. జోడువాయక సెంసు ♦ నీడుతేని రథాంగ, యుగముల సెదలపై ♦ నుంచినారు
పగలు చెల్వపుదెల్వఁ ♦ బరఁగు కల్వలు రెండు, నెమ్మొగంబులఁ బూన ♦ నేర్చినారు
పూర్ణచంద్రునికోడఁ ♦ బొంది సేయఁగ జాలు, కమలముల్ ధరియింపఁ ♦ గలిగినారు
చంపకంబులమైత్రి ♦ జరపు తేఁటులగుంపు, నిజశిరంబులఁ బూన ♦ నేర్చినారు
వీరు తరుణులు గారు భా ♦ వింపఁ దన్ను, గెలువ నూహించి వచ్చిన ♦ కొలను లనుచు
నాత్మభయమందు రీతిఁ బ ♦ ద్మాకరంబు, సంచలించె సతుల్ ప్రవే ♦ శించినంత.

సీ. అలఁతియూరుపుదెమ్మె ♦ రలు ముమ్మరము తావి, జలజాళి వాసింపఁ ♦ దలఁచినట్లు
విరియు గొప్పులు గొప్ప ♦ సిరులతేటుల మేని, కప్పు విప్పుఁగఁ జేయఁ ♦ గడఁగినట్లు
వాలు జూపుల గంటు ♦ మీలడాలుకు వింత, మేలు గీలింపఁగా ♦ మించినట్లు
వళిమూపకళవీచి ♦ కలకు నచ్చెసముగా, వింత మించియుపక్ర ♦ మించినట్లు
చలితసత్పాణికిసలయ ♦ చ్ఛాయ చేతఁ, గోకనదకదంబాకృతుల్ ♦ కొత్తరైన
చెలువు వహియింపఁగాఁ జేయఁ ♦ దలఁచినట్లు, సరసిజేక్షణ లీఁదిరా ♦ సరసినీట.

గీ. సలిలకేళిశ్లథాంబరా ♦ జలజముఖుల, కొప్పులప్పుడు తనుకాంతిఁ ♦ గూడికొప్పెఁ
గొప్పిమ్మొయింగులతోఁ గూడ ♦ ముమ్మరముగ, జలధినీరానుజలధర ♦ చ్ఛటలనంగ.

సీ. చలితవీచీనర్త ♦ కులకుఁ గంకణఝుణ, త్కారముల్ మృదుతాళ ♦ గతులుగాఁగ
నలినాయనీజాత ♦ ములకు మంజులభావ, ణములు వీణానిక్వ ♦ ణములుగాఁగ
గమలినీనృపకన్య ♦ కలకు హాసప్రభా, వళులు పెంపుబట్టుపా ♦ వడలుగాఁగ
రాయంచ చెలులకు ♦ రమణీయభుజమృణా, ళికలు నిద్దంపుఁగా ♦ నుకలుగాఁగ

విహారదురగవధూటికా ♦ వీక్షణాళి, ధానమీనంబులకు విస్త ♦ దంబులైన
లలితకబరీభరములు జా ♦ లములుగాఁగఁ, జంద్రవదనలు జలకేళి ♦ సలిపిరపుడు.

సీ. ప్రతిబింబరవిసమీ ♦ పమున కేఁగఁ దలంచు, చక్రంబుఁ జనవరో ♦ జములు మీఱ
బహురూపకుముదినీ ♦ ప్రత్యక్షపూర్ణేందు, మూర్తులో యనముద్దు ♦ మోములమరఁ
గాముతామరతూపు ♦ గమికిఁ దోడై వచ్చు, చిగురులో యనఁ బడ ♦ క్రీలు వెలయఁ
బాతాళమున నుండి ♦ బయలెక్కు చీఁకటి, తుప్పలో యనఁ గొప్ప ♦ కొప్పులలరఁ
బదను బెట్టంగఁ దెచ్చిన ♦ పంచబాణ, ధరుని సమ్మోహనాస్త్రసం ♦ తతులనంగ
జిగిఁ దనరు నంగవల్లికల్ ♦ చెలువు మాప, సరసజనగేయమయ్యెఁ ద ♦ త్సలిలకేళి.

గీ. చల్లుపోరుల నొకవింత ♦ సంభ్రమంబు, నోలలాటల నొక నవీ ♦ నోత్సవంబు
చలిమిఱుఁగులకల నొకక్రొత్త ♦ చేష్టితంబు, గలుగ జలకేళి సలిపిరా ♦ కంజముఖులు.

క. కరిణీమధ్యకరీంద్రము, కరణిం నృపనందనుండు ♦ కౌతుకయుతుఁడై
తరుణీజనమధ్యంబున, సరసగతిం సలిలకేళి ♦ సలిపెం దానున్.

సీ. ప్రకటితోన్నతకాండ ♦ పద్మప్రకాండముల్, ధవళాతపత్రసం ♦ తతులుగాఁగ
నుండిన రాజహం ♦ సోత్తంసములు వధూ, రత్నచాలితచామ ♦ రములుగాఁగఁ
జలచంచరీకస ♦ ల్లలితఝంకారంబు, గాయనగీతికా ♦ క్రమముగాఁగఁ
జటులసారసకులా ♦ చలితసన్నాదంబు, భాసురాలోకశ ♦ బ్దంబుగాఁగ
సాంద్రజలశీకరంబులు ♦ జలజముఖులు, పెల్లుగాఁ జల్లు క్రొవ్విరి ♦ ఒల్లుగాఁగ
నానృపకుమారమౌళి వా ♦ హ్యాళి వెడలి, నట్లు కాసారజలకేళి ♦ యాచరించె.

వ. ఇవ్విధంబున.

గీ. అంతకంతకు జలకేళి ♦ యాసఁ దగిలి, చెంత యమునానఘూర్ణమున గోరా ♦ కాంతి మాని
తోడిచెలికాండ్రఁ దానును ♦ నాడ నట్టి, వేడుకలఁ బ్రోద్ధలై యొక్క ♦ మోడ నెక్కి

క. కౌతుకకేళి చేతఁ దిరు ♦ గన్ వెలుఁగందఁగఁ జేయు పూర్వది
గ్వ్యాతరయప్రభూతబహు ♦ వారితరంగనికాయఘట్టనా
జాలజలభ్రమావళుల ♦ సందడిచే దివి ఘూర్ణమానమై
యాతరియాతటిచ్ఛ్వనిఁగె ♦ యామునవారిధురాంతరంబునన్.

గీ. తరణితోడనె కూడన ♦ ద్ధరణినేత, తరుణికవ్యామవారుఖతాం ♦ తరమునందుఁ
దరణిజలరాశిఁ గ్రుంకిన ♦ కరణి మునిఁగెఁ, దరుణులందఱి తార్త నా ♦ దములతోడ

సీ. హా దైవమెంతకా ♦ ర్యంబుఁ జేసెనటంచుఁ, బెల్లు శోకమున మూ ♦ ర్ఛిల్లువారు
భూనాథ మము డించి ♦ పోవ నేటికటంచు, బహువిలాపోక్తులు ♦ బలుకువారు

నిమ్నగత్యా జేసితో ♦ యమునానదీరూప, పై యున్న జేయుంచు ♦ నాదువాయు
వవ్మన్మథునివంటి ♦ నరనాథసుతు నెట్లు, మఱువఁజాలుదు నంచు ♦ మఱుఁగువారు
నగుచు జలకేళిఁ గావించు ♦ సప్తముఖులు, సఖులుఁ బరివారములు నదీ ♦ ఝరము రెండు
తటములను జేరి ఘనమున ♦ స్తాపరూప, నీరధి మునింగి దరిఁజేర ♦ నేరరైరి.

వ. అంత.

ఉ. వారలు గొంద ఱేఁగి భయ ♦ సంభ్రమమొప్పఁగఁ జిత్రవర్మకా
కూర్గపుపార్శ్వఁ జెప్పినను ♦ గొబ్బున మూర్ఛ వహించి తేఱి దు
ర్వారదురంతశోకమున ♦ వందిరి నాసుతభాగ్యమిట్లు చే
కూరెనె యీశ్వరా యనుచుఁ ♦ గొంతవిలాపమొనర్చి యంతటన్.

వ. అతివిస్మయశోకాకులమానసంబులతోడఁ బరివేష్టించిన యాప్తబంధుమంత్రిపరివారంబులుం దానును దత్సరోవరాభ్యాశయమునాఝరంబు దరికిన్ నిజవసంతవిహీనంబైనవనంబునుం బోలె చంద్రాంగదవిహీనంబై యున్న తత్పరివారంబుఁ జూచి బాష్పపూరితలోచనుండై తనసఖీజనంబులుం దానును నత్యంతదుఃఖావేశంబునఁ బొరయుచున్న సీమంతినీకన్యక డాయంజని యిట్లనియె.

క. అమ్మా నీకిదె పూర్వాక్తి, తమ్మా! యాపార్వతీశ ♦ దయ చాలనిదా
వమ్మా! హా దైవమా!, వమ్మాయెనె నీవు సేయు ♦ వ్రతజాలమ్మున్.

సీ. శ్రీవిభుపద్మేశు ♦ ఘోషిత్తనమ్మితిఁగాని, నిష్ఠురోక్తులు నమ్మ ♦ నేరనైతి
నాతి నీశుభలక్ష ♦ ణములె యెంచితిఁగాని, యిట్టుగా నుంటనే ♦ నెఱుఁగనైతి
వీరసేనకులీను ♦ వెదకి తెచ్చితిఁగాని, యీతనియాయుష్య ♦ మెఱుఁగనైతి
శకునముల్ సామనో ♦ జములుఁ జూచితిఁగాని, కట్టడిదైవంబుఁ ♦ గాననైతి
నెన్ని చింతించుకొన్న నీ ♦ కేమివచ్చు, నింత నాకన్న నిర్దయుం ♦ డెందుఁ గలఁడె
యమునఁ జంద్రాంగదునిఁ జెచ్చి ♦ యజుఁడు ముంచె, నిన్ను ముంచితి దుఃఖాబ్ధి ♦ నేస తెచ్చి

చ. వినయపరుండు నానెవరు ♦ వియ్యము నెయ్యపుటాదరంబుతో
నిసుఁ దనయింటికన్నుమని ♦ నికరముగాఁగఁ బ్రియంబు వలికె యీ
యనఘగుణాభిరాముఁడగు ♦ నల్లునినింటనె యుంచుకొంటి నా
యినసిభతేజు నింటికిఁక ♦ నెవ్వరినంప్రుకునో తలోదరీ.

ఉ. ఈడొకచోటనున్ గనని ♦ యిట్టికుమారునిఁ గన్న యట్టి నా
చేడియ యింద్రసేననృప ♦ శేఖరునంగన యెంత యాత్మలోఁ

వేడుకఁ జెందుచున్నదియొ ♦ వేమరు నెట్లు వచింపఁగా నగున్
గోడలిఁ గన్న లంగనుట ♦ కుందగ నోఁచక పోయెఁ గూతురా.

ఉ. మంగళతూర్యనాదముల ♦ మాధురి దిక్కులఁ బిక్కటిల్ల నీ
యంగన నిన్ను నీపురికి ♦ నంపెద నంచు మనంబులోన ను
ప్పొంగుచు నాదు కోర్కెలు ♦ పూర్ణము లై కడముట్టకుండఁ జం
డాలిఁగద నిన్ను మ్రింగెఁ గద ♦ యంగద యాయమునాంబుపూరముల్.

సీ. పూర్ణేందుబింబంబుఁ ♦ బోలు నీ నెమ్మోము, నే నెట్లు మఱతునో ♦ నృపకుమార
తెలిదమ్మిరేకుల ♦ దెగడు నీ నేత్రముల్, నే నెట్లు మఱతునో ♦ నీతిచతుర
యాజానుదీర్ఘంబు ♦ లైన నీ బాహువుల్, నే నెట్లు మఱతునో ♦ భానుతేజ
నవపంచబాణుని ♦ నవ్వు నీ రూపంబు, నే నెట్లు మఱతునో ♦ మానవేంద్ర
నీవిలాసంబు వినయంబు ♦ నీనయంబు, నీదు శౌర్యంబు ధైర్యంబు ♦ నీబలంబుఁ
దలఁచుకొన్నను హృదయంబు ♦ దల్లడిల్లు, నిన్ను నే నెట్లు మఱతునో ♦ నిషధరాజ.

చ. యమునకుఁ దోడఁబుట్టువని ♦ యందఱు నిన్ను వచింపుచుందురో
యమున తదీయవాక్యము య ♦ దార్థముగా దయ యింత లేక భూ
రమణకుమారు ఘోరతర ♦ రంగతృణీకృతవైరివీరు ను
త్తమగుణచారు ముంచితివి ♦ తావకవారిఝరాంతరంబునన్.

చ. అని యనివార్యశోకకల ♦ నాకులుఁ డైన నృపాలుపాలికిన్
వినుతవివేకవంతులగు ♦ విప్రవరుల్ చనుదెంచి (యెంచి) బో
ధనకరసాధువాక్యసము ♦ దాయపతంగమరీచిలీలఁ ద
ద్ఘనతరమోహసంతమస ♦ కల్పన మాన్పఁగఁ బల్కి రీగతిన్.

క. కలదా యింతటి శోకము, కల దానగుఁ గాని నిజము ♦ గాఁ దలఁచంగా
వలదీ లోకము నీకే, వలదీనత నిట్టితనము ♦ వసుధాధీశా.

సీ. జలబుద్బుదములు శా ♦ శ్వతములై యుండెనా, తనువులయందు ని ♦ త్యత ఘటించు
నీటిపై వ్రాఁతలు ♦ నిజములై నిల్చెనా, నిఖిలసంయోగముల్ ♦ నిజములగును
మృగమరీచికలందు ♦ మేలు ప్రాపించెనా, సంసారములయందు ♦ సౌఖ్యమబ్బఁ
జంచలాలతలతి ♦ స్థైర్యంబు పూనెనా, సిరులతిస్థిరతచేఁ ♦ జెలఁగుచుండు
నేల భ్రమయంగ నకటా ♦ యింద్రజాల, కల్పమాయాప్రపంచంబు ♦ కాంతుఁ దగిలి
తెలిసి తెలియంగఁ జాలని ♦ ధీవిహీనుఁ, డెటుల నావ్యథ శరదము ♦ తీర్చ లేక.

సీ. రుధిరమాంసవికార ♦ రూపదేహమున నై, కుటిలయహంకారంబుఁ ♦ గూర్చినాఁడు
పథికయోగమువంటి ♦ బంధుయోగము ఘన, స్నేహపాత్రింబుగాఁ ♦ జేసినాఁడు
కరికర్ణములవంటి ♦ సిరులందు నెనలేక, 1 (చిందుగర్వంబుఁ) గ ♦ ల్పించినాఁడు
నియతంబులగు దేహ ♦ నిర్యాణములయందు, ఘోరశోకంబులు ♦ పూన్చినాఁడు
పార్వతీభర్త తనమాయఁ ♦ బన్నియుటుల, భ్రాంతినొందింపజనుఁడేల ♦ భ్రమయకుండు
సూత్రధారుని హృదయంబు ♦ చొప్పుగాక, కీలుబొమ్మకువేఱొకటి ♦ లీలగలదె.

ఉ. ఆయువు విద్యయుం ధనము ♦ నాదిగఁగల్గినవెల్ల దేహికిన్
వ్రాయనెకాని తద్విపరి ♦ వర్తనసేయఁగలేఁడు ధాతయున్
వేయును నేలయింకఁ బృథి ♦ వీవరశేఖర యెంచిచూడుమా
కాయమురాకపోకలవి ♦ గాదని మాన్ప సమర్థులేరొరుల్.

క. ఆపదలకు శోకింపక, కాపథమున సిరులుపొఁది ♦ గర్వింపకయే
రూపముననవనితుల్య, వ్యాపారుండగుట లెస్స ♦ వసుధాధీశా.

వ. అనియనేకప్రకారంబుల నవ్విబుధులు బోధింప నారాజచూడామణి యెట్టకేలకు ధైర్యంబవలంబించి పరమప్రేమపాత్రంబైన పుత్రివతంసంబు జాతవేదోముఖంబున తనచెనిమిటింగూడంజనియెడ నన్నఁదద్వియోగంబు సహింపఁజాలక యప్పనినివారించి సఖీసమేతంబుగా నకన్యకంఠోడొల నిపురంబునకుంజని తదీయబాంధవులచేతఁ జందాంగదునకుఁ బరలోకక్రియలుఁజేయించెనంత.

ఉ. చందురుతోడఁబాసిన ని ♦ శాపతివైఖరిఁ జిత్రవర్మరా
2 (ణ్ణందని) సర్వసద్గుణస ♦ నాథునిఁబాసి (చలించి) యాత్మలో
వందురుచుండియున్ భువన ♦ వందితచారుపదారవిందు న
య్యిందుకళావతంసు భజి ♦ యింపుచునుండె నచంచలాత్మయై.

గీ. కాంతయుంతైనఁ జిత్తంబు ♦ కలఁకలేక, జరుపుచుండెను విశ్వాస ♦ సంయుతముగ
భక్తజనతాభినవకల్ప ♦ పాదపాంఘ్రి, రాజుతంబైన సోమవా ♦ రవ్రతంబు.

గీ. అధికసంకటమైన నే ♦ యర్థమైన, విడుతురింతియె కాని యీ ♦ విశ్వమునను
బార్వతీభర్త నమ్మిన ♦ భక్తజనులు, గడువఁజాలరు పూర్వసం ♦ కల్పనియతి.

చ. అంతట నింద్రసేనపుఁను ♦ జాగ్రిణి నందనుఁడిట్టులైన వృ
త్తాంతమెఱింగిశోకవివ ♦ శాకులచిత్తత రాజ్యపాలనా

1 మంచుగర్వంబు (మూలము) 2 రాఁడుఁదశ (మూలము)

త్యంతవివేకహీనమతి ◆ యై కృశియింపఁ దదీయపట్టణం
బంతయు నాక్రమించిరి బ ◆ లాధికులైన యరాతిభూపతుల్.

గీ. వైరులంతట వోవక ◆ వ్వసుమతీశుఁ, బట్టికారాగృహాంతర ◆ బద్ధుఁ జేసి
రతఁడుదుర్బలుఁ డౌటచే ◆ నట్లయుండె, దైవయత్నంబుఁ దప్పింపఁ ◆ దరమె యెందు.

చ. అడియటులుండె నంతటను ◆ యామునవారిఝరంబునందున
య్యదన మునింగిరాజసుతుఁ ◆ డట్లదిగంబడిపోవుచుండ న
య్యుదితపతంగసన్నిభవి ◆ భోజ్జ్వలుఁ గాంచిరి (వారి) కేళిసం
మదమున సంచరించు ఫణి ◆ మానవతుల్ కడునబ్బురంబుగన్.

ఉ. తిన్ననిమేనుఁ జూచి యతి ◆ దీర్ఘభుజాయుగళంబుఁ జూచి వా
ల్గన్నులతీరుఁ జూచి పద ◆ కంజయుగంబుఁ జూచి నిద్దపుం
బున్నమచందమామజిగి ◆ పూనఁగఁజాలు మొగంబుఁ జూచి యా
కన్నియ లెల్ల సంతసము ◆ గన్న మనంబులఁ బల్కి రీగతిన్.

సీ. తనపతాకకు వినా ◆ తనమీనపోతంబు, నరయవచ్చిన ప్రియా ◆ నాస్త్రిఁ డేమొ
కుముదినీపరిరంభ ◆ కుతుకాతిశయచారు, సంచారుఁ డగుపూర్ణ ◆ చంద్రుఁ డేమొ
పాతాళతిమిరసం ◆ ఘాతశాతి, 1 (నివారణోద్ధతి) గన్న ఖ ◆ ద్యోతుఁ డేమొ
తనయిచ్ఛ వచ్చియొం ◆ తయు విహారమొనర్చు, పశ్చిమాశాతటీ ◆ భర్తయేమొ
కాక యీరూప మీకాంతి ◆ గౌరవంబు, నీవిభావిభవంబు నీ ◆ ఠీవి యరిది
యన్యనీతనిసన్నిధిఁ ◆ గన్నఁజాలు, ననుచు డాయంగఁ జేరినా ◆ గాబ్జముఖులు.

సీ. సిరిమీఱు విరివిల్లు ◆ చేతఁ బూనుట లేదు, మదనుఁ డీతఁడు గాఁడు ◆ మతిజావాణి
తారకల్ వెనువెంటఁ ◆ దగిలివచ్చుట లేదు, చంద్రుఁ డీతఁడు గాఁడు ◆ చంద్రవదన
యేకచక్రికతోంగ ◆ మెక్కి యుండుట లేదు, భానుఁ డీతఁడు గాఁడు ◆ పద్మగంధి
నయనంబులనిమేష ◆ నియతిపూనుట లేదు, వరుణుఁ డీతఁడు గాఁడు ◆ వారిజాక్షి
దిశలు వెలిఁగించె నీతని ◆ దివ్యమూర్తి, యారగజగద్వధూటికా ◆ వారహృదయ
హారణకరణేచ్ఛనిటవచ్చు ◆ నట్టిసిద్ధ, పురుషుఁ డేమోయటంచున ◆ బ్బురము పూని.
పాఁపకొమ్మలు తమదంత ◆ పంక్తికాంతి, విమలముఖచంద్రరుచులతో ◆ వియ్యమంద
నవసుధామాధురీలీల ◆ నవఘళించు, లలితమృదుసూక్తి గలనచేఁ ◆ బలికిరిట్లు.

ఉ. ఎవ్వఁడవీవు భూవినుత ◆ యొక్కఁడ కేఁగెద వేమి హేతుకిఁ జే
నివ్వల నాగలోకమిఁక ◆ నెవ్వరికిం జనరాదు నిబ్బమీ

1 శాతనవాంఛ తిరగన్న (మూలము)

ఘనప్రబాహుదండపరి ♦ మాణవిశేషము చేత శేషుతోఁ
జిహ్వయొనర్ప నేఁగెదవొ ♦ సిద్ధముగా వివరింపు మంతయున్.

క. నావుడు చంద్రాంగద నా, మావనిపతి యగుట దాను ♦ యమునానదిలోఁ
నావ మునిఁగి వచ్చుటయును, నాతనితల కేర్పరింప ♦ నందఱుఁ దపులోఁ.

ఉ. మానవుఁడైనఁగాని యతి ♦ మానుషయౌవనశేఖుపీనికిన్
గానఁగనయ్యె నియ్యమునిఁ ♦ గన్నను బన్నగభర్తృసమ్మదాం
భోనిధిఁ దోలలాడెమన ♦ పూర్వవిలాసము గల్గెడుం దదా
స్థానికిపీనివాక్యసము ♦ దారసుధారససారసంగతిన్.

మ. అని యాలోచనచేసి యానృపసమా ♦ రాదేవతారాణ్ని కే
తనలక్ష్మీవిభవంబునవ్వభుజగేం ♦ ద్రస్థానసౌభాగ్యముల్
గననీకు న్మనసయ్యెనేని నిటఁజ ♦ క్కన్ రమ్ము మా వెంటనా
యనిలాహారకులాధినేతదయనీ ♦ యందుం జిరంబయ్యెడిన్.

శా. తుచ్ఛంబుల్ నరలోకసౌఖ్యములు మా ♦ తోఁగూడ నీతెంచినన్
స్వచ్ఛాకారవిశేషశేషముఖభా ♦ స్వద్భోగిమాడాగ్రర
త్నచ్ఛాయాదళితాంధకారమగుపా ♦ తాళాఖ్యలోకంబునం
దిచ్ఛాధీనములైనభోగములు నీ ♦ కెల్లప్పుడుం గల్గెడిన్.

గీ. అనిన నంగీకరించి చం ♦ ద్రాంగదుండు, చనియెఁ దత్పన్నగాంగనా ♦ సహితుఁ డగుచు
ఘనతరామేయతరకాయ ♦ కాద్రివేయు, ఖేలనోత్తాలమైనపా ♦ తాళమునకు.

సీ. అదెకనుంగొనుసమ ♦ స్తానీకలభార, దారకోదారదం ♦ తావళంబు
నదెకనుఁగొనుకుపి ♦ తాదివరాహని, ర్దళితదైత్యాంగర ♦ క్తస్రవంతి
యదెకనుంగొనునిత్య ♦ హరిరక్షితద్వార, బలిగృహప్రాసాద ♦ విలసనంబు
నదెకనుంగొనుసగ ♦ రాత్మసంభవపుణ్య, కాంచనోదారగం ♦ గాఝరంబు
నదెకనుంగొనుపవనాశ ♦ నాధిరాజ, నగరగోపురగతసము ♦ న్నతసువర్ణ
కలశమణిధాగధగియించుఁ ♦ జెలువచెలువ, లచ్చటివిశేషములఁ జెల్ప ♦ నరిగియరిగి.

ఉ. కాంచె నరేంద్రనందనుఁడు ♦ కాంచనరత్నమయాభిరామసౌ
ధాంచలచంచరీకచికు ♦ రాతినిశాతకటాక్షసాధనో
దంచితపద్మశాణగళి ♦ తాదర (మేదుర) భావసంచర
త్పంచశిలీముఖంబయిన ♦ పన్నగరాజపురాధిరాజమున్.

సీ. కోటమూఁటికిఁ గెంపు ♦ గుంపు లింపొనరింపఁ, జాలు బాలాతప ♦ శ్రీలఁ బీన
రాచరచ్చలఁ బొదల్చు ♦ రహిఁ దెచ్చు మగఱాల, జిగి యిచ్చు వెన్నెల ♦ చిన్నెలు మిగు
గొప్పయుప్పరిగెల ♦ కొనలఁ దాచినపుష్య, రాగంబు నెఱసంబు ♦ చాలుఁ దెలుప
మేలు నీలపుఱాల ♦ నేలనిద్దపుఱాలు, వితతాంధకారసం ♦ హతిఁ ఘటింప
భానుహిమభానుసంపర్క ♦ హీనమయ్యు, నమరదివసనిశాలక్ష ♦ ణములుగొన్ని
పూని వైచిత్రిఁ ఘటియించు ♦ భుజగరాజ, పట్టణముఁ గాంచె నప్డు దా ♦ నృపాలసుతుఁడు.

సీ. బహునందనోద్యాన ♦ భాసమానము నేను, గనసద్వితీయనం ♦ దనము దాను
నిరతంబు శతకోటి ♦ హరిసంశ్రయము నేను, దగ నేకహరిపాలి ♦ తంబు దాను
భూవినుతానంత ♦ భోగయుక్తము నేను, నశ్వరభోగపూ ♦ ర్ణంబు దాను
సంతతంబు సమాన ♦ చరస(మూహ?)ము నేను, సతిలక్షితవిమాన ♦ చరము దాను
త్రిదివ మది యెంత యనిదర ♦ స్మదవతీని, తానమౌక్తికసౌధసం ♦ తానజనిత
నవ్యరుచికైతవంబుచే ♦ నవ్వుమఁడు, ఫణిపతిపురంబుఁ గాంచెన ♦ ప్పార్థివుఁడు.

సీ. పతికర్ణములశైల ♦ సుతపల్కు నతిరహ, స్యోక్తులు వింటివే ♦ నొక్కనాఁడు
నగసుతాకుచతట ♦ న్యస్తకస్తూరికా, యోగంబుఁ గంటివే ♦ నొక్కనాఁడు
హైమవతీకాంత ♦ సీమంతకుంకుమం, బొకయింత దొరిసెనా ♦ యొక్కనాఁడు
గిరిజాకరాంబుజా ♦ చరితసంవాహనా, నూనసౌఖ్యముఁ గంటి ♦ నొక్కనాఁడు
నేన నేనమహాభాగ్య ♦ నిధి నటంచు, హరుని కొకవేళ కుండలా ♦ హారవర్య
హంసకములై వసించు నా ♦ గాధిపతుల, పలుకు లాకర్ణించి విని యెన ♦ ప్పార్థివుండు.

వ. ఈకరణి ధరణీరాజనందనుం డత్యానందకరంబు లైనపరమాశ్చర్యంబులకు భాజనంబై సంపదలకు నేకనివాసంబై పుణ్యంబులకు నసాధారణశరణంబై వెలయు నచ్చటను జని పుటభేదనంబు హృదయకల్మషవిభేదనంబుగాఁ గనుంగొని యంత వివిధమణిఘృణీవారకిమ్మీరితాశాంతరంబును బహువేత్రిహస్తప్రశస్తదర్వీకరహుంకారసంకులంబును ననేకముకుళితశయచిత్రేశయరుచిరాశయస్తుతిశతప్రణదమేదురంబును నపరిమేయగాయకభుజంగసంగీతప్రసంగశృంగారితంబును నగణ్యవిద్వదురగవరకలితనానాశాస్త్రపురాణేతిహాసాదిగాథావిరావసాంద్రంబును నైనయొక్కయాస్థానభవనమధ్యంబునందు.

• కనకాచలము విల్లు ♦ గాఁగఁ బూనినవాని, కర్ణకుండలమైన ♦ గర్వరేఖ
యిలయెల్లఁ దలఁ దాల్చఁ ♦ గలశేషు గారాపు, టనుజన్ముఁ డైనట ♦ ఖ్యాతిశయము

మహితాహితాలోకసా ♦ మ్రాజ్యలక్ష్మీనిదా, నంబైనమానసా ♦ న్నత్యకలన
రత్నసంపదలచే ♦ రత్నాకరంబుల, హసియింపఁజాలున ♦ హంకరణముఁ
బూనిసింహాసనమున సా ♦ సీనుఁడైన, వానిగర్వనివారిత ♦ వైరిలోక
శకునిశరణాగతా ♦ శేషభుజగ, రక్షకుని దక్షకునిఁ గాంచె ♦ రాజసుతుఁడు.

గీ. అట్లుగనుఁగొని నిటలవి ♦ న్యస్తహస్తుఁ, డగుచు నిర్భీకుఁడై నిల్చి ♦ నట్టివాని
జనవరకుమారుఁ గాంచి భు ♦ జంగనేత, హృదయమున నబ్బురము నొంది ♦ యిట్టులనియె.

ఉ. ఎక్కడనుండి వచ్చితివ ♦ హేతువు గానిటకబ్బురంబు నీ
నిక్కపు బెంకి యొద్దిధర ♦ ణీశులకో సురరాజలోకమో
చక్కదనంబుఁ గన్నసుమ ♦ సాయకుఁడో యని శంకపుట్టెడున్
మక్కువ నీయెడం బొడమె ♦ మాకు నిజంబ కుమారశేఖరా.

క. రారాదిచ్చోటికి నె, వ్వారికి నొక నేర్పు పూని ♦ వచ్చినదియుగన్
బోరాదు నిక్కమిది యే, దారి న్వచ్చితివి నీవు ♦ దారవిచారా.

క. అని పల్కిన భుజగేంద్రునిఁ, గని వినయవినమ్రుఁడగుచు ♦ గంభీరవచో
నినదము ఘనగర్జితముల, ననుకరణము సేయ నృపవ ♦ రాత్మజుఁ డంతన్.

సీ. చామరగ్రాహిణీ ♦ సంచలత్కరకంజ, కంకణక్రేంకృతియల్ ♦ గట్టువడఁగ
కోణాధరశ్రేణి ♦ పాణివీణానిక్వ, ణములెల్ల సంస్తంభ ♦ నంబునొంద
సకలవిద్వల్లోక ♦ శాస్త్రనానావివా, దములన్నియును విరా ♦ మము వహింప
వరనర్తకానీక ♦ వాద్యనాదమృదంగ, శబ్దంబులెల్లవి ♦ శ్రాంతిపూనఁ
దలుముఁజెలునపూర్వవెన్నెల ♦ తళుకులీను, వదనచంద్రునియెడఁ గల్గు ♦ వాగమృతము
నహితకులాధీశసభ్యక ♦ ర్ణాంతరములఁ, బ్రౌఢిమ జనింప నింప ♦ నుపక్రమించె.

సీ. ఆచక్రవాళధా ♦ త్రీచక్రమేరాజు, పాలించె నేకాత ♦ పత్రముగను
తనుసంస్మరించిన ♦ జనవర్గములకెల్ల, నేరాజు కలిదోష ♦ హారియయ్యె
నతిసుందరులకెల్ల ♦ నవని నేరాజుప, మానకల్పకుని ♦ డానమయ్యె
నిస్సంశయంబుగా ♦ నిఖిలాశ్వహృదయంబుఁ, గాంచె నేరాజర్థి ♦ గౌరవమున
నట్టి నలరాజు మణిదమ ♦ యంతియందుఁ, గనినసుతుఁ డింద్రసేనుఁడా ♦ ఘనునకేను
నందనుఁడ నిశ్చలధ్యాన ♦ నందితభుజ, గాంగదుఁడనంగఁ బఱఁగుచుం ♦ దాంగదుఁడను

ఆ.వె. చిత్రవర్మకూతు ♦ సీమంతినీకన్యఁ, బెండ్లియాడి మివులఁ ♦ బ్రేమఁగూడి
మామగారియింట ♦ మహనీయకౌతుకా, ధీనవృత్తిఁగొన్ని ♦ దినములుండి.

సీ. వందిసందోహమే ♦ వరదుసద్గుణబృంద, మహిమఁ గీర్తింపసా ♦ మ్నాయవితతి
శతపత్రార్భకంబులే ♦ స్వామిపూర్ణదయాసు, ధాంభోనిధికిఁ బద్మ ♦ జాదిసురలు
బహుబుద్బుదంబులే ♦ ప్రభుని మాయామహా, ఘూర్ణికి పద్మభవాండ ♦ సముదయములు
విస్ఫులింగంబులే ♦ విభుని తేజోవహ్ని, కంభోజబంధుచం ♦ ద్రానలంబు
లమ్మహాదేవుఁ డఖిలలో ♦ కైకభర్త, యాదిపురుషుండు సకలవే ♦ దాంతవేద్యుఁ
డార్తరక్షణదీక్షాద ♦ యావిహారి, మదనవైరి శరణ్యుండు ♦ మాకు నెపుడు.

శా. వేదాంతంబులు గానలేనట మహా ♦ విద్వాంసులైనట్టి బ్రి
హ్మాదుల్ నిక్క మెఱుంగఁజాలరట మా ♦ యామోహనభ్రాంతులై
యే దేవోత్తము దివ్యతత్త్వమహిమం ♦ బిందాద్రిదిసేవ్యుండతం
డాదిత్యాయతతేజుఁ డీశ్వరుఁడు మా ♦ కారాధ్యుఁ డెల్లప్పుడున్.

ఉ. భావజుఁ గాల్పఁజాలిన ప్ర ♦ భావము మృత్యువు నాగ్రహోదిత
భూరివిక్రుతిం దెఱచినప్ర ♦ భుత్వముఁ గాంచి విరించిముఖ్యులౌ
దేవతలెవ్వనిం దమకు ♦ దేవతగా భజియింతురమ్మహా
దేవుఁడు సజ్జనాశ్రితవి ♦ ధేయుఁడు మాకు శరణ్యుఁ డెప్పుడున్.

'. అనవిని సన్నగాధిపతి ♦ యాతనికిట్లను దావకీనవా
గ్వినయముఁ జేకచాతురికి ♦ విశ్వవిభుండగు చంద్రమౌళిపై
నన సముభక్తి వైఖరికి ♦ హర్షముఁ బూనితి నేఁటినుండి మా
కనయము నిష్టబంధువుఁడ ♦ వయ్యెదు నీవు నృపాలనందనా.

. ఇదిరత్నమయలోక ♦ మింగుఁ జందాద్రియుగ్రాల, నాఁక లేదున్న నీ ♦ లోకమునను
నమరకాంతలు మెచ్చ ♦ రనయంబుని చోటి, కాంతలు సౌందర్య ♦ గర్వరేఖ
కల్పద్రుమంబులే ♦ కాంతారతరుజాతు, లన్నియుని ద్భుని ♦ ష్ఠాగసమితి
సరసులన్నియుసుధా ♦ సారపూరితములై, వర్ణనీయశ్రీల ♦ వఱలుచుండు
జరయు రోగంబులె చోటఁ ♦ బొరయకుండు, మరణభయమెన్నఁటికి లేదు ♦ మానవేంద్ర
యిందువిహరింపు నీవు య ♦ థేష్టభోగ, భాగధేయామితశ్రీలఁ ♦ బరిఢవిల్లి.

వ. అనినఁ జంద్రాంగదుం డతనికిట్లనియె.

సీ. అతిపుత్రవాత్సల్య ♦ యుతులు నాతలిదండ్రు, లకట యేదురవస్థ ♦ నందిరొ
నాకన్నవారికి ♦ నందనుల్ మఱి లేరు, ఘనజరాభారసం ♦ క్రాంతతనులు
నాయత్తమామల ♦ నాయత్తజామాత్ర, సౌహార్ద్రమున నెట్టి ♦ జాలిఁబడిరో
ప్రియవధూమణి క్రొత్త ♦ పెండ్లికూతురు బాలఁ, దానెట్టి విరహాగ్నిఁ ♦ దారసిరొ

సీ. తనతనుకాంతియెం ♦ తయు లేక పగలింటి, శశిరేఖకెనసేయఁ ♦ జాలు దానిఁ
దనసద్విలాసమెం ♦ తయు లేక యామినీ, గతసరోజినిఁ బోలఁ ♦ గన్న దానిఁ
దనయలంకారమెం ♦ తయు లేక వాసంత, మాలతీవల్లికఁ ♦ బోలు దానిఁ
దనయున్నతత్వమెం ♦ తయు లేక నైదాఘ, సరసీసామ్యంబుచేఁ ♦ బఱఁగు దాని
నింపువారవ్రతాసక్తి ♦ నింపుచూడ, భక్తియును రెంపు నే కాని ♦ ప్రాగ్విలాస
యుక్తియేమియుఁ గానరా ♦ కున్న దానిఁ, దనవధూమణి రాజనం ♦ దనుఁడు గాంచె

క. సందేహము నొందియు నొక, చందంబునఁ దెలిసి హృదయ ♦ సంతాపము వా
పం దలఁపు జేసి యాపూ, ర్ణేందుముఖిన్ డాయఁ బిలచి ♦ యిట్లని పలికెన్.

గీ. తామరసనేత్ర యెవ్వరి ♦ దానవీవు, లలితశుభలక్షణము లెల్లఁ ♦ గలిగియుండి
విమలరుచిమీఱు తారుణ్య ♦ వేళయందుఁ, బతివియోగంబు నీకేల ♦ ప్రాప్తమయ్యె.

తరల. జనకుఁ డెవ్వఁడు భర్త యెవ్వఁడు ♦ చందలేక్షణ నీసనీ
వనజలోచన తెల్ల నేమగు ♦ వారలిట్టి శుభాకృతిన్
దనరు దానవరాజకన్యవొ ♦ ధారుణీసురకన్యవో
వినఁగ కౌతూహలమయ్యె నంతయు ♦ విస్తరంబునఁ బల్కుమా.

క. అనలజ్జాభరవినతా, ననయా నృపకన్యఁ గాంచి ♦ సఖ్యలిచెలులా
వనజేక్షణవృత్తాంతము, వినిపింపఁగఁ దొడఁగి రిటు స ♦ విస్తరరీతిన్.

సీ. చిత్రవర్మనృపాల ♦ శేఖరుకూతురీ, కాంతసీమంతినీ ♦ కన్య యింద్రు
చందాంగదుండను ♦ నింద్రసేననృపాల, సూనుఁ డింద్రసమానుఁ ♦ డీసె లంత
నుద్వాహమైయుండి ♦ యొకనాఁడు యమునలో, జలకేళిఁ గావించు ♦ సమయమునను
1 (మొనసి యందున నోడ ♦ మునిఁగిన) నాథుండు, పరలోకగతుఁ డైనఁ ♦ బద్మగంధి
బహుళవైధవ్యదుఃఖసం ♦ భ్రాంతయయ్యెఁ, దీవ్రనియతిని సోమవా ♦ రవ్రతంబు
గడపుచున్నది పూర్వసం ♦ కల్పరీతి, వత్సరములొండు రెండు గా ♦ వచ్చె నిపుడు.

క. శోకయుతు నింద్రసేన, త్మకాంతుని విమతు లఖిల ♦ జగతియుఁ గొని బం
దీకృతునిఁ జేసిరని మే, మాకర్ణించితిమి సత్య ♦ మయ్యె మహాత్మా.

గీ. అని సఖుల్వివరింప న ♦ య్యవనినాథు, కన్యతా నిట్లు బలికె నా ♦ ఘనునినోడ
మందభాగ్యులమైనట్టి ♦ మమ్ము నడుగ, నేమి కారణమయ్యెనో ♦ సిద్ధ[illegible].

క. నీ వెవ్వఁడవు సిద్ధుఁడవో, దేవుఁడవో కిన్నరుఁడవో ♦ ధీరోత్తమ నీ
భావము విచిత్రమయ్యెడి, భావజహరు చెంతనుండు ♦ పరమధాగ్రణివో.

1 ప్రక్షిప్తము.

ఉ. నావుఁడు మేము సిద్ధులము ♦ నంత బలాఢ్యులమొక్క వేళ ధా
త్రీ నలయింపఁ జూచుటకుఁ ♦ ద్రిమ్మరుచుందుము మింటి యొక్క చో
నీవిభుఁ డున్నవాఁడిటకు ♦ నిక్కము వచ్చును నేఁట రేపటన్
భావమునందు నో పరమ ♦ పావని నీకిఁకఁ జింత యేటికిన్.

గీ. చంద్రముఖి నీవు సోమవా ♦ రమునందు, శివుని గౌరీసమేతుఁ బూ ♦ జించు పుణ్య
మెల్ల ఫలియించె నేఁడు నీ ♦ వల్లభుఁడు, తిరిగి రాఁగలఁ డింక సం ♦ దేహ మేల.

గీ. అతఁడు మాకు సఖుఁడైన ♦ కతన నీకు, మేలు చెప్పంగ వచ్చుట ♦ మీననయన
సత్యముగ దాఁక నీవాక్య ♦ సరణి యెల్లఁ, బరమ సౌఖ్యంబు సేయుం బో ♦ పద్మగంధి.

వ. అని తనకర్ణమూలంబుఁ జేరి పలికిన యప్పురుషమణి పలుకుల కప్పురంపు పలుకుల కర
ణిఁ గర్ణసరణి యెల్లఁ జల్లఁ జేసి హృదయంబునకు నానందోదయంబు సమకూర్ప న
ప్పరమపావని మునిహార్థమాత్రం జేమియుం దెలియంగక యంతటం దెలివొంది యిట్లని
వితర్కించె.

శా. ఆకన్నుంగవ యాలలాటఫలకం ♦ బా మందహాసాననం
బా కేలా భుజమధ్యమా స్తనక యా ♦ యాలాప చాతుర్య మా
యాకారంబున భేదమింతఁడె విభుం ♦ డౌ నట్లు గాకున్న చో
నాకుం జేరి ముఘటింపదన్యునిపయిం ♦ న్యాయంబు చింతించినన్.

ఉ. ఔ నితఁడే విభుం డనుచు ♦ నాత్మఁ గనుం జలనంబు నొందఁగా
నానవహించుఁ గాఁడనుచు ♦ నమ్మకక ద్రిమ్మరఁ జూడుఁ బార్వతీ
జానికటాక్షవృష్టికి న ♦ సాధ్యము గల్గదటంచు నెంచు లో
నూనిన సంశయం బెఱుఁగు ♦ నుస్సురనుం దురటిల్లు నెంతయున్.

క. ఎక్కడి యాశ్చర్యం బిది, యెక్కడి పాంథేశు రాక ♦ యెక్కడి సిద్ధుం
డక్కట కలయింతేయిది, నిక్కము గాదంచు నెంచు ♦ నిజచిత్తమునన్.

ఉ. ఇక్కడనుండి యక్కడకు ♦ నేఁగెడువారలె కాక ధాత్రిలో
నక్కడనుండి యిక్కడకు ♦ నాదటవచ్చినవారు లేరు వీఁ
డొక్కఁడు మాయలాఁడితని ♦ నూరక చేరిక మాటలాడితిన్
మొక్కలమయ్యె వంచుఁ గను ♦ మూయుచు హరస్మరణంబు సేయుచున్.

ఉ. కన్నుల నీరునించు నవి ♦ కారము గాఁ బతిఁ జూడు నాత్మలో
విన్నదనంబుఁ గాంచుఁ గను ♦ వేఁదురుఁ జెందిన యట్టి వైఖరిన్

మిన్నక యుండదు మేలగుని ♦ మిత్త్రములన్నియు నెంచు నేక్రియన్
సన్నిధిఁ గన్న పాణివిభు ♦ నమ్మియు నమ్మక కొమ్మ యత్తఱిన్.

సీ. పరిలక్షణము లెల్ల ♦ నితని యందుండుటయొన్న, విలసితద్వీపంబు ♦ వెదకి డాయఁ
దనుపులందు జనించు ♦ ననవద్యశుభనాద, కము లెన్నఁ దీవలు ♦ గదియఁ జేయు
మునివరభూసురహితా ♦ మోదవాక్యంబెన్న, ఘనయానపాత్రిమె ♦ కన్గొనఁగఁ దలఁచు
నఘటితఘటకుఁడౌ ♦ హరు ననుగ్రహమెన్నఁ, దీరప్రదేశంబుఁ ♦ జేరఁ బోవఁ
ద్రిభువనాశ్చర్యకారణ ♦ దీర్ఘలీల, విభుఁడు ప్రత్యక్షముగ నున్న ♦ వేళయందు
విపులనమ్రాంగ లేనియ ♦ విమ్మనసయున, హృదయమతిసంశయాంభోధి ♦ నీదు నప్పుడు.

తే. అబ్బురముగాక లోకంబు ♦ లందు నెన్న, నబ్బునే యట్టి భాగ్యంబ ♦ టంచు నెంచి
మనసు నమ్రాంగ చాలక ♦ మసలుచున్న, మానవతి ప్రేమ యతనిపై ♦ మలఁకు నన్న.

క. పులకించు నంగవల్లికఁ, జిలికించు ద్రపావిలాస ♦ చేష్టావృతముం
దిలకించి మాచునతని, గలఁగించుక పెంపుఁ జెందుఁ ♦ గందర్పనరున్.

ఉ. అత్తరి నుత్తమప్రియను ♦ మాగతిఁ దానయొతింగి యెంతయుం
జిత్తము మెత్తనై కరఁగఁ ♦ జేయును పాయము గానలేక తా
నెత్తిలి యేడ్చె బాలహరి ♦ ణేక్షణ యంతవసంతవాసరో
న్మత్తపికాంగనా పమస ♦ మంచిత మేదుర నాద మాధురిన్.

తే. అపుడు నృపసూతి బాష్పంబు ♦ లణఁచుకొనుచు, నేల యేడ్చెదవు బాలవై ♦ యింతి నీవు
నేఁడె వచ్చెదను న్నాఁడు ♦ నీవిభుండు, సాక్షులిందుకుఁ బార్వతీ ♦ చంద్రధరులు.

వ. ఏను మదీయసఖుం డైన చంద్రాంగదునకు జనకుఁడగు నింద్రసేనవసుంధరాధిపతికిఁ దదీయకుశలవార్త యెఱింగింపం జనియెద నీవు నావచనంబులు నమ్మి నెమ్మనంబున సుఖంబుండుమని మఱియు ననేకప్రియసల్లాపంబుల నప్పల్లవాధర యుల్లంబు చల్లంజేసి యారాజనందనుండు నిజతురంగంబు నెక్కి చనియె నంత.

తే. తరుణి తన వాలుజూపులెం ♦ దాఁక నిగిడె, నంతపర్యంతమును జూచె ♦ నాత్మవిభుని
నబల యేరీతి నందెనో ♦ యని తలంచి, ధరణిధవసూతి పలుమారుఁ ♦ దిరిగి చూచె.

తే. ఇటుల నృపసూతి చనిన న ♦ య్యిందువదన, యతనిఁ దన పాణివిభునిగా ♦ నాత్మ నమ్మి
యిట్టివృత్తాంత మెవ్వరు ♦ నెఱుఁగకుండ, నుండె నిరతిశయానంద ♦ ముదయమంద.

ఉ. అంతట రాజసూతి పను ♦ దారిని రాకృతుఁ డైన తండ్రి ప్ర
త్త్యాంతము శేషమున్ దెలిసి ♦ యద్భుత రౌద్ర గసంబు మీఱఁగ

ల్పాంతలలాటనేత్రునిక్రి ♦ యన్ వెలుఁగొందుచు నాత్మపట్టణ
ప్రాంతవనంబునన్నిలిచి ♦ పన్నగపుత్రునిఁ గాంచి యిట్లనున్.

సీ. ఇది మాపురోత్తమం ♦ బిందుమజ్జనుఁడౌ, నింద్రసేనకుమా ♦ ధీశ్వరుండు
మద్వారశక్తి చాల ♦ మదిలోనఁ గృశియింప, నహితభూపతులెల్ల ♦ నతనిఁబట్టి
కారాగృహాధీనుఁ ♦ గావించి భువియెల్ల, నన్యాయపరణిఁదా ♦ నాక్రమించి
యున్నవారఁట వారి ♦ యొద్దకు నీవేఁగి, పలుకు మీరీతిని ♦ ర్భయము గాఁగ
నింద్రసేనకుమారుఁడ ♦ నేకశాత్రి, వాంగదుండైనయట్టిచం ♦ ద్రాంగదుండు
తక్షకనివాసమైనపా ♦ తాళమునకు, నరిగి క్రమ్మరవచ్చినాఁ ♦ డద్భుతముగ.

ఉ. పౌరుషశాలినాన్నృపునిఁ ♦ బన్నగరాజసహాయవంతునిన్
మీఱి రణంబులో నెదుర ♦ మీకు నశక్యము దప్పుదప్పులం
జేరి నమస్కరించి మునుఁ జేసినతప్పు సహించుమందు నీ
ధారుణినిచ్చి ప్రాణములు ♦ దాదుకపొం డెటకేనిఁ గ్రక్కునన్.

ఆ. వె. కాక మీరు వీర ♦ కర్మంబపేక్షించి, వత్తుమన్నమిపుల ♦ నుత్తమంబు
సంగరంబునంద ♦ సకలంబుఁ జూతుము, గర్వకథలకేమి ♦ కారణంబు.

క. ఈమాటలు విని యాఖలు, లేమనుచున్నారొ తెలిసి ♦ యిటవేగ మెఱ
పొమ్మా మారుతాశనోత్తమ, యామీఁదం జూత మఖిల ♦ మగుకార్యంబున్.

చ. అని యనుపంగ భోగితన ♦ యాగ్రణి గ్రక్కున నేఁగివారితో
ననుపమయుక్తి నప్పలుకు ♦ లన్నియు నేర్పడఁబల్కి మీర లా
ప్పనిపనియాచరించి నల ♦ పౌత్రునిచిత్తమునందు మిక్కిలిన్
గినుకజనింపఁజేసితిరి ♦ కేవలమే యిదియెంచిచూచినన్.

ఉ. వెంగలిరాజు లారయిఁక ♦ వేజోకబుద్ధుల సుద్దుమాని చం
ద్రాంగదునొద్దఁ జేరి శర ♦ ణన్నఁ బ్రసన్నకృపాంచమేతదృ
ష్టింగని కాచుఁగాని భుజికు ♦ టీకుటిలాస్యుఁ డతండు గాఁడు దు
స్సంగముచేత నట్టిమవి ♦ చారముఁ జేసినఁ జేటుఁ డందమున్.

శా. ఆమాటల్ విని యందఱుంగొందఱు మహా ♦ హాస్యక్రియాఖర్వగ
ర్వామందోక్తులు పల్కఁగా విని తదీ ♦ యామాత్యు లత్యంతమున్
ధీమంతుల్ నృపనీతిమార్గమున నెం ♦ తేమంత్రియూహించి న
ప్భూమీనాథులతోడ నిట్లని రనే ♦ ధృష్ట్యాప్రవాక్యంబులన్.

క. ఎదిరితని సత్త్వమెఱుఁగక, పదరంగాఁదగదు భూమి ♦ పాలునకెందున్
మదదంతావళిరాజము, పదరునె తానెంతయైనఁ ♦ బారీంద్రముతోన్.

ఉ. బాలకుఁడొక్కరుండతఁడు ♦ బాహుబలాఢ్యుఁడుగాఁడు సేనతో
జాలము సేయఁజాలఁడని ♦ హాస్యములాడెదరేల వానిపై
బాలశశాంకశేఖరుఁడు ♦ పారకృపాళుఁడు మీదురుక్తముల్
చాలు బలారికైనను న ♦ శక్యము వానిజయింపఁబోరులన్.

. మానుషబలంబులెంతగుణం ♦ బైనఁగాని, సహజదైవబలంబుతో ♦ సాటియగునె
యంధకారంబుబ్రహ్మాండ ♦ మంతయైనఁ, దరణికిరణైకలవముతోఁ ♦ దారసిలునె.

గీ. శంకరుఁడు శేషదేవతా ♦ చక్రవర్తి, యాశ్రితశ్రేణికనయంబు ♦ నభయమిచ్చు
నమ్మహాత్మునికటాక్షంబు ♦ నమ్మినట్టి, వారినెదిరిజయింపనె ♦ వ్వారితరము.

ఉ. ఇంతియుకాక పన్నగకు ♦ తేంద్రుని చెంతకునేఁగి తత్కటా
క్షాంతనికాంతనిర్మలద ♦ యారసపూరముచేతఁ దేజము
త్యంతముఁగాంచివచ్చినను ♦ వాత్మనిమీకుజయింపవచ్చునే
సంతతమూనితచ్చరణ ♦ పద్మసమీపముఁజేరుఁ డందఱున్.

చ. జనవరులార యిప్పనికి ♦ సాధనమొక్కటియున్నదింద్రసే
నునిమునుమున్నగావిడిచి ♦ నూతనభూషణపుష్పమాల్యచం
దనధవళీకృతాంబరవి ♦ తానముచేతనలంకరించిన
య్యానఁగరుణాసముద్రుఁడగు ♦ నాయనఁదోడ్కొనిభక్తినమ్రులై.

ఆ.వె. ఘనుఁడతండుమిమ్ము ♦ శరణాగతులఁజూచి, కాచుఁగానియుల్క ♦ గనఁడువిప్రు
ఘనులకోపమన్న ♦ ఘనదావకీలికి, [1] (శతణవినతి) వర్ష ♦ జలముగాదె.

క. అనుమంతులవాక్యములకు, ననుమతిఁగావించివార ♦ లానిషధనృపా
లునిపాలికరిగియందఱు, వినతులుగానతఁడుమిగుల ♦ విస్మయయుతుఁడై.

చ. తనయునితోడఁబాసి వసు ♦ ధాతలరాజ్యము మీకునిచ్చునే
ననయము నొక్కయింటఁబడి ♦ యార్తివహింపఁగనిట్టిదైన్యపుం
బనులకువచ్చివారకట ♦ పాపపుదైవము యింతఁజేసితే
యని యనుపంచుఁ గన్నుగవ ♦ నశ్రులురాలఁగ నున్నయాతనిన్.

చ. కని మఱియున్వినమ్రులయి ♦ కావుమమమ్ము నృపాలచంద్ర యా
మునఝరవారిపూరమున ♦ మున్నుమునింగిననీతనూభవుం

1 సభవినతి (మూలము)

డనుపమశౌర్యశాలి భుజ ♦ గాధిపలోకము దాఁక నేఁగి గ్ర
క్కునఁ జనుదెంచినాఁడు ప్రళ ♦ యాంతకుఁడై వడి నుగ్రమూర్తియై.

ఉ. ఆరమణీయతేజుఁడు పు ♦ రాంతికసీమనవాభిరామశృం
గారవనంబునన్నిలిచి ♦ కయ్యముకై పిలువంగ నంపె నా
భూరిబలాఢ్యుతో నెదిరి ♦ పోరఁగఁజాలక తత్ప్రసాదకాం
క్షారతిచేత నీచరణ ♦ సన్నిధిఁ జేరితి మెల్లవారమున్.

గీ. నావు డయ్యద్భుతమునకా ♦ నందమంది, హర్షసలిలంబుకన్నుల ♦ నలముకొనఁగఁ
నిదినిజంబయ్యె నేనిమీ ♦ కిత్తునభయ, మనుచు వారలతోడ స ♦ త్యముగఁ బలికె.

ఉ. ఆరిపురాజులంతటఁ గృ ♦ తార్థయులై నిషధాధినాయకున్
దారసమన్వితంబుగను ♦ దంచితభూషణగంధమాల్యశృం
గారముఁగన్నవానిఁ గన ♦ కద్యుతిసాంద్రరథాధిరోహణో
దారునిఁజేసి తోడ్కొనుచుఁ ♦ దత్పురపుఁగైకొని పాదచారులై.

వ. వచ్చుచునుండి రంతకమున్న చని పన్నగకుమారునివలనఁ దదీయవృత్తాంతంబంతయు విన్నవాఁడగుటఁ బ్రసన్నముఖుండై చంద్రాంగదుండును తండ్రిరథంబున కెదురుచని సాష్టాంగప్రణామంబుఁ జేసిన నతండును బరమానందంబున నాలింగనంబు జేసి దివ్యజ్ఞానంబుఁ గన్నమహాయోగిచందంబున నిశ్చలుండై కొంతతడవుండియంత.

ఆ. వె. చుంచుదువ్వఁగణగు ♦ జుబుకంబుముద్దాడు, మేనునిమురు దనివి ♦ మానిమాచుఁ
దిరుగఁ గౌఁగలించు ♦ శిరముమూర్కొను నింద్ర, సేనుఁడధికమోద ♦ చిత్తుఁడగుచు.

ఉ. తల్లికిమ్రొక్కినన్ గడుము ♦ దంబుజనింపఁగఁ గల్పవల్లికా
పల్లవితాతికోమలభు ♦ జాయుగళంబునఁ గౌఁగలించి యు
త్ఫుల్లసరోజపత్రరుచిఁ బూనెడికన్నుల సమ్మదాశ్రువుల్
వెల్లిగొనంగ దీవనలు ♦ వేయువిధంబుల నిచ్చె నంతటన్.

ఆ. వె. పౌరవృద్ధిమంత్రి ♦ పరివారమెల్ల ను, దారసంభ్రమమునఁ ♦ జేరి మ్రొక్క
వారివారి కుచిత ♦ గౌరవ మొనరించి, ధీరుఁడైననృపకు ♦ మారమౌళి.

చ. తనగురుఁ జేరి మున్నభయ ♦ దానముఁ గాంచినవైరు లంతటన్
వినయముతోడ మ్రొక్కిన న ♦ వీనకృపామతిఁ జూచె నందఱున్
ఘనులగువార లెంతయుప ♦ కారముఁ జేసియుఁ గాండిసీకతన్
జని శరణన్నవారిఁ గని ♦ సత్కృపఁ జూడక యుండ్రె నేతురే.

చ. తనసఖులైనవారును బరి ♦ ధానజనంబు వినంగ నంతటన్
జనకునితో వచించె యము ♦ నాతటినీసలిలంబు వెంబడిన్
మనుఁజనినట్టిలాగు ఫణి ♦ ముఖ్యునిఁగాంచినలాగు సత్కృపం
గని యతఁడంప బెంపుఁగని ♦ క్రమ్మరవచ్చినలాగు నంతయున్.

మ. తనభాగ్యంబున కెల్లవారును బ్రమో ♦ దస్వాంతులై మెచ్చ నం
దనునిం దోడ్కొని యిందిరేసవిభుఁడం ♦ తన్ జారుశృంగారభా
జనమౌ నాత్మపురంబునర్మిలిఁ బ్రవే ♦ శంబై మహీరాజ్యపా
లనకార్యాదికదక్షుఁడయ్యె మివులన్ ♦ లక్ష్మీసమేతంబుగన్.

వ. అంత్యావసరంబున.

ఉ. కొందఱు చామరంబులును ♦ గొందఱమందశితాతపత్రముల్
గొందఱు పాదుకాయుగము ♦ గొందఱు రత్నకలాచికాదులున్
బొందుగఁ బూనికొల్చిరరి ♦ భూపతులందఱు నానృపాలరా
ణ్ణందనునిశ్చలప్రియమధ ♦ నాథపదాంబురుహాభివందనున్.

ఉ. అట్టి యమానుషాద్భుతమ ♦ హత్త్వముఁ గాంచినయట్టి నెయ్యపున్
బట్టినిగూడి నైషధనృ ♦ పాలకుఁ డీశుభవార్త యెంతయున్
గట్టిగఁ జిత్రవర్మకెఱుఁ ♦ గన్ వచియింపఁగఁబంపె భోగిశా
ట్పట్టణదివ్యగంధసమ ♦ భారిసమేతముగాఁగఁ జారులన్.

చ. పనిచినవారునుం బ్రమద ♦ భావముతో నతివేగయుక్తులై
చనియు సమానమానసవి ♦ షాదకృశాంగునిఁ జిత్రవర్మభూ
జనవరుఁ గాంచి మ్రొక్కినవ ♦ పస్మితకాంతికళావిలాసభా
జనపద నాగవిందముల ♦ చందములొప్పఁగఁ బల్కిరీగతిన్.

ఉ. హాల్లకమిత్రిరూపమను ♦ జాధిప నాఁడు పతంగకన్యకో
ద్వేల్లితవారిలోపల న ♦ దృశ్యతఁ గాంచిన భద్రమూర్తి నీ
యల్లుఁడు వచ్చినాఁడు భుజ ♦ గాధిపలోకమునుండి క్రమ్మరన్
బల్లవపాణి నీతనయ ♦ భాగ్యములెల్ల ఫలించెఁ జక్కఁగన్.

గీ. అనిననాశ్చర్యవార్తక ♦ య్యవనిజాని, యతిశయానందభరముచే ♦ నాత్మమఱచి
కలయొ నిక్కమొ విభ్రాంతి ♦ కలయొ యనుచుఁ, గొంతతడవతిసంశయా ♦ క్రాంతిఁ జెంది

ఉ. ఎవ్వరు పంపినారమిము ♦ నీపరమాద్భుతవార్తఁ జెప్పఁగా
నవ్వులుపల్కువైఖరియొ ♦ నమ్మఁగవచ్చునో నిశ్చయంబు గాఁ

బువ్వలుకాని మేనితో ♦ భూతిధరించినవేల్పు సాక్షిగా
మవ్వపులీలనింక నొక ♦ మాటువచింపుఁడు వీనులారఁగన్.

ఆ.వె. అనినఁజిత్రవర్మ ♦ కాచారులప్పుడు, వినయలీలచేత ♦ వినతిఁ జేసి
యుందరినేనుఁడంపె ♦ నీవార్త వివరింప, వినుముభూమివరప ♦ విస్తరముగ.

సీ. అరసాతలనిమ్న ♦ యమునాంబువులఁ జొచ్చి, యతఁడుకిందుగనందు ♦ నరిగినాఁడు
భోగికాంతలువారి ♦ కొనిపోవనురగేంద్రు, పుటభేదమునకుఁ ♦ బోయినాఁడు
తక్షకుతోడవై ♦ వతన్యానుసరంగ, నాస్థానిఁదగుమాట ♦ లాడినాఁడు
మెచ్చియాఫణినాథుఁ ♦ డిచ్చినతురగమా, ల్యాగంధభూషాదు ♦ లందినాఁడు
ఫణివరసహాయుఁడైపూర్వ ♦ పదముచేత, వెడలితనపట్టణముఁ జేరి ♦ వినతులైన
యరులఁగృపఁజూచియింద్రసే ♦ నాజ్ఞచేత, భూరిసామ్రాజ్యభారంబు ♦ పూనినాఁడు

ఉ. సత్యమునమ్మ నీమదిని ♦ సంశయమైననునాగలోకపుం
జాత్యసుగంధమాల్యములు ♦ సమ్మతినంపినవారు భూజన
స్తుత్యములైనవీనిఁగొని ♦ శోభితసమ్మదవృత్తిఁ బూనుమం
ప్రత్యయమేటికింకనని ♦ పలుకుచువారవికానకయిచ్చినన్.

సీ. ఆజన్మదుర్గతుం ♦ డగువాఁడు కాంచనో, త్కరనిధానముఁ దకఁ ♦ గన్నయట్లు
బలుచీఁకటులబెగ్గ ♦ డిలుచక్రవాకంబు, కమలబంధునిరాకఁ ♦ గన్నయట్లు
దిటదప్పిదప్పిఁజెం ♦ దినచాతకవిహంగ, మున్నతాంబుధరంబుఁ ♦ గన్నయట్లు
వాసరక్షుధితజీ ♦ వంజీవరాజంబు, కమనీయచంద్రికల్ ♦ గన్నయట్లు
మున్నుయమునాహ్వరంబులో ♦ మునిఁగిచనిన, యల్లుఁడాకారజితపుష్ప ♦ భల్లుఁడప్పుడు
తిరిగియరుదెంచి యనిచిన ♦ దివ్యవస్తు, సమితిఁగనిరాజమణిమహో ♦ త్సాహియయ్యె.

ఉ. అంతనతండువేగమున ♦ నంతిపురంబునకేఁగి కూతుసీ
మంతినిఁబిల్చి సంభ్రమస ♦ మగ్రతచే నలపాకురిచిత్రవృ
త్తాంతమశేషముందెలిపె ♦ నకథమున్నతొలంగియుండియున్
గాంతనవీనసన్నిభము ♦ గావినియబ్బురమందుచుండఁగన్.

సీ. ఈడేనేకదవమ్మ ♦ యింతినీబహుపూర్వ, జన్మసంభృతపుణ్య ♦ సారమెల్ల
నిజమయ్యెఁగదవమ్మ ♦ నీజన్మవేళయ, మ్మేదినీసురుఁడన్న ♦ మేలుపలుకు
ఫలియించెఁగదవమ్మ ♦ పార్వతీపతిఁగూర్చి, వనితనీవొనరించు ♦ వ్రతములెల్ల
సమకూరెఁగదవమ్మ ♦ సఖియనీకోసలకు, జావళియుందుయు ♦ భాగ్యనిమతి

కలికినీపతిభుజగలో ♦ కమునకేఁగి, తక్షకునిచేతనధికప ♦ రాక్రమంది
లలితమణిభూషణాదికం ♦ బులుధరించి, తిరిగివచ్చినభాగ్యంబు ♦ దొరికెఁగాన.

గీ. అనుచుమాటికిమాటికి ♦ య్యావనినేత, యాత్మయందునుసుకృతభా ♦ గ్యంబుఁబొగడు
రమణిరోయునరిందుసోమవా ♦ రవ్రతాది, నియమఫలసారమిదియంచు ♦ నిశ్చయించు.

వ. అయ్యవసరంబున.

సీ. ఉత్సవంబుఘటించె ♦ నుర్వీతలేశను, ద్ధాంతకాంతానికా ♦ యమునకెల్ల
సమ్మదంబొనగూడె ♦ సకలపౌరామాత్య, జనపురోహితసమా ♦ జమునకెల్లఁ
జిత్తంబులుప్పొంగె ♦ నుత్తమార్యావర్త, వర్తమానప్రజా ♦ వళులకెల్ల
నాశ్చర్యమయ్యెడి ♦ శాంతరాగతవణి, గ్వరధారుణీ ♦ సురలకెల్లఁ
జిరసుకృతశాలియైనయా ♦ చిత్రవర్మ, రాజమౌళికుమారికా ♦ రత్నమునకు
శివునికారుణ్యదృష్టినై ♦ దువతనంబు, మగుడఁగల్గినభాగ్యంబు ♦ మహిమకతన.

శా. భూమీవారికృశానుశీతకరణాం ♦ భోజాతమిత్రానిల
వ్యోమాధ్యాకృతిపూర్ణలోకమహిమ ♦ వ్యోగీంద్రచిత్తాగ్రయా
నామవ్రాతవిధూతపాతకచిదా ♦ నందస్వరూపాపదా
వామాంగాభరణాత్మవల్లభసుధా ♦ వారాశితూణీయుతా.

క. దారవనాంతరచరముని, నారీరతికార్యకల్ప ♦ నాశృంగారా
ప్రారంభజగన్మోహన, కారణరూపాఖిలామ ♦ కరుణాధామా.

తోటకం. వలయీకృతశేషయ ♦ వార్యబలా
నిలయీకృతపర్వత ♦ నీలగళా
జలజోద్భవవందిత ♦ చారుపదా
విలయాతిగశంకర ♦ విశ్వపదా.

గద్య—ఇతి శ్రీశైల నివాస భ్రమరాంబా సమేత మల్లేశ్వరస్వామి కృపాపాత్ర
భారద్వాజ గోత్ర పవిత్ర పెనుమళ్ల సోమమంత్రి పౌత్ర పెద
నీల ప్రధానపుత్ర సకల సుకవి స్తుత్య సోమనామాత్య
ప్రణీతంబైన సీమంతినీకళ్యాణం బనుమహా
ప్రబంధంబునందుఁ జతుర్థాశ్వాసము.
ఏతత్సర్వం శ్రీసదాశివబ్రహ్మార్పణమస్తు.

---

శుభమస్తు.

అవిఘ్నమస్తు.

శ్రీసదాశివాయనమః.

# సీమంతినీకళ్యాణము.

---

## పంచమాశ్వాసము.

---

శ్రీకమనీయభ్రమరాం, బాకుచపరిరంభజాయ ♦ మానానంద
వ్యాకోచహృదయకమలద, యాకర! శ్రీశైలమల్లి ♦ కార్జునదేవా.

వ. అవధరింపుము.

సీ. అంత నా నృపతియు ♦ త్యంతసంతోషాబ్ధి, రాముఁడై కన్యకా ♦ రత్నమునకు
సముచితాభ్యంజన ♦ స్నానంబు చేయించి, ధవళాంబరసుగంధ ♦ వివిధమాల్య
రత్నభూషితముఖ్య ♦ నూత్నశుభోచిత, సలలితాలంకృతుల్ ♦ సంఘటించి
సముదీర్ణపణవడిం ♦ డిమశంఖముఖమహో, దీర్ణవాద్యధ్వనుల్ ♦ దిశలఁజెలఁగఁ
దానుభూషితుఁడై మహా ♦ స్థానినుండి, మాన్యభూసురవరయాచ ♦ మానదీన
కీర్తికరవందిగాయక ♦ నర్తకాది, నికరములకిచ్చెఁ బారితో ♦ షితధనంబు.

ఉ. నైషధచారులన్ శుభస ♦ నాథనిచారులఁ బిల్చియంతటన్
భూషణముఖ్యవస్తువులు ♦ భూరిధనంబులు నిచ్చి చాలసం
తోషమునొందఁ జేసి యత ♦ నూకృతశాస్త్రవిశేషశేముషీ
భాషణశీలురై వెలయు ♦ పండితులం బిలిపించి వారితోన్.

మ. ఉచితాలోచన మాచరించి మదిలో ♦ నుత్సాహము ప్పొంగఁగా
నచిరోదారకుమారికా శుభవిశే ♦ షానందసంయుక్తుఁడై
రుచిరానేకవచోవిలాసజనక ♦ ప్రోద్దామధీమంతులౌ
సచివోత్తంసులఁ బిల్చి యిట్లనియె వా ♦ క్చాతుర్యధుర్యంబుగన్.

ఉ. మీరలనేకరత్నములు ♦ మేలిమికానికలుఁ గొంచు వారియా
చారులతోడఁ గూడఁ జని ♦ చారుగుణాఢ్యుని నింద్రసేనధా

శ్రీరమణేంద్రుఁ డత్సుతును ♦ ధీజనవర్ధితుఁ గాంచి సమ్ముదై
వారలతోడ మతుల్యశీల ♦ వార్తలెఱుంగఁగఁ బల్కె యంతటన్.

ఇంద్రసేనునితోడ మీ ♦ రిట్టులనుఁడు, భుజగభవనంబునుండి నీ ♦ పుత్రవరుఁడు
మగుడవచ్చినయప్పుడ ♦ మగుడవచ్చె, భవ్యకల్యాణలక్ష్మి మా ♦ భవనమునకు.

చన్నపుత్రునిఁ గ్రమ్మరఁ ♦ గన్నయపుడ, యపరిమేయంబు నీ సుభా ♦ గ్యంబు మహిమ
అనఘ నీతోడ సంబంధ ♦ మందినట్టి, నేను భాగ్యైకనిధి నౌదు ♦ నిశ్చయంబు.

అని విన్నవించి సీమంతినీచంద్రాంగదులకు యథాపూర్వకంబుగా వివాహంబు సేయందగు సుముహూర్తంబునం గదలి రావలయునని తెలియం బలుకుఁడని పనిచినవారలుం జని యింద్రసేనచంద్రాంగదుల నుచితప్రకారంబుగ సందర్శించి తదీయవార్తావిశేషంబు లన్నియు నెఱింగించిన వారును బరమసంతోషంబున మౌహూర్తికనిశ్చితంబైన యొక్క సుముహూర్తంబునఁ బరిణయోత్సవంబునకుం గదలివచ్చి రా సమయంబున.

సీమంతినీకాంత ♦ సీమమంగళసూత్ర, బలమెంతయని వేడ్కఁ ♦ బలుకువారు
సోమవారవ్రత ♦ సామర్థ్యమిదిగాని, యన్యంబుగాదని ♦ యాడువారు
నిట్టియాశ్చర్యంబు ♦ లెఱుఁగమెక్కడ నంచుఁ, బలుమారు వాతు విచ్చి ♦ యలరువారు
పరలోకగతపుత్రుఁ ♦ బడసెఁ గ్రమ్మర నంచు, నింద్రసేనుని భాగ్య ♦ మెన్నువారు
నగుచు నాగరజానప ♦ దాదిజనులు, నఖిలదేశాంతరాగతు ♦ లయినవారు
ధరణియందు నికేతన ♦ ద్వారసీమఁ, గుతుకమమరంగ మూఁకలు ♦ గూడిరంత.

మనుపటిపెండ్లి నాఁటిబలు ♦ మూఁకలసందడి యింక నెందులే
దనుపమమంచు నెంచియది ♦ యచ్చరుతేమొ ప్రతాపభరంబుఁ గై
కొని మదిలోపలం గలఁకఁ ♦ గొంతవహించిరి గాన సర్వభూ
జనములు నెన్నరాని ఘన ♦ సమ్మదవారిధిఁ దేలి రెంతయున్.

అంత.

అల్లునితోడఁ గూడ విభ ♦ వాఢ్యుఁడు వియ్యము వచ్చెనన్న యా
చల్లనివార్త యంతయును ♦ జారులచే విని చిత్రవర్మ దా
నెల్ల సిరిం దనర్చి యెదు ♦ రేఁగి ముదంబునఁ గాంచి యమ్మహీ
వల్లభమౌళిఁ దోడ్కొనుచు ♦ వచ్చెఁ బురంబున కబ్బురంబుగన్.

ఈకరణిఁ దోడితెచ్చి భూ ♦ లోకవినుతుఁ, డౌ నృపాలుఁడు సకలగు ♦ ణాభిరామ
నగు సీమంతినికి నిజచం ♦ ద్రాంగదునకుఁ, బ్రాభవము మీఱఁ జేయించెఁ ♦ బరిణయంబు

గీ. రాజు సేయించు పరిణయా ♦ రంభమపుడు, వారికిఁ జతుర్ముఖుండొ ♦ న్నతి వహించె
దంపతుల రాగములు వట్లు ♦ దనరు ననుచు, నఖిలజనులకు నెఱిఁగించు ♦ నదియ పోలె.

గీ. చిత్రకర దానవిద్యాప్తి ♦ సిద్ధుఁడైన, చిత్రవర్మధరిత్రీశ ♦ శత్రుఁడంతఁ
గన్యకోద్వాహఘనకౌతు ♦ కము వహించి, యత్తవారలకిచ్చెని ♦ ప్పార్థనమిది.

చ. మునుపటి పెండ్లివాఁడు ధన ♦ ముల్గొనినట్టి వనీపకోత్తముల్
ఘనతర దాతలై యలరఁ ♦ గాన పుడేల లభింతురర్థులా
యనఘుఁడొసంగునట్టి ధన ♦ మందుటకాజనవాధుతోడ నీ
వెనుకను మచ్చరించు నృప ♦ వీరులు కొందఱు లేక యుండినన్.

గీ. నిజకుమారిక సీమంతి ♦ నీవధూటి, యఖిలకల్యాణసరణియై ♦ ట్లాదరించి
యంతనాక్రాంతసద్ధరా ♦ కాంతమౌళి, యత్తవారింటికనుపంగ ♦ నాత్మఁదలఁచి.

సీ. ప్రకటదుగ్ధాపీన ♦ భారశోభారమ్య, తరుణవత్సగవీవి ♦ తానములను
చలచంచరీకసం ♦ కులకపోలవినీల, దంతావళేంద్రసం ♦ తానములను
గాంధారదేశీయ ♦ బంధురీధారావి, రాజతురంగస ♦ మాజములను
చారువిద్యుల్లతా ♦ సమసముంచత్కాంతి, కమనీయకన్యాని ♦ కాయములను
నికటతటినీసముద్వేల ♦ నీరపృషిత, శకలసస్యాభ్రజారామ ♦ సముదయాభి
రామభూమిమనోహర ♦ గ్రామములను, కారణములు గాఁగనిచ్చెన ♦ య్యవసరమున.

సీ. మణికంకణాదిభూ ♦ షణములు వేర్వేలఁ, దెచ్చియచ్చపలాక్షి ♦ కిచ్చువారు
పదివేలవర్షముల్ ♦ పతితోడ సుఖవృత్తి, నిక సిల్లుమంచు దీ ♦ వించువారు
నిన్నుఁజూచెదమింక ♦ నెన్నాళ్లకోయంచుఁ, జెలిమితోఁ గౌఁగిటఁ ♦ జేర్చువారు
ననవద్యగంధమా ♦ ల్యాదికంబులవింత, శృంగారవిరచనల్ ♦ సేయువారు
నత్తవారింట నుత్తమ ♦ వృత్తి మెలఁగు, నొరపుగలబంధులోకకొ ♦ న్ని గఱపువారు
నగుచు నబ్భూమికాంతశు ♦ ద్ధాంతభవన, జగతికాంతామణుల్ గొంత ♦ సందడిలిరి.

వ. అంత.

శా. సారోదంచితభక్తిచే జననికా ♦ చార్యాళికిన్ మ్రొక్కి యా
శీరత్నంబులు వెంటఁగొల్వఁగ మరా ♦ ళీకేళిమచ్చారుసం
చారంబొప్పఁగవచ్చినట్టి సకియం ♦ జందోళికారూఢమా
తేరెక్కించి దీవనల్ వెలయ ధా ♦ త్రీదేవకాంతామణుల్.

సీ. భూసురాశీర్వాద ♦ భూరిరావంబులు, వందిబృందస్తుతుల్ ♦ గ్రందుకొనఁగ
నర్తకీభూషణో ♦ న్నతఝణత్కారముల్, విపులవాద్యధ్వనుల్ ♦ విజృంభమందఁ

టుల్యాంగనాగీత ♦ భూరిస్వనంబులు, సుషిరనాదములు వి ♦ స్ఫూర్తిగలయ
లలితాచిరంటికా ♦ కలభూషణంబులు, వల్లకీస్వనములు ♦ మల్లడిగొన
విమలకల్యాణశృంగార ♦ వేషయుతులు, దంపతులు తేరు వెనువెంటఁ ♦ దరలిచనువ
నగరిపురుషమానుషజైత్ర ♦ నగరిజాడఁ, గదలెనయ్యైంద్రిసేనభూ ♦ కాంతమౌళి.

మిసిమిచాయలు మీఱు ♦ పసిడితేరులబారు, గొప్పయొప్పరిగెల ♦ యొప్పుగాఁగ
నొడ్డుపొడువుగలిసిన ♦ పాండురఛత్రముల్, నవమౌక్తికప్రవితా ♦ నములుగాఁగ
గళితదానాంబువు ♦ తరిగకపోలంబులు, రమణీయసలిలయం ♦ త్రములుగాఁగ
బహుళకుంభంబులు ♦ పూనుసువాసినుల్, ధర్మపాంచాలికా ♦ పటలిగాఁగ
నిత్యసాంగత్యకేళికా ♦ నిరతిచేతఁ, బరఁగుసీమంతినీకాంతఁ ♦ బాయలేక
పురము వెనువెంటవచ్చిన ♦ పోలెఁదనరె, నెడతెగనిమూఁకలచోట ♦ నడుచునప్పుడు

. ఆర్యాగ్రగణితనవియ్యము, నార్యావర్తంబుగడియ ♦ ననిచితిరిగా నై
శ్వర్యకళాకలితమహా, దార్యుండగు చిత్రవర్మ ♦ ధరణిపుఁడంతన్.

౪. వ. ఇంద్రసేనమాన ♦ సేంద్రుఁడీకీతిమ్మ, హేంద్రవిభవతుల్య ♦ సాంద్రుఁడగుచుఁ
గాడుకగ్రొత్తపెండ్లి ♦ కూతుఁదోడ్కొనుచు, సాత్మపురిఁబ్రవేశ ♦ మగుచునలరె.

. పలలితకాంచనాచలవి ♦ శాలగుహాంతరసీమరత్నపుం
మొలకజనించు నేగడుప ♦ మున్నతతేజముఁ గాంచునట్లుచే
నలరె నలాధిరాజసుతు ♦ నంతిపురంబు నవీనచంద్రముః
కళ కనసేయఁజాలు నృప ♦ కన్యప్రవేశముగాఁగ నత్తతిన్.

. తనహృదయాభిప్రాయుని ♦ తల్లికి మున్నుగ్రమొక్కి పెద్దలౌ
వనితలఁ గాంచి మొక్కి తగు ♦ వారలకెల్లను మ్రొక్కి వారిచే
ననుపమపుత్రరాజ్యవిభ ♦ వాన్వితవై పదివేలవర్షముల్
మనుమని వీవనల్ గనియె ♦ మానవతీజనరత్నమంతటన్.

. అంబుజహాప్తబింబ ముద ♦ యంబుగఁగూడినయట్టి చక్రవా
కంబులనంగ శంకరుని ♦ ఖండదయాభ్యుదయంబుచేత రో
గంబొడగూడినట్టినృప ♦ కన్యయు రాజవరప్పరాను రా
గంబువహించి యీప్సితసు ♦ ఖంబులు గాంచిరి పమ్మదంబునన్.

. ఋతువులన్నియు మధూ ♦ వ్రతసమాశ్రితలతాం, తనిరంతరతపసం ♦ తములేకాఁగ
నిశలన్నియును సము ♦ న్మేషరాకాచంద్ర, చంద్రికాదికవిలా ♦ సములేకాఁగ

ఉ. సంతతరాజ్యవైభవవి ♦ శాలసమాన్వితగేహసీమ సీ
మంతిని యవ్విధంబున ను ♦ మారమణీపదపూజనోదర
స్వాంతతసోమవాసరమ ♦ హావ్రతనిశ్చలదీక్షయందు న
త్యంతముభక్తియోగమున ♦ దంపతిపూజ యొనర్చుచుండఁగన్.

సీ. సకలలక్ష్మీవిలా ♦ సకలానివాసదే, శంబౌవిదర్భదే ♦ శంబునందు
నమితపుణ్యచరిత్రుఁ ♦ డగువేదమిత్రుండు, సారస్వతుండ న్న ♦ సంజ్ఞఁదనరు
ధారుణీవిబుధాలి ♦ ద్విజు పరస్పరార్ద్రి, గౌరవంబునమీరఁ ♦ గ్రమముచేత
సుశీలయుతులు ద ♦ త్సుతులును మేధుండు, సామవంతుఁడు నన్న ♦ నామములను
వెలయువారు వయోరూప ♦ విభ్రమముల, సదృశులైమీఱి సద్బ్రహ్మ ♦ చారులగుచు
నవనిఁ బదునాల్గునంగ వి ♦ ఖ్యాతిఁగన్న, విమలవిద్యల నధికప్రవీణులైరి.

గీ. పదునాలుగువర్షములకుఁ, బదునాలుగువిద్యలందుఁ ♦ బ్రౌఢిమఁ గని సం
పాదవు గుమారుల సమ్ముద, హృదయంబునఁ గాంచి జనకు ♦ లిట్లని రంతన్.

ఆ. అర్థధనమెల్ల నుచితవ్య ♦ యంబుచేసి, కులము శీలంబు గలకన్య ♦ కలను మీకుఁ
బరిణయ మొనర్ప యానంద ♦ భరముచేత, నధికనిశ్చితహృదయుల ♦ మౌనుమంత.

క. అని యొక కొన్ని బుద్ధులన ♦ యంబునయం బమరంగఁబల్కి యా
జ్ఞనకులు పంపినం గదలి ♦ యయ్యవనివిప్రకుమారకాగ్రిణుల్
గని వసీపకపత్రికర ♦ కామితదానపదానదీనపం
జనితయశోవిభూషితది ♦ శావలయుం డగుకుండినేశ్వరున్.

గీ. అర్థరాజాని భువనప్ర ♦ సిద్ధివాని, వారియనివారితబ్రహ్మ ♦ వర్చసమున
నాత్మసంతోషమంది య ♦ త్యంతభక్తి, నుచితసత్కార మొనరించి ♦ యున్నయంత.

సీ. శ్రుతివదోదారవి ♦ శ్రుతిపదాత్యవధాన, మేధాను(సంధాన) ♦ మేళనమున
నవ్యకావ్యానేక ♦ నాటకాలంకార, శంకారహితబుద్ధి ♦ సౌష్టవమున
బహుకర్తభక్తికా ♦ భావనిష్పందేహ, కరచారుశేముషీ ♦ గౌరవమునఁ
దంత్రవేదాంతస్వ ♦ తంత్రతానిరవద్య, విమలధీవైశద్య ♦ విభ్రమమున
యోగసాంఖ్యాతిశయయుక్తి ♦ యోగమునను, నిరవధికశబ్దశాస్త్రపాం ♦ డిత్యమునను
గుండినస్వామిమదికి న ♦ ఖండమోద, మహిమఁగలుగంగఁజేసిర ♦ మ్మాణవకులు.

గీ. జనవరోత్తంస గురులకా ♦ సనముపూని, దారసంగ్రాహకరణాయ ♦ త్నంబుకొఱకు
ధనముఁగాంక్షించి కీర్తిత ♦ ర్థనముగాఁగ, నిన్నుఁ బేడంగవచ్చితి ♦ మన్ననపుడు

ఉ. వారలబ్రహ్మతేజ మని ♦ వారితమంచు ముదంబుఁగాంచియున్
వారియనేకవిద్యలన ♦ వద్యములంచు బ్రహర్షమందియున్
భూరివదాన్యతాదివిజ ♦ భూరుహ నా 1(నృపమాళి)యాశ్వగ
ప్రేరణచేత నిట్లనియెఁ ♦ బేశలహాసలసన్ముఖాబ్జుఁడై.

గీ. విప్రవందనులారయీ ♦ వేళ మీకు, నర్థములఁబంచు నొకయుపా ♦ యంబు గలదు
పరమహితమంచు నాత్మలో ♦ వలఁదలంచి, సేయఁగలిగితిరేని వ ♦ చింతు దాన.

ఉ. ఇంతవిచారమేల నిష ♦ ధేంద్రునకుం బ్రియకాంతయైన సీ
మంతిని సోమవాసరము ♦ మన్మథవైరి నుమాయుతంబుగా
నెంతయుభక్తితోడ భజి ♦ యించుతతిం దరశ్శేతరీక్ష్యత
హ్వాంతతవిప్రదంపతులు ♦ వచ్చినఁ బూజయొనర్చు వేడుకన్.

గీ. అతులభక్తి ననాదిదం ♦ పతులుగాఁగ, విప్రకులదంపతుల నుభా ♦ వించి వారిఁ
బూజఁగావించుమణిహేమ ♦ భూషణముల, నామెగోరియిచ్చున ♦ యుర్వ్యాంగువదన.

క. కావున మీయం దొకఁడు న, ధూవేషము పూని ముదము ♦ తో దంపతులై
పోవుఁడు శశివాసరమున, నావనితయొసంగు మీకు ♦ నభిమతధనముల్.

ఆ. వె. అనిన వారు నవ్వి ♦ యవ్విభుఁ గాంచి యీ, కపటవృత్తి మాకుఁ ♦ గలుగ నేల
విప్రకులులమేము ♦ వేదాంతవిదుల మీ, యాగ్యనిందపరణి ♦ యర్హమగునె

క. కపటంబు దురితమూలము, కపటం బపకీర్తికెన్నఁ ♦ గారణమగుద
త్కపటగతమ్ముగులాభము, కపటాయుతపన్నగంబు ♦ గాదె నరేంద్రా.

· పుణ్యభూదేవకులమునఁ ♦ బుట్టెనేమి, సకలవిద్యలుఁ గరిముట్టఁ ♦ జదివెనేమి
నిత్యకర్మంబు లొనరింప ♦ నేర్చెనేమి, దంభయుక్తుఁ డనర్హుండు ♦ దానమునకు.

· మదినొకటితలఁచి నాలుక, తుద నొకటి వచించుమానవాని ♦ తో సహవాసం
బది కటుగరళపూరిత, వదనభుజంగముసహాధి ♦ వాసము కన్నన్.

విపులతరధర్మసంహితా ♦ వేదియైన, విప్రవరునకుఁ గపటంపు ♦ వృత్తి దగునె
కాశిచేరికఁ బ్రవహించు ♦ గాంగనీరు, వింధ్యకుధరదరిద్వార ♦ విహృతిఁ గనునె
సత్యమె విమలజ్ఞానము, సత్యమె చాంద్రాయణాది ♦ సకలవ్రతముల్
సత్యంబుకన్న సద్యము, సత్యము గాఁ బుణ్యలోక ♦ సాధనమగునే.

పరులయర్థంబు వంచన ♦ బరతఁగొన్న, ధూర్తుఁడే పుణ్యములఁ బవి ♦ తుడు గాఁడు
మద్యలవదూషితంబైన ♦ మంటికడవ, యెన్నినదులను ముంచిన ♦ నేమివచ్చు.

---

1 ప్రక్షిప్తము.

ఉ. ఇంతియొకొక్క యోగవసుము ♦ తీశ్వర యింకొక విన్నపంబు సీ
మంతిని రాజకాంత యతి ♦ మానసశాంభవభక్తి శీలయా
యింతిని జేరి కైతవము ♦ కింతయొనర్చినవచ్చు బాతకం
బంతకదండనాతులిత ♦ మై పనుకూరును రాజనందనున్.

క. శివునియెడ దప్పు జేసిన, శివుడొకొ్కక వేళ గరుణ ♦ చే మన్నించున్
శివుడుం గావగనోపడు, శివభక్తులయెడల దప్పు ♦ జేసినవారిన్.

ఆ. వె. గురునియట్లు నీవు ♦ ధరణీశు డవుమాకు, కాని క్షత్రియశిశువు ♦ గఱపనేల
పార్థివేంద్ర యింక ♦ బదివేలువచ్చిన, జాలము కపట ♦ శీలమునకు.

వ. అనిన నారాజపురందరుండు సుందరవదనారవిందంబున మందహసితంబు కండళింప గా మృదులవచనరచనానందనులైనయద్ధరాబృందారకనందనులం గాంచి యి ట్లనియె.

ఉ. చాల ననేకవేదబహు ♦ సంఖ్యపురాణము లభ్యసించినం
బాలకులౌట మీమదిని ♦ బట్టదు నాహితసూక్తి ధారుణీ
పాలకుపంక్ష సేయుటయు ♦ భాసురధర్మము దీన బాతకం
బేలలభించు మర్త్యునకు ♦ నేలఘటించునకర్త వేశమున్?

తరుణీపురుషునివేషంబు ♦ దాల్చెనేమి, పురుషు డంగనవేషంబు ♦ బూనెనేమి
విశ్వమంతయు శివుడౌట ♦ వేఱతేమి, వృజినమేటికి ఘటియించు ♦ విప్రులార.

ఆ. వె. దేహగతములైన ♦ స్త్రీపుంసభేదముల్, నిజములౌనెయాత్మ ♦ నిజముగాక
కల్లలందునేమి ♦ కల్లవాటించినం, దప్పుగలదె విప్ర ♦ తనయులార.

ఆ. వె. వృజినమేమిలేదు ♦ విత్తంబుసమకూరు, మీకు నొకక్కవింత ♦ మేలుదొరకు
సంశయంబుమాని ♦ చనుడు సీమంతినీ, చంద్రవదనపుణ్య ♦ సదనమునకు.

వ. అని యనేకప్రకారంబుల నతండు బోధింప సముచితకాల్యంబైనకార్యంపు తెనమవు లం బరిహరింప నేరక యారక యంగీకరించి నిషధదేశంబునకుం జని తత్పురసమీప మున.

సీ. చిటిలింతజుట్టుకుజుట్టు ♦ దిరిగిరాసవరముల్, కునురుగాగీలించి ♦ కొప్పునుడిచి
భసితత్రిపుండ్రంబు ♦ పరిహారమొనరించి, మిసిమికుంకుమరేఖ ♦ నొసలదీర్చి
గొప్పనీలపుజాల ♦ కుండలంబులుమాని, వలుదముత్యాలక ♦ మ్మలుధరించి
యరుతయద్రాక్షువా ♦ రావళుల్ సడలించి, మాయాకుచంబులు ♦ మట్టుపఱచి

మఱియు వారాయాయి పురుషధ ♦ ర్మంబు మాని, సామవంతుఁడు యువతివే ♦ షంబుపూని
సతులసంగతులాశించు ♦ మతులఁజదల, గతులఁదప్పించుటాకట ♦ కడమగాఁగ.

గీ. సామవంతుఁడు సతియుఁద ♦ త్సహచరుఁడు, పతియునన్నట్టిగట్టిదం ♦ భంబుపూని
చనిరిచంద్రాంగదకుమా ♦ రునిభుజ, ధానికిరువురు నిశాత ♦ ధాములగుచు.

చ. పురుషులుగన్నలజ్జపువు ♦ బోణులఁగాంచిన వింత చెల్మియుం
గరితురగాదులడ్డముగఁ ♦ గ్రిక్కిరినమిక్కిలికాంతరత్వమున్
బరసులడెందముల్లలఁచు ♦ చక్కనిమాటలు వింతచూపులున్
మరువకయేఁగెనక్కపట ♦ మానినితత్పురరాజవీథికిన్.

వ. అంత.

సీ. చక్రిదంపతిమన ♦ స్సదనాంతరములందుఁ, జిత్తజశిఖిబ్రవే ♦ శించువేళ
వలుదచంగుదుకావి ♦ వలువవైఖరిదిశా, కంజనేత్రలసంజ ♦ గదయువేళ
వరుణపట్టణసరో ♦ వరపద్మినులగాఱ, వించి బాణుఁడు కాఁగ ♦ లించువేళ
కలకలప్వనసమా ♦ కులవిహంగకులంబు, నీడంబులకుఁజేరి ♦ నిలుచువేళ
సాకృతికదంపతులుశాం ♦ కాపతింప, నిత్యపూజామహోత్సవో ♦ న్నిద్రభద్ర
మైననిషధేంద్రకాంతశు ♦ ద్ధాంతమంది, రముబ్రవేశించి రిందువా ♦ రంబునందు.

సీ. అభిషేకమునకఁ ♦ గాంబువుల్ మణిఝరీ, దీర్ఘకుంభములచేఁ ♦ దెచ్చువారిఁ
గరవీరమల్లికా ♦ కమలకైరవముఖ్య, కుసుమమాల్యంబులుఁ ♦ గూర్చువారి
నగరుకర్పూరసా ♦ రాదికంబులచేత, మహితధూపంబుల ♦ మర్చువారి
రమణీయరత్నపా ♦ త్రములందుదీపికా, శ్రేణికల్ వెలుఁగఁగఁ ♦ జేయువారి
షడ్రసోపేతనైవేద్య ♦ సముదయంబు, లంచితాదరముప్పతి ♦ ల్లించువారి
నచటనిటలాక్షుపూజాగ్ర ♦ హాంతరమునఁ, గనిరిమాయావధూవరుల్ ♦ కౌతుకమున.

సీ. అపుడుగౌరీశపా ♦ దపయోరుహధ్యాన, నిపుణయౌసీమంతి ♦ నీవధూటి
జహ్నుకన్యాజల ♦ స్నానంబుగావించి, లలితధౌతాంబరం ♦ బులుధరించి
మణిజాలఖచితభూ ♦ షణభూషితాంగియై, యమలరుద్రాక్షహా ♦ రములుదాల్చి
తెలిమీఱుకర్పూర ♦ తిలకంబునకుఁదోడు, భసితత్రిపుండ్రంబు ♦ నొసలఁబూని
యొడలువూనినశివభ ♦ క్తి యోజదనరి, యొక్కకనకాసనమునఁగూ ♦ ర్చుండి శైవ
మంత్రరాజంబుధరియించి ♦ మౌననియతి, శివునిజితచిత్తభవునిఁబూ ♦ జింపఁదొణఁగె.

సీ. అదెశాతకుంభకుం ♦ భాంతరంబులయందు, గంగాంబుపూరంబు ♦ కమలగంధి
యదెజాత్యమరకతా ♦ యతకరండికలందుఁ, జందనసారంబు ♦ చంద్రవదన

## పంచమాశ్వాసము.

మణివజ్రకీలితా ♦ నర్ఘ్యపాత్రములందు, వివిధపవిత్రసూనముల్ ♦ సువర్ణయోక్తి
యుపవనవ్యపద్మరా ♦ గార్ఘ్యపేటికలందుఁ, గర్పూరశకలముల్ ♦ కంబుకఁ జే
యనుమ నెచ్చెలులుం దెల్ప ♦ నాదరమున, రాజఖండావతంసుని ♦ రాజతాహి
రాజకుండలుబ్రహ్మాది ♦ పూజనీయుఁ, బూజఁ గావించె నప్పుడా ♦ పుష్పబోణి.

ఉ. అహరిణాక్షియైయుండ దక్షి♦ణాంచితలింగమునందునత్తురా
ద్వాహను వేదవేద్యునన ♦ వద్యదయానిధి భక్తపాలనో
త్సాహు సదాశివుం దుహిన ♦ శైలసుతాన్వితుఁ గాఁ దలంచి యా
వాహనమాచరించెనని ♦ వారితభక్తిరసోదయంబునన్.

సీ. అద్రిజాధిపతికి ర ♦ త్నాసనంబొనరించె, గంగాధరునకు న ♦ ర్ఘ్యంబొసంగె
హారునకునిచ్చెఁ బా ♦ ద్యాచమనీయముల్, భావజారికిమధు ♦ పర్కమిడియె
నర్ధచంద్రకిరీటి ♦ కభిషేచనముచేసె, శివునకు హొంబట్టు ♦ చేలఁగట్టె
కాలకంధరునకు ♦ గంధమర్పణఁ జేసె, దక్షవైరికి నక్ష ♦ తములువెట్టె
వామదేవునిమల్లికా ♦ వకుళతిలక, కమలపున్నాగపాటల ♦ కర్ణికార
కుందనవమాలికాశోక ♦ కురువకాది, పుష్పసంతానములచేతఁ ♦ బూజచేసె.

తే. ధూర్జటికిఁ జారుకర్పూర ♦ ధూపమిచ్చె, దేవతాచక్రవర్తికి ♦ దీపమొసఁగెఁ
బాయసాపూపదధ్యాజ్య ♦ ఫలసమగ్ర, విపులనైవేద్యమర్పించె ♦ విశ్వపతికి.

క. పూర్ణమనోరథయావర, వర్ణినితాంబూలమిచ్చె ♦ వరభక్తిమతిన్
వర్ణితముక్తావిరచిత, చూర్ణముతోఁ గూడఁ జంద్ర. ♦ చూడామణికిన్.

ఉ. కంజదళాయతాక్షి శిత ♦ కంఠునకంతనకుంఠభక్తిబు
ష్పాంజలియున్ నివాళియు స ♦ మర్పణఁ జేసి యనన్యభావనా
మంజులప్రదక్షిణన ♦ మస్కరణంబొనరించి కల్పిత
ప్రాంజలియైనుతించె హిమ ♦ పర్వతరాజసుతామనోహరున్.

సీ. తేనమో దేవాది ♦ దేవాయ హాలహాల, గ్రీవాయలోకైక ♦ పావనాయ
తేనమో మునిజన ♦ ధ్యేయాయ భక్తవి, ధేయాయ కంజాక్ష ♦ సాయకాయ
తేనమో గిరిసుతా ♦ ధీనాయ పాలిత, దీనాయ దళితోగ్ర ♦ దానవాయ
తేనమస్సన్నుత ది ♦ [1]వ్యాయ వాణీశ, సేవ్యాయ సేవక ♦ భవ్యదాయ
తేనమో నిగమాంత వి ♦ దితగుణాయ, తేనమో రజితాద్రి మం ♦ దిరదతాయ
తేనమో మదనాంగభూ ♦ తిప్రియాయ, తేనమో విశ్వమయరూప ♦ దీపితాయ.

---

1 న్నుతదివ్యాయ (మూలము)

పంచచామరం. పరాదరాత్మసప్రభూత ♦ జాతిచేతనాకృతీ
పురాణపూరుషాయనంత ♦ భోగికుండలాంకితా
గిరీంద్రజాసమేతయోగి ♦ కీర్తనీయదేవతా
శరణ్య మమ్ముఁబ్రోవుమయ్య ♦ చంద్రఖండశేఖరా.

మత్తకోకిల. చందనీకృతపంచసాయక ♦ సర్వవాంఛితదాయకా.
కుందసుందరవర్ణవిగ్రహ ♦ కూరచిత్తజనిగ్రహా
యిందుఖండకృతావతంసక ♦ యిద్ధపన్నగహంసకా
వందనంబిదె నీకుశంకర ♦ వైరిలోకభయంకరా.

వనమయూరము. నీలగళభక్తజన ♦ నిత్యశుభకారీ
ఫాలనయనప్రణుత ♦ పాతకవిదారీ
హాలహాలభోజనమ ♦ హాభుజగహారీ
బాలశశిశేఖరకృ ♦ పాతరపురారీ.

భుజంగప్రయాతము. రమాధీశముఖ్యామ ♦ రస్తుత్యలీలా
యుమాయుక్తవామాంగ ♦ యోగీంద్రసేవ్యా
సమస్తేషువిస్తారి ♦ సంహారినామా
మముంబ్రోవుమోభక్త ♦ మందారభూజా.

స్రగ్విణి. శ్రీమహాదేవని ♦ స్సీమతేజోమయా
కామసంహారని ♦ ష్కామయోగిప్రియా
హేమధాత్రీధరా ♦ ధీశబాణాసనా
నామదిన్నిల్పుమో ♦ నాగహారాంకితా.

లయగ్రాహి. అంగజశరీరమద ♦ భంగకరపాణితల
సంగతమనోహరకు ♦ రంగధృతగంగా
సాంగనిగమస్తుతయు ♦ నంగమునిహృత్కమల
భృంగకరుణాలసద ♦ పాంగధవళాంగా
రంగదవనీతలశ ♦ తాంగశశిభాస్కరర
థాంగనిజబాహురుచి ♦ రాంగదభుజంగా
మంగళకరాహృదయ ♦ భంగవిశిఖాయతవి
హంగపతివాహజయ ♦ పుంగవతురంగా.

మణిగణనికరము. వనధివృతమహీ ♦ వలయముకలిమిన్
ఘనులకుసురలకు ♦ గలవిభవములన్
మననిజమదహార ♦ మగుడనిపదమున్
నినుఁగొలిచినగుణ ♦ నిధులకునమరున్.

ఖడ్గబంధము. భీమనామసోమదైత్య ♦ భేదనాదమోదయా
యామవత్యధీశకల్పి ♦ తాభిరామశేఖరా
రామపూజ్యపాదభక్త ♦ రక్షణాదికప్రియా
యామరేంద్రమౌళిమూర్ధి ♦ తాంఘ్రిపద్మశంకరా.

నాగబంధము. అనఘగవేశయానభువ ♦ నావనధర్మపదాపదాగమో
ఘనతతదయావిధానశివ ♦ కావవెవిష్ణుశరాయుమాధవా
ధనదసఖాయజానుశమ ♦ ధామదలజ్జనియోగభావితా
మననయుతాపమానజన ♦ మానసగణ్యయభేదఖేలనా.

నిరోష్ఠ్యము ధారాధరనీలగళ, శ్రీతాజితరాజతాద్రి ♦ శృంగాంచలకే
ళీరయనారతతాశ్రిత, సారసశారదదినేశ ♦ జయజగధీశా.

చక్రబంధము. శా. విత్రాసోద్యమశీసతీభవనప్ర ♦ ధీవ్రశస్యపత్రిప్రియా
నూతారస్తుతనిర్యధీశవరచ ♦ త్రుక్కృత్సంకల్పజా
చితాంమందశరీరప్రోవృతటువే ♦ షీతిగ్మభావిప్రదా
1పాత్రోతావిహతాఘురాసురచరమా ♦ యాదేవజాలాధిపా.

చతుర్విధకందము సోమార్ధజూటఖండిత, కామాకమనీయవేష ♦ గౌరీరమణా
హేమనగాద్రిజారతంజిత, భూమాషావిమలప్రకాశ ♦ పుంగవగమనా.

ఆ. గీ. చంద్రబింబవదన ♦ చంద్రాంగదునిరాణి, శంభ్రిమాళినిట్లు ♦ సన్నుతించి
విప్రదంపతులను ♦ వేర్వేరఁబూజించె, నయ్యుమామహేశు ♦ లనితలంచి.

ఉ. తామరసాక్షియత్తతిని ♦ దంపతివేషము పూనినట్టి యా
భూమిసుపర్వనందనులఁ ♦ బొందుగ నాత్మనెతింగి మందహా
సామృతపూరధార వద ♦ నాంబుజమందుఁ దరంగితంబుగా
నేమియుఁబల్కకెంతయును ♦ హృత్కమలంబు ప్రకాశమందఁగన్.

ఉ. భావజుగెల్చినట్టి దొర ♦ పట్టపురాణిని నీలవేణి వా
2జీవనజాలసూదికర ♦ నీరజనామర విజ్యమార భ

1 యథామూలము. 2 యథామూలము.

క్రావనకల్పవల్లి తుహి ♦ నాచలరాజ సుతామతల్లిగా
భావనచేసియాకృతక ♦ భామినిఁ బూజయొనర్చియంతటన్.

గీ. అమ్మహాదేవిప్రాణేశుఁ ♦ డైనయట్టి, పురహరునిగాఁగ భావించి ♦ పూజచేసి
విమలతరపుణ్యచారిత్రు ♦ వేదమిత్రు, పుత్రుఁడైనసుమేధున ♦ పువ్వుబోణి.

ఉ. అప్పురదానవాంతకుపి ♦ యాంగనగా మదిలోఁదలంచి తా
నెప్పుడు పూజచేసెఁ జప ♦ లేక్షణభూసురసూనుఁ డప్పుడే
గొప్పపయోధరంబులు చ ♦ కోరములన్నగువాలుజూపులుం
విప్పగుకొప్పుగల్గియర ♦ విందవిలోచన యయ్యె నత్తఱిన్.

వ. ఈకరణిం దరుణ విప్రకుమారులు వందనాపరతంబంచవదన ♦ క్తేలయగు నబ్బాల యొసంగిన గంధమాల్యాంబర మణిభూషణాదులు ధరియించి యుష్టాన్నపానాదులం దనిసి యానగరు వెడలి నగరంబుఁగడచి పురోపవనమార్గంబునం బోవుసమయంబున.

ఉ. చందనచ్ఛేదనంబుఁగొని ♦ వచ్చితిమంచును చాపభీతిచేఁ
జంచలచిత్తుఁడైనపహ ♦ చారిఁ గనుంగొని కేళికానన
దంచితపుష్పభారనిశి ♦ తానుగ సన్నిధిఁ బంచబాణుచేఁ
జంచలచిత్తయామదన ♦ సారసలోచన సొక్కె నీగతిన్.

ఉ. ఎంతయుభక్తిచేతఁ బర ♦ మేశ్వరు నీశ్వరుగాఁదలంచి సీ
మంతినిపూజచేసినస ♦ మస్తమహీసురదంపతుల్ గృహా
భ్యంతరసీమలందు నిర ♦ పాయసుఖోన్నతిఁ గ్రీడసల్పఁగా
వింతరయంబుచేతనిపు ♦ డెక్కడ కేఁగెదు ప్రాణవల్లభా.

ఇదిగున్నలేమావు ♦ లిచ్చనిచ్చటఁజేరి ముచ్చటాడఁగఁ గోరెఁ ♦ బొదచ్చమివ్వుల
నివికన్నెసురపొన్న ♦ లిందునందుల మోవి, విందు లియ్యఁగ వేడెఁ ♦ గ్రందుకొనియె
నీమల్లెపొదదండ ♦ నీవంకనిశ్శంక, నాలింగనముసేయ ♦ నాసపడెమె
నీవెపాటలఛాయ ♦ లిందులనిరపాయ, మదనాహవముసేయ ♦ మనసుపడెమె
భావభవునంపలయుపరం ♦ పరలచేతఁ, దరలమతినైతి నింక నే ♦ దరలఁజాల
నేలయొంచెదు మగవారి ♦ హృదయమింత, గట్టిగాఁజేసినాఁడుగా ♦ కమలభవుఁడు.

అనుపలుకు లాసుమేధుఁడు, విని కపటోక్తులుగ నెంచి ♦ వికసితహసితా
ననమొప్పఁగ నలుదిక్కులుఁ, గనుఁగొని యిట్లనియె వికచ ♦ కంజేక్షణతోన్.

. అచ్చపుపువ్వుబోణివని ♦ యందఱు నిన్ను నెఱింగి రింతెయా
ముచ్చట లేటికిన్ గుణస ♦ మున్నత యావనవీధి కెప్పుడున్

వచ్చినవారు లేరు నృప ♦ వర్యవధూమణి భృత్యులీయ స
త్యోద్యచ్ఛరణంబు లేటికిఁక ♦ నూరకరమ్ము కరమ్ము వేఁడఁకన్.

క. నాపుడు నేఁగోరినపని, కీ వేమనియుత్తరంబు ♦ లిచ్చెద వకటా
భావజుని కెన్న మిక్కిలి, నీవే నిర్దయుఁడవైతి ♦ నిక్కం బరయన్

గీ. సామవతి నేను పావక ♦ సాక్షిగాఁగఁ, బరిణయంబైన మత్ప్రియ ♦ నిత్తు వీవు
దోషమనిమాడ కీరీతి ♦ ధూర్తుఁడవయి, ప్రాణనాయిక భ్రమియించి ♦ పలుక నేల.

వ. అనిపలికి మఱియు నమ్మదచ్చకంటి పచ్చవిలుకాని చేనొచ్చి విచ్చలవిడి నమ్మదనవి
కారంబు లుపచరింప శంకాకలంకితమానసుండై యాసుమేధుండు.

సీ. సజలజలధరకల్పమై ♦ చారుకీర్తి, కృత్రిమముగానివేణియుఁ ♦ గెంపుమోవి
చూపుగములందుఁ దళుకొత్తు ♦ చాపలంబు, నరసి సంజనితాశ్చర్య ♦ భరము పూని.

ఆ. పాతకము వచ్చునన్నట్టి ♦ భయము లేక, యేలచేసితి మిటువంటి ♦ హీనచేష్ట
పాపభూపాలదుర్బోధ ♦ పాటవమున, నెంతకార్యంబుపుట్టె నిం ♦ కేమిగలదు.

ఆ. వె. అనుచు దైవఘటన ♦ కాశ్చర్యమువహించి, నిజచరిత్ర నెంచి ♦ నిందసేయు
నభవు భక్తజనుల ♦ యద్భుతమహిమంబు, సారెసారె మెచ్చి ♦ సంతసించు.

వ. ఇవ్విధంబున బహుచింతాక్రాంతుండై యతం డీశ్వరాయత్తంబులు దుర్లంఘ్యంబు
లుగదాయని యెట్టకేలకు ధైర్యంబు దెచ్చుకొని యవ్వధూరత్నంబుతో నిట్లనియె.

సామవంతుఁడవన్న మ ♦ త్సహచరుఁడవు, గాని నిక్కపువనితవు ♦ గావు నీవు
కపటభూనాథుఁ దుర్బోధ ♦ కల్పనమునఁ గలిగె నిటువంటి వైరూప్య ♦ ఘటన నీకు.

ఉ. నాపుడు నన్నుఁ గాంతయని ♦ నమ్మకయుండితివేని మామకీ
నావయవంబు లన్నియు య ♦ థార్థముగాఁ బరికించి యంతటన్
భావమునందు సంశయముఁ ♦ బాసి యభీష్టముగాఁగ నిచ్చటన్
భావజకేళిఁ దేల్చునను ♦ బ్రాణసఖుండవు నీవు కావునన్.

సీ. అనుచు నవ్వనభామి ♦ యతిరహస్యస్థలం, బౌటచే నధికగో ♦ ప్యంబులైన
తనయంగములు చూప ♦ ధరణీసురవరుండు, మదిలోన నాశ్చర్య ♦ మగ్నుఁడగుచుఁ
జిత్తజబలముచేఁ ♦ జిత్తంబు నొంచిన, గాని ధైర్యంబుచి ♦ క్కంగఁబట్టి
యంగనయును దాను ♦ నాత్మీయపురికేఁగి, తనతండ్రితో యథా ♦ ర్థంబుగాఁగఁ
బలికి సారస్వతాఖ్యచేఁ ♦ బరఁగినట్టి, సోమవంతునితండ్రికి ♦ సకలమైన
యాత్మవృత్తాంతమును దెల్పె ♦ నతఁడు మీఁద, నెంతయు సుదుఃఖి ♦ తాత్ముఁడగుచు

గీ. బాలకులకిట్టియుద్బోధ ♦ పాటవంబు, దెలిపి పంపిన కుండినా ♦ ధీశుకడకు
నరిగి కోపానలం బాత్మ ♦ నలముకొనఁగ, నధికగద్గదరవముతో ♦ ననియెనిట్లు.

క. ఓరీ మూర్ఖ కువిద్యా, శూరులకున్ భూమిదేవ ♦ దుర్వ్యా
పారముఁ గఱపితివి దె చే, కూరెన్ దత్ఫలము నేఁడు ♦ క్రూరం బగుచున్.

క. సతియయ్యె నాఁడుమాయఁడు, హతియయ్యెన్ వంశమునకు ♦ నకటా యిఁక నా
పితృదేవతలఋణము నే, గతిఁదీర్పంగలుగువాఁడ ♦ ఁగపటవిచారా.

వ. అని మఱియు ననేక కోపవచనంబులు పలికి శాపదానోన్ముఖుం డైన యమ్మహీ
బృందారకునకు వందనం బాచరించి నాతపోబలంబునకు నీకుం దిరుగ పౌరుషంబు
సంపాదించెద శాంతుండవుగమ్మని, సాంత్వనవచనంబులు పలికి తదనంతరంబున.

గీ. రాజకోటీరపట్టపు ♦ రాణిఁగూర్చి, తపము గావించె నాధరా ♦ ధరవరుండు
శైలకన్యయు నంతసా ♦ క్షాత్కరించి, యతికృపాదృష్టి నతనితో ♦ ననియెనిట్లు.

చ. వినుము నృపాల యిట్టిపని ♦ విప్రునియందుఁ గనంగనయ్యెనేఁ
జనవున ఫాలలోచనుని ♦ శాసనమైనను గ్రిమ్మరింతుఁ ద
ద్ఘనతరభక్తలోకకృత ♦ కార్యముఁ ద్రిప్పఁగ సమ్మతింపన
ప్పనియిఁక నేల విప్రునకుఁ ♦ బౌరుష మిచ్చుట దుష్కరం బగున్.

క. సారస్వతునకు నొకకు, మారుఁడు జనియించు నింక ♦ మంజులవిద్యా
పారగుఁడు సుజనవినుతో, దారచరిత్రాభిరాముఁ ♦ డన్వయకరుఁడై.

గీ. సామవతియన్నయాపూర్ణ ♦ చంద్రముఖిసు, మేధునకుఁ బెండ్లిసేయుఁడు ♦ సాధు
[జనులఁ
దారమతి ప్రశంసించ నీ ♦ దంపతులకు, సుతులుగలిగెద రధికవి ♦ శ్రుతచరితులు.

సీ. అని యిట్లుభాషించి ♦ యాభవుపట్టపురాణి, యచ్చోట నంతర్హి ♦ తాత్మయైన
భూసురులాత్మజయ ♦ పురముఁ బ్రవేశించి, యుద్దేవిశాసనం ♦ బట్లసేయ
నుభయవంశంబులు ♦ నభివృద్ధిఁ గాంచెనో, మునిశిఖామణులార ♦ వినుఁడు మీరు
తరుణేందుధరుచరి ♦ త్రమ్ముచాలవిచిత్ర, మతనిభక్తులచర్య ♦ లంతకన్న
ననుచు సూతుండు శౌనకుఁ ♦ డాదిగాఁగఁ, గలుగు మునులకుఁ జెప్పినఁ ♦ గౌతుకంబ
దనరవారమ్మహాతపో ♦ ధనులుఁ గాంచి, ప్రణుతిఁ గావించి యానంద ♦ భరితులైరి

శా. కైలాసాచలనిత్యవాస శిశిర ♦ గ్రావాత్మజాజానసా
ప్రాలేయాంశు మనోహరస్మిత సుధా ♦ పానశ్రీలోలాల దృ

స్ఫాలాబాలశశాంకభూషణ జటా ◆ సందర్భవిభ్రాజితా
నీలగ్రీవజగద్విచిత్రకరణి ◆ శ్రీదశ్రీపశ్రీభావోదయా.

క. వటవిటపిమూలసంగతి, జటివరతత్త్వోపదేశ ◆ సమయసముదిత
స్ఫుటకారుణ్యసుధామయ, కటులకటాక్షప్రసార ◆ సర్వాకారా.

వనమయూరము. నీలగళ నీరనిధి ◆ నిశ్చలనిషంగా
బాలశశిమౌళికర ◆ భావితకురంగా
శూలధరకుండలిత ◆ సుందరభుజంగా
హాలహాలభంజనవృ ◆ షాధిపతురంగా.

గద్య—ఇది శ్రీశైలనివాస భ్రమరాంబాసమేత మల్లేశ్వరస్వామి కృపాపాత్ర
భారద్వాజ గోత్ర పవిత్ర పెనుమల్ల సోమమంత్రి పౌత్ర పెద
నీల ప్రధానపుత్ర సకల సుకవి స్తుత్య సోమనామాత్య
ప్రణీతంబైన సీమంతినీకల్యాణం బనుమహా
ప్రబంధంబునందుఁ బంచమాశ్వాసము.

సంపూర్ణము.